## —* కలియుగమునకుఁ దగిన పుత్రులు *—

ఆ॥ అస్వతంత్రులైనయట్టి యచలామరులఁ బిల్చి యచట సపార్వణముగ నవనినాథ!
శ్రాద్ధమును ద్విజుండు సల్పంగనా విపరీతమైన నద్ది వృథయె యగును. ౨౩౩
కం॥ జారజముఖ్యద్విజులను జేరిచి యేపైతృకంబు చేయంబడునో
యోరాజవర్య! యదియును నీరహి నిష్ఫలము. సంశయింపకు”మనుడున్ ౨౩౪
కం॥ అన నత్తక్ష్మాపాలుఁడు “మునీంద్రా! జారజాతిమహితశ్రాద్ధం
బేనియతఫలము నిడదను నీవడివిన భయముగలిగె నిజముగ నాకున్. ౨౩౫
సీ॥ కన్యయం బెండ్లాడి కాఁపురమునకు రా నావేళయందునఁ గన్న యర్భకుఁడును
దాఁ బెండ్లియాడిన తన్వంగి తనయాజ్ఞఁ బరువల్లఁ గన్నట్టి బాలకుఁడును
నడిగినవిత్తంబు నిడి యన్యునొద్దనుండి గ్రహించినటువంటి డింభకుఁడును
శరణమెవ్వరులేక చనుదెంచి తనచేతఁ బోషింపఁబడినట్టి బోట్టియుఁ బ్రతి
పన్నుఁడు సహోఢ కానీనులు న్నరేంద్ర! కుండగోళులు ముఖ్యశిష్యుండు మిత్తి
వారివలనను రక్షింపఁబడినవాఁడు స్వవనసంస్థాపితాశ్వద్ధపాదపమును ౨౩౬
కం॥ ఈపన్నిద్దరు సుతులని మా పూర్వికుఁడైనయట్టి మనువు వచించెన్.
బాపులఁగా గణియించుచు నీపగిదిం జెప్పెదీ విదేమి మహాత్మా!” ౨౩౭
ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ “డయ్యది సత్యంబె, సుతులె, వారు ధర్మస్మృతిని జూడ.
మూఁడుయుగములందు ముఖ్యులే యవ్వారు. కలిని మాత్ర మట్లు కారుతలఁప. ౨౩౮
తే॥ అట్టిసంతతి సత్వాఢ్యులైనయట్టి తద్యుగంబులవారికిం దగుఁగాని
తగువె యత్యల్పమేధసులగుచునుండునట్టి కలికాలజనముల కఘములిడక. ౨౩౯
కం॥ ఏతద్వ్యవహారంబు ప్రసాతద మాఁగలియుగమున. బహ్వల్పబలం
బై తోఁచు తద్యుగప్రజ కీతీరు విధింపఁబడియె ఋషితతిచేతన్. ౨౪౦
తే॥ కలిని సవర్ణపుం బెండ్లి సలుపఁదగమి నప్పు డవివాహితలతోడ వ్యభిచరించి
యోనిసంకర మొనరింప నొదవునట్టి సుతుల విధమును వచియింతు క్షితిప! వినుము.
సీ॥ బ్రాహ్మణస్త్రీయందు బ్రాహ్మణునకుఁ బుట్టు నధమాధముఁడు చాఁడనఁగఁబడెడు
బ్రాహ్మణస్త్రీయందు బాహుజునకుఁ బుట్టు వాతండు సూతుఁడం చనఁదగియెడు.
బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుం బుట్టువాఁడు మాగధుఁడునాఁ బలుకఁబడెడు.
బ్రాహ్మణస్త్రీయందుఁ బదజునకుం బుట్టు చెట్ట యంత్యజుఁడునాఁ జెప్పఁబడెడు.
కాన నిట్టిసుతులు కలిలోన వర్జితుల్. ద్వాదశప్రకార తనయులందు
నేడుగురు పుత్రులు లేరు కులహాంత. ఒర్విఁ ద్రోయుదురు స్వపూర్వికులను.
సీ॥ కన్యారికంబునం గడుఁ బ్రీతిఁ బెండ్లాడు జాతియం దొదవు స్తనంధయుఁడును
బల్లిదంపులచేతఁ ద్రయ్యుక్తవిధముగా హస్మించి దత్తుఁడా నాత్మజుఁడును

గ్రయథనంబు నొసంగి కైకొనఁబడినట్టి పూతాత్మగోత్రజ పుత్రకుఁడును
దిక్కులేక కల్లాడఁ దెచ్చి పెంచ్చిన ప్రేమఁ బోషింపఁబడినట్టి బొట్టియఁడును
ప్రాణసంశయదశను గాపాడఁబడిన పిల్లఁడును దనసన్నిధి విద్య నేర్చి
నట్టి దిట్టఁడు స్వారామమందు వేయఁబడి పెరింగెడి పిప్పలపాదపమును ౨౪౩
ఆ॥ భూప! ఘోరమైన పున్నామనరకంబునందుఁ గూలు పురుషు నవననేతు
రిట్టుగాన వీరలేడ్గురు సత్పుత్రులై రి కలియుగంబునందుఁగూడ. ౨౪౪
సీ॥ మగతనంబేలేకొ మఱియెట్లొ తనభార్య నొరుసెజ్జఁ జేర్చువె నొరలుపాఁడు
మృతభర్తృకయొ విసర్జితభర్తృకయొ రైన యన్నుఁ బెండిలియాడి కన్నవాఁడు
పెండ్లాడుటకుమున్నె పితృగృహంబున స్వీయకాంత గర్భంబునం గలుగువాఁడు
తా బ్రదికియె యుండఁ దనయాజ్ఞ లేకుండఁ బత్ని జారునివల్లఁ బడయువాఁడు
చచ్చిన పదంపడి బొజుంగు సంగమమునఁ బుట్టువాఁడును స్వర్గముం బొందియున్న
వాని నేనియు మహీంద్రోయుఁ గాన జారజాతు నామంత్రణము నేయఁ జనదు తిథిని.

## — ♦ శ్రాద్ధమందలి మంత్రపూర్వకవిధి. ♦ —

కం॥ అన నెకిమీఁడు "శ్రాద్ధమున కర్హు లనర్హులు నైన విప్రులన్
వినిచినవాఁడ వార్య! వెనువెంటనె నాకు బహుప్రకారులౌ
తనయుల నేర్పరించితివి. తత్పితృతృప్తికి నేస్తు శ్రాద్ధమం
దొనరుచు మంత్రపూర్వవిధి యొయ్యనఁ జెప్పఁగదయ్య ప్రెుక్కెదన్" ౨౪౬
కం॥ అన భర్తృయజ్ఞముని యిట్లనియెను. "శ్రాద్ధమునుగూర్చి యామంత్రితులౌ
ఘనవిప్రులఁ దనయింటికిఁ గొనివచ్చి సగౌరవముగఁ గుతపంబగుడున్ ౨౪౭
శ్లో॥ ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః
యే అత్రవిహితా శ్శ్రాద్ధే సావధానా భవంతు తే. ౨౪౮
మ॥ అని ప్రార్థించి యజించి చుట్టును దిప్రపర్యాయంబు లత్యంతభ
క్తి నియుక్తిన్ భ్రమణంబుసేసి యట ధాత్రిన్ జానువు లొప్పి చం
దనపుష్పాక్షతయుక్త మర్ఘ మిడనౌ ధ్వస్తారిరాజన్య ప
త్తన! యానర్త! ప్రవక్ష్యమాణమగు మంత్రం బిట్లు వాక్రుచ్చుచున్. ౨౪౯
శ్లో॥ అర్ఘ్యమేవం ప్రిగృహ్ణంతు మయాదత్తం ద్విజోత్తమాః
పాదప్రక్షాళనార్థాయ ప్రకుర్వంతు మమప్రియం. ౨౫౦
కం॥ అంతన్ విశ్వేదేవుల నెంతయుఁ గీర్తించు చొకటు నిల యలికి శుభ
స్వాంతత నక్షతలుం దిల లంతటనుం జల్లి జందె మపసవ్యముగన్ ౨౫౧
తే॥ తొడిగి పితరులఁగూర్చి యప్పుడమిమీఁద దిలవిమిశ్రితకుశలను ద్విగుణముగను
వైచునది. యిట్లు సకలదైవతక్రియలును సవ్యముగఁ జేయవలయును క్ష్మాధిరాజ!

కం॥ నాందీముఖాన్యమగు పితృబృందంపుం గ్రియలనెల్లఁ బృథ్వీరమణా!
జందెం బపసవ్యము దొడుగం దగు శ్రాద్ధములయందుఁ గర్తల కపుడున్. ౨౫౪
కం॥ చేతనయినంతమంది ద్విజాతులఁ గూర్చుండఁబెట్టఁజను సాధుజన
త్రాతా! విశ్వేదేవుల ఖ్యాతస్థానమునఁ బ్రాఙ్ముఖంబుగ నుండన్. ౨౫౫
కం॥ పితరులస్థానమున ద్విజత్రితయత్రితయంబొ లేక త్రితయమొ యొకరో
నుతుచే నుత్తరముఖముగ క్షితిపాలకవర్య! యదియొక్రియ సంస్థాప్యుల్. ౨౫౬
శా॥ "దేవానామిద మాసనమ్మనుచు" నాదేవళ్ళకుం దద్విధం
బావెన్వెంటఁ బితృత్రియంబునకు మన్త్రాంతప్రయోగంబుతో
వైవంగావలె నాసనంబు నృపతీ! వారందుఁ గూర్చుండి య
ప్డే వారుర్వ్వ "సుఖాసనం"బనుచు నెంతేనిం బ్రమోదంబునన్. ౨౫౭
తే॥ అపుడు ఋజుదర్భజలసంయుతాక్షతలును విషమదర్భలు జలతిల ల్వాయవలయు
వారి కుడియెడమలయందు వరుసగాను. జేతులం బెట్టఁదగదవ్వి ధూతమతిని.
కం॥ ఆతీరున జలదర్భలు చేతులనే పెట్టఁబడినఁ జీయని పితరుల్
పీఠ తదాసనులయి సంప్రీతిని నటఁ గూరుచుండ మేకొన రాత్మన్. ౨౫౮
తే॥ పితరులను దేవతలను వేర్వేఱఁ జేయనగును నావాహనము ద్వితీయావిభక్తి.
మఱియొకవిభక్తిఁ జేసిన నరుగుదేర రాఁకటం గుందుచుంగూడ నహహా! వారు.
కం॥ విశ్వేదేవాహూతిని "విశ్వేదేవాస" యనఁగ వెలసెడి మనువున్
విశ్వేశ! యుచ్చరించుచు వే శ్వేతాక్షలఁ దలల వేయఁగవలయున్. ౨౬౦
కం॥ అంత "నుశంతస్త్వా"నామంత్రించి పితాళ్ళ వారి మస్తములు తిలా
క్రాంతములు సేయునది. "ఆయంతున"యను మంతరంబున నటు జప్యంబా.
మంత్రము॥ శంనోదేవీ రభిష్టయ. ఆపోభంతు పీతయే. శంయోరభిస్రవంతునః. ౨౬౧
ఆ॥ క్షత్రియాగ్రగణ్య! స్వాహాయుతముగ నీమంతరమును జదువు చంత దేవ
తార్ఘ్యపాత్రలెల్ల నర్ణఃపరిపూర్ణముల్ సల్పవలయుఁ జుమ్ము శ్రద్ధతోడ. ౨౬౩
ఆ॥ అందులో "యవోసి యవయా"యనెడి మంత్రమును బఠించుకొనుచుఁ బుష్పచంద
నాక్షతలను వైచి యర్ఘ్యంబొసంగనా వారి సహపవిత్రపాణులందు. ౨౬౪
కం॥ సస్వాహాకారం బటు జ్యాస్వామిచయాగ్రగణ్య! "యాదివ్యా" యన్
సస్వరమనువున నుదకము భాస్వరపితృదేవతార్ఘ్య పాత్రల నిడవా. ౨౬౫
మంత్రము॥ తిలోసిసోమదేవత్యో గోసవో దేవనిర్మితః
ప్రత్నవద్భిః ప్రత్తః స్వధయా పితౄ నిమాన్ లోకాన్ ప్రీణాహి నస్స్వధా.
కం॥ ఈ పైమంత్రముఁ జదువుచు నాపాత్రలఁ దిలలవైచి "యాదివ్యా" యం
చాపై జెప్పిన మనువున భూపాలా! యర్ఘ్యమీయఁబోలును బిదపన్. ౨౬౬

—* అర్ఘ్యానంతర సమంత్రక శ్రాద్ధము. *—

ఆ॥ అంత నర్ఘ్యపాత్రలన్నియుఁ బితృపాత్రకడను మంత్రపూర్వకముగ బోర్ల
వేయవలయు. నట్టివేళ నాయుష్కామి తజ్జలంబు చూడఁదగదు శౌరి! ౨౧౮

కం॥ ఆపైఁ జందనమాదిగ దీపాంతంబును నొసంగి దేవతలకు న
ట్లే పితరులకును బూజనమాపై నానీతపాకుఁడై కడుభక్తిన్ ౨౧౯

ఆ॥ యజ్ఞసూత్రములను నపసవ్యముగ దొడ్డి "యగ్నియందు నేను హవనకర్మ
మాచరించువాఁడ నాజ్ఞయిం డో పితృదేవతాత్మ లవనిదైవతములు!" ౨౨౦

కం॥ అనియాగతి సంప్రార్థించినవాఁడై శ్రాద్ధకర్త క్షితిసురతతి గో
బ్బునను "కురుష్వ"యటంచని యనుమతియిచ్చుటయు నరిగి యనలముకడకున్
మంత్రము॥ అగ్నయే కవ్యవాహనాయ స్వాహా. సోమాయ పితృమతే స్వధా. ౨౨౧

కం॥ అని వేలిచి శేషము శ్రాద్ధనిమంత్రితపాత్ర నునిచి తదభిహితాన్నం
బును వ్యంజనములు వడ్డన మొనరింపంబడుదుఁ బాత్ర నుంచి కరంబున్ ౨౨౩

కం॥ పృథివీసురు నంగుష్ఠం బధిపా! పట్టుకొని పెట్టి యన్నమునదుమన్
"పృథివీ తే పాత్ర"మ్మను మధుమథనునిబుద్ధి నొక్కమా ఽనవలయున్. ౨౨౪

శా॥ ప్రత్యక్షంబుగ నాత్మహస్తమునఁ దత్పాత్రంబులం దుప్ప నా
చిత్యంబెన్నక వేసినన్ సగము భక్షింపంగఁబడ్డట్టిదౌ
ప్రాత్యంపున్నెయి తెచ్చిపోసినను గోత్రాకాంత! తచ్ఛ్రాద్ధపుం
గృత్యంబంతయు వ్యర్థమయ్యెడిని. నింకేమంచు వాక్రుచ్చ్వనా. ౨౨౫

తే॥ అట్లుకాకుండ నన్నిపదార్థములనె యడిగి వడ్డించి సంతృప్తులగుటయెఱిఁగి
యగ్రభాగంబునం గొంతయన్నముంచి వక్ష్యమాణంపువాక్యంబు వలుకవలయు.

శ్లో॥ అగ్నిదగ్ధాశ్చయేజీవా యేప్యదగ్ధాః కులేమమ
భూమౌదత్తేనతృప్యంతు. తృప్తాయాంతుపరాంగతిం. ౨౨౬

కం॥ పదపడి కొంచెముకొంచెం బుదకంబును విడిచి యచట నొగి గాయత్రిన్
వ్యాది ముమ్మాఱును జపించియు "మధువాతా"యను నీఱొక్కమంత్రముగూడన్

తే॥ చెప్పి "తృప్తాస్థ"యని ప్రశ్న చేసిద్విజుల భుక్తి మిగిలినయన్నంబు బంధువులకుఁ
బెట్టుట కనుజ్ఞ గైకొని పిత్ర్యమైనయట్టి యుచ్ఛిష్టపాత్రల యంతికమున ౨౨౭

ఆ॥ దక్షిణాప్లవముగ ధరఁ బరిష్కృతఁజేసి దర్భ పఱచి యచట దానిమీఁద
జలములుంచి పిండములు పెట్టి పితృతీర్థమునను మగుడ నీళ్ళుపోయవలయు. ౨౨౮

ఆ॥ పిండపిండమందు వేర్వేఱుగా దారములనుబెట్టి యంత భూమిసురులఁ
బోలెఁ బూచితములఁ బోనరించి యాచమనంబు సేయవలయు నరవిభోజ! ౨౮౧

కం॥ ప్రక్షాళితకరచరణత నాత్మఁజమ పితాళ్ళకెరఁగి యటుతరువాతన్
బ్రోక్షించి సవ్యముగ క్ష్మాభృత్క్షా! యాచింపవలయు నగ్రాశీస్సుల్. ౨౮౨

ఆ॥ అటుపయిం బితాళ్ళ కక్షయ్యసలిలం బోసఁగి పవిత్రములను సరిగ మీఁది
కగుపఱచి 'స్వధా' యటంచుఁ గీర్తించి 'యస్తుస్వధా'యటంచు క్షోణిసురులు ౨౮౩

కం॥ అనుటయుఁ బిండంబులపై ననిచి మధువు పాయసము తిలోదకమును నో
యన్నన 'నూర్జస్వ' యనంజనుమనువునఁ బితృపిండములను మఱియుంచఁగనౌ. ౨౮౪

ఆ॥ అర్ఘ్యపాత్రములను నటుపయి వెలికిలఁద్రిప్పి స్వర్ణమయము దేవతలకు
వెండి పితరులకును విధ్యుక్తదక్షిణ యిచ్చునది వసుంధరేశ భక్తి! ౨౮౫

కం॥ తరువాత జందెమును గుడికరమునకుం దొడిగి శ్రాద్ధకర్త మహీశా!
గరిమఁ బితృత్రయమునకును వరుసగ స్వస్త్యుదకములను వదలఁగవలయున్. ౨౮౬

కం॥ అమీఁద శ్రాద్ధనియమితభూమిసురోచ్ఛిష్టపాత్రముల నెత్తవలెన్.
స్త్రీమాణవకప్రముఖులు తా మాపాత్రలను దీయఁదగ దెన్నటికిన్. ౨౮౭

ఆ॥ ఈప్రకారముగను నెంగిలివిస్తళ్ళ స్వయముగానెతీసి శ్రాద్ధకర్త
క్షాళితస్వపాదకళయయుఁగలుండయి భూసురులకు భక్తి దోసిలొగ్గి ౨౮౮

శ్లో॥ అఘోరాఃపితరస్సంతు. అస్మద్గోత్రం వివర్ధతాం.
దాతారో నోభివర్ధంతాం. వేదాస్సంతతిరేవ నః.
శ్రద్ధా చ నోమా వ్యగమ. ద్బహుదేయంచ నోస్త్వితి.
అన్నంచ నో బహుభవే. దతిథీంశ్చ లభేమహి.
యాచితారశ్చ నస్సంతు. మాచ యాచిష్మ కంచన. ౨౯౦

కం॥ అనిప్రార్థించి యిచే దీవనలవుఁగాకనుచుఁ గర్త వచియించుటయున్
వివిప్రులు సంప్రీతిని ననవలయుఁ దథాస్తటంచు నవనీనాథా! ౨౯౧

ఆ॥ స్వస్తి కొఱకు ధరణి సవ్యంబుగం బితృపూర్వ ముదకములను బోయవలయు.
వసుమతీకళత్ర! వాజేయపెడిబుక్కు నని పవిత్ర మవల మనుపవలయు. ౨౯౨

కం॥ అమావాస్యయనన్ క్ష్మామండలి ఖ్యాతమైన సన్మంత్రముచే
నామహీసురులకు వలగొని ప్రేముడి నటుఁ గూరుచుండఁబెట్టి తదంఘ్రుల్ ౨౯౩

ఆ॥ అదిమిపట్టిపిపికి యవిపీ యాసీమాంత మన్న బలివిచైచి యధికనిష్ఠ
పానమాని గగనమణి యుండఁగానె భోజనముసేయవలయు మనుజనాథ! ౨౯౪

ఆ॥ ప్రొద్దుగ్రుంకుపిదప భుజియించుచో వ్యర్థమగును శ్రాద్ధకర్మ మవనిపాల!"
యనివచించుటయును నానర్తభూపాలుఁ డెడఁదలోన మఱియు నెఱుఁగఁగోరి

## —* ఏకోద్దిష్ట సపిండీకరణవిధి *—

క॥ "ఏకోద్దిష్టశ్రాద్ధం బేకరణిం జేయవలెనొ యెఱిఁగింపఁగదే
యోకారుణ్యనిధీ!"యని వాకొనుటయు న త్తపస్వివరుఁ డిట్లనియెన్. ౨౯౬
క॥ సంచయనమునకును గావించెడి శ్రాద్ధములుమూఁడు. విను. మరణంబున్
గాంచినయెడ నడుమను శవముంచినయెడ దహనకర్మ మొనరిచినయెడన్ ౨౯౭
ఆ॥ అవ్విగాక మృతున కాద్యతృతీయపంచమదినంబులందు సప్తమమున
నవమదశమములను నవనీశ! కలవు శ్రాద్ధంబు లాఱు పెట్టఁదగిన వీఁకను. ౨౯౮
తే॥ అన్నియుంగూడి శ్రాద్ధంబు లగును దొమ్మి. దందు వైతరణీశ్రాద్ధ మంతిమమునఁ
బెట్టఁదగినది. యయ్యది పెట్టుపిదపఁ బ్రేత సంతృప్తిఁబొందుఁ బృథ్వీకళత్ర! ౨౯౯
క॥ ఆవాహనంబు పూజ్యము. దైవం బంతకునుసున్న తచ్ఛ్రాద్ధమునన్.
గావింత్రేకపవిత్రత నీవివరంబెఱిఁగి విబుధు లేకార్ఘ్యముగన్. 300
క॥ ఒనరిచి తృప్తిప్రశ్న మ్మనంతరము కోలఁదిస్వదిత మటువలెఁ గావిం
మనది. యభిరమ్యతామను మనువున వదలునది యల్లమహీసుసు నంతన్. 30౧
ఆ॥ చీలిపోకయుండ ఛిన్నంబుగాకుండఁ దనరుచున్న రెండుదర్భపోఁచ
లవనినాథవర్య! యవియె యేకోద్దిష్టములఁ బవిత్రమనుచు ననుకొననగు. 30౨

వ॥ సర్వత్ర పితః, గోత్ర, శర్మన్, అనియు, తర్పణమున, పితా, గోత్రః, శర్మా అనియు, సంకల్పమున, పిత్రే, గోత్రాయ, శర్మణే, అనియు, అక్షయసలిల దానంబున, పితుః, గోత్రస్య, శర్మణః, అనియు, ఆసనమున మాతః, అనియు సంకల్పమున మాత్రే, అనియు, అక్షయసలిలదానంబున మాతుః, అనియు 303

క॥ గోత్రేయనియును మఱియును గోత్రాయైయనియు నట్టులె గోత్రాయాయం
గోత్రిణయనసత్కరుణాపాత్ర! ప్రథమాదిగా విభక్తు లెఱుఁగుమా. 30౪
దేవి దేవ్యై యటంచుఁ గీర్తింపవలయు. మఱియు దేవ్యాయటంచును మాతననఘ!
ప్రథమయుఁ జతుర్థి షష్ఠి యీవిధముగాను శ్రాద్ధసంసిద్ధికై ప్రయోజ్యములుచుమ్ము.
రహితవిభక్తికముగనో యవిహితంబగు నవ్విభక్తి వెట్టియొ కృతమా
హిత శ్రాద్ధంబైనను మహీ నకృతమ. చెందదద్ది మఱి పితరులకున్. 30౫
గాన యత్నపూర్వకముగ విజ్ఞానధనాఢ్యుఁడు యథోక్తమా విభక్తు
లు నిరంతరంబుఁ బొనరింపనగు శ్రాద్ధకర్మమందు విధిని గాశ్యపీశ! 30౬

తే॥ అటు సపిండీకరణము సమాంతమందు జరుపవలయును నాన స్థధరణిపాల!
వృద్ధి యొక్కవేళ నే తెంచెనేని యరసి పూర్వమేనియుఁ గావింపఁ బోలియుండు.

ఆ॥ పార్వణోక్త విధిని సర్విఁ ద్రిదైవత్యముగ నదైవికముగ మొనసి ప్రేతఁ
గూర్చి చేయవలయు గురుత నేకోద్దిష్ట మేకపాకమున మహీబుభుజ! ౩౦౯

ఆ॥ ప్రేతకొఱకుఁగాను బ్రీతిఁ గల్పించిన యర్ఘ్యపాత్రదీసి యవనిపాల!
త్రిపితృపాత్రలందుఁ ద్రివిధంబుగం జించి యుంచవలయు శ్రద్ధ యుట్టిపడఁగ.

తే॥ అట్లు పిండంబు త్రివిధంబు లాచరించి 'యే సమాన' యనం గర మెసఁగుమంత్ర
ములను రెండును బఠియించి యొఱయు శ్రద్ధఁద్రిపితృపిండంబులం గల్ప నపుడు మృతుఁడు

కం॥ ప్రేతత్వవిముక్తుండై ప్రీతిం జెందును మహీశ! పితృపూర్వముగా
నాతర్వాత యథాక్రమ మేతత్పిండములమీఁద నించుక జలముల్ ౩౧౨

కం॥ ప్రోక్షించి గంధమునఁ బుష్పాక్షతలను ముగుర శ్రద్ధనర్చించి యిలా
ధ్యక్ష! పితృత్రయి పేళ్ళను స్పష్టతరముగ నుచ్చరించి యట్లు చతుర్థున్ ౩౧౩

తే॥ విడువవలెఁగాని కొందఱువిడువకట్లు ప్రేతశబ్దముతోడనే పితకు ముందు
పెట్టుచుండిరి యిల శ్రాద్ధ. మట్టిచేత నామతముగాదు మేదినీనాయకాగ్ర్య! ౩౧౪

కం॥ క్షయతిథి భాద్రచతుర్దశిఁ బ్రియతమ! యారెంటివిడి సపిండీకరణం
బయినతరువాత నొప్పదు త్రయి యేకోద్దిష్ట మనెడి శ్రాద్ధముజరుపన్ ౩౧౫

కం॥ ఎవఁడు సపిండీకృతుఁడై పావణించెడి ప్రేత భిన్నమగు పిండమునం
దవిభాగ యోజనసేయునో యపునాతఁడు పితృహాఁ,దద్ది యకృతంబ యగున్.

ఆ॥ తండ్రిచచ్చిపోయి తాతజీవించువోఁ దండ్రి పేరుచెప్పి తాతతండ్రిఁ
పేరొకనంగవలయుఁ బృథ్వీశ! తాత ప్రత్యక్షముగనె యచట నారగించు. [illegible]

ఆ॥ తాత క్షయదినమున ధరణీశ పార్వణశ్రాద్ధ మాచరింపఁ జనునుజుమ్ము.
తనదుజనకువిడిచి తాత కర్హనియుఁ బెట్టఁదగదు పితకు భీతుఁడగుచు. ౩౧౭

కం॥ సకలామావాస్యలఁ దప్పక పార్వణమాచరింపవలె మృతపితకుం.
డకలంక! ప్రేతపక్షమునకు నక్షమనుగూడఁ బార్వణము చేయంగన్. ౩౧౯

తే॥ ఎంతవఱకు సపిండత యేర్పడదో యంతవఱకును బితృపక్షమందుఁ బితకుఁ
దగదు శ్రాద్ధంబు పెట్టఁ,బితామహాదులకు నొనర్పఁగవచ్చు నిలాతలేశ! ౩౨౦

కం॥ పితృపిండంబులతోడం గృతసాపిండ్యుండుగాక కృతసుకృతుండా
పితయును బ్రేతగనుండెడు. క్షితిపా! సాపిండ్య మందుచే నేర్పడియెన్. ౩౨౧

ఆ॥ ఎవఁడుచేసికొన్న యేన సుకృతముల వార లన్యయోనిఁ బడియు నచట
వంశభవులొసంగు వారిప్రభృతులచేఁ దృప్తిఁబొందుచుంద్రు ధీర" యనుడు ౩౨౨

కం॥ "పుత్రుల పౌత్రుల కలలం బిత్రాదులువచ్చి యేమె పెట్టుమటంచుꠂ
రాత్రులఁ గోరుచునుందురు. ధాత్రీసుర! యేమగునిది? దయ నుడువఁగదే" ౩౨౩

కం॥ అని యానర్తుండడుగుడు మునివర్యుఁడు "గతులులేక పొక్కుచుఁ బ్రేత
త్వనియుక్తినుండువారలు జననాథా! వచ్చుచుంద్రు స్వప్నంబులలోꠂ" ౩౨౪

కం॥ అని వక్కాణించుటయును "ననుఁగుం బుత్రకులులేని యవ్వారల కో
మునివర! సాపిండ్యం బె? ట్లనవుడు నృపుతోఁడఁ దపసి యపు డిట్లనియెꠂ. ౩౨౫

తే॥ "ఎవరి కౌరసతనుజాతుఁ డేరుపడఁడొ యతఁడు నాలవవాఁ డెట్టులగును దలఁచు
నోగిఁ బ్రకర్షంబుగాఁ బొందుచుండుఁగానఁ బ్రేతయనిచెప్పఁబడియెడుఁబృథివి మృతుఁడు.

తే॥ సుతుఁడొ తోఁబుట్టువో లేక సతియొ మృతున కొనరుపꠂవలె సాపిండ్య
మోనృపాల!
కానిచో క్షేత్రజాదికై కాదశాత్మజాల సుతప్రతినిధులఁగాఁ దెలియవలయు. ౩౨౬

కం॥ కాలమున నుత్తరక్రియ మేలుగఁ గాకుండిన నపమృత్యువశులకుం
బోలెను నారాయణబలి వాలాయంబుగను జేయవలెఁ బ్రేతత కోꠂ. ౩౨౭

ఆ॥ ఆత్మహంతలకును నవనీసుపర్వుచే మరణమొందినట్టి మనుజులకును
నాచరింపవలయు నదియె నారాయణబలి" యటంచు నిట్లు పలుక నతఁడు ౩౨౮

ఆ॥ "ఎట్లుమృత్యువెనయు నిలఁ బురుషుండుదా? నేసుకర్మమునను నేగు దివికి?
ముక్తియెట్లువడయు మునినాథ! నిరయమం దేలకూలు?" ననుడు ఋషివరుండు

—* నరకములు తన్నివారణోపాయములు *—

ఆ॥ పుణ్యపాపములును బూర్ణమౌ జ్ఞానముం గలవు ప్రజకు మూఁడుగతులు. వానఁ
బుణ్యమునను స్వర్గమును బాపమున నరకమును జ్ఞానమునను నమృత మొదవు.

శా॥ ఈయర్థంబు భవిష్యభీష్మ నల శ్రీకృష్ణుండు తోడ్పాటుగా
డాయం బోయి యుధిష్ఠిరుండు "యమువీటం బాపకృత్ప్రాణ్యముల్
హేయంబు ల్గలవంటు నారకము లవ్వెన్నో. కిమేనస్సులꠂ
జేయం బ్రాప్తములౌనొ. నిండుకృపతోఁ జెప్పంగదే" నావుడుꠂ ౩౩౦

తే॥ ఆతఁడిట్లను. యమలోకమందు వత్స! యేకవింశతినరకంబు లెసఁగుచుండు.
జంతువులు స్వస్వకర్మానుసారముగను నచటికింజని కృఛ్రంబు లనుభవించు. ౩౩౧

తే॥ చిత్రుఁడు విచిత్రుఁడను పేళ్లఁ జెలఁగుచుందు రచటఁగాయస్థు లిరువు.రందఘములను
చిత్రుఁడుం జిత్రుఁడాదిల శ్రేయములను వ్రాయుచుందురు యత్నపూర్వకముగాను.

సీ॥ మఱియు నగ్రాహుండనంగ బరఁగెడివాఁడును వికరాళుఁడను సంజ్ఞ వెలయువాఁడు
వక్రనాసుఁడన వర్తిల్లువాఁడు మహోదరుండను పేర నున్నవాఁడు
సౌమ్యాహ్వయంబుతో సంయుక్తుఁడగువాఁడు శాంతుండనాఁబడు శాంతియుతుఁడు
నంధుఁడన్ సంక్రావ్యనామంబుగలవాఁడు నటు సువాక్యుండను పటుమతియును
యముని దూతలు. వారియం దాద్యులైన భయదరూపులు నలువురం బాతకులను
మంచిరూపంబుగల కడమ నలుగురును సుకృతులను యమపురికిఁ జేర్చుదురు సతము.
తే॥ వారివశమున లెక్కింపవలనుగాని యంతమంది భటుల్గల రనఘ! వారు
చిత్రుఁడు విచిత్రుఁడును వ్రాయుపత్రములను గొంచుఁ జని యందుఁగలరీతిఁగొంక కెడఁద
తే॥ అప్సరోగణసేవిత మగు విమానములను నెక్కించి ధర్మంబు సలుపువారిఁ
గట్టియుం గొట్టియుం గ్రూరకర్మరతులఁ బట్టుకొనిపోవుదురు యము పట్నమునకు.
తే॥ వారలకు బాసటగనుండ జ్వరముఁ దొట్టి వ్యాధులును నాటరొనిమిది యముని చేతఁ
గల్పితము. లవ్విచని మును కైవసంబు చేసికొనుచుండుఁ బ్రజ యుధిష్ఠిర! బలిమిని.
తే॥ అంతటం గింకరులు పోయి యచటనుండు నరుల కగుపడకుండఁ దన్నాభిమూల
సంస్థితప్రాణవాయువు సంగ్రహించి తనువు నటుడించి యమమార్గమునఁ జనుదురు.
తే॥ ఎనుబదియు నాలు వేలయోజనములపయి నున్న దయ్యమపురి యందు నున్న చోట్ల
కచట వైతరణీసమాఖ్య నదియొకటి రెండుపాయలఁ బ్రవహించుచుండు నెపుడు.
కం॥ ఒకపాయను జలములు వేఱొకపాయను నెత్రు నడుమ నురుశస్త్రములున్
బ్రకటముగఁ గలిగి యది పాండుకుమారా! ప్రాణులకుఁ గడున్ భయదంబా. ౩౮౧
ఆ॥ మేనువోఁగువేళ మేదినీసురునకు ధేనువిచ్చువాఁడు దానితోఁకఁ
బట్టుకొని తరించు భరతర్షభా! తాను జలములున్నపాయ శ్రమము నాక. ౩౮౨
కం॥ ఇతరుఁడు తనచేతులతో నతికష్టమువీఁదు నీఁదియలసినవాఁడై
శతయోజనవిస్తృత శోణితతరంగిణి దాఁటు సేర్వఁగవలయున్. ౩౮౩
ఆ॥ కాన మనుజు లంత్యకాలంబునందు గోదాన మాచరింపఁదగును. దాని
కలక ధర్మస్మృతిని నరుగు ధర్మిష్టుండు. పాపమార్గమునను బాసి యేగు. ౩౮౪
కం॥ వైతరణి యపరతటమున భీతిద మసిపత్రవనము భీట్లలరెడు. దు
ర్నీతిఁ బరభార్యఁ బరధన మేతులువ హరించు నాతఁ డిటఁ గోయఁబడున్. ౩౮౫
ఆ॥ అట్టి తూఁగుడ నాత్మజకృత నవశ్రాద్ధములను జేసి నరవి నచటి
కలుషులంపములను గలకల తలఁగంగఁబడక ముక్తుఁడగును బాండవేయ! ౩౮౬
ఆ॥ అవల నొక్క భూరుహము కూటశాల్మలియనఁగ వాఁడిముండ్ల నలరుచుండు.
బ్రేలుచుండ్రు క్రింద విశ్వానమూతకల్ తల్లక్రిందుగాఁగ దగ్ధులగుచు. ౩౮౭

ఆ॥ కూటశాల్మలిద్రు గురుశాఖలం దలక్రిందుగాఁగ వ్రేల నుంద్రుగాక.
తద్విముక్తి ధర్మతనయ ! యేకాదశశ్రాద్ధమునను జేసి సంఘటించు.
ఆ॥ అవలినరకమనఘ ! యంత్రాత్మకంబు. బ్రహ్మఘ్ను లనుభవింపనది తగినది. 3౪౮
వంశజుండొనర్చు ద్వాదశశ్రాద్ధంబు ద్వారమునను నగును దద్విముక్తి.
చం॥ పదపడి యుక్కుకంబములు ప్రజ్వలమానములౌచునుండు. దు 3౪౯
ర్మదమొగఁదల్పి యన్యతనుమధ్యలఁ బొందెడివాఁడు వోయి యా
పెదపెదయుక్కుకంబముల బిగ్గఁ గవుంగిటఁజేర్చవలెను. న
య్యాదియును దప్పు మాసికసమాచరణంబున వానికిన్ సుతా !
ఆ॥ ఇనుపకుండ్లకుక్క లిఁకఁ బ్రచ్ఛమాంసాశులను భుజించుచుండు బలిమి నగల. 3౫౦
దానివలన ముక్తుఁడౌను ద్వైపక్షికశ్రాద్ధమునను జేసి సత్యముగను.
ఆ॥ ఇనుపముక్కు కాకు లిఁకఁగొంచెమావల. స్త్రీ సరాగముగను జేసిచూచు 3౫౧
వాని గ్రుడ్లఁవొడుచు వడిఁ బట్టుకొని యవ్వి. మాను నది ద్వితీయమాసికమున.
తే॥ ఆపయిం గూటశాల్మలి. యట్టు లోహమయపు ముండ్లును గలవు. తన్మధ్యమునఁ 3౫౨
గొండెకాండ్రు బలాత్కృతి గుంజఁబడుదు. రదియుఁను ద్వితీయ మాసికంబైనదొలఁగుఁ
ఉ॥ రౌరవనారకంబు కడురౌద్ర మనంతరమందు. దానిలో
ఘోరతరాయుధంబులను గొట్టియు నెట్టియు బ్రహ్మహంతలన్
దూఱుదు రగ్గలంబు యమదూతలు. నాలవమాసికంబునన్
వారు విముక్తులౌదు రటువంటిమహాపదనుండి ధర్మజా !
తే॥ అవలినరకము క్షారోద. మటఁ గృతఘ్ను లడుగు లూర్ధ్వంబునం దుత్తమాంగ మవనిఁ 3౫౪
గాఁగ వ్రేలాడుచుందు రిక్కరణి. నేనవదగు మాసికమున ముక్తి వారి కొలయు.
శా॥ కుంభీపాక మనంతరం. బది మహాఘోరంబు. తద్దుర్గతిన్
డైంభప్రాణములన్ హరించు కటికన్ దండాభిసంధిం బ్రదీ
ప్తాంభోయోనిసుతప్తతైలమున నుం. త్రాబాధ షణ్మాసికా
రంభంబైన యనుత్క్షణంబ తొలఁగున్ రాజేంద్ర ! యింకేమనన్.
కం॥ పాములుఁ దేళ్ళుం గలదై యామీఁద నిఁకొక్క నరక. మట శాంభికులన్ 3౫౫
వేమఱు శిక్షిం. త్రేడవదౌ మాసికమునను జేసి యయ్యది వాయున్.
మ॥ అట సంవర్తకనామదుర్గతియొకం. డామ్నాయ విప్లావకుల్ 3౫౬
పటువాక్యంబుల సాధులం దెగడు దూశీల్ వహ్నితప్తంబులౌ
పటుకాలు ల్తమ కొండనాలుకలకుం బట్టించి లాగన్ భటుల్
త్రుటితస్వాంతములందుఁ బ్రాకృతములన్ దూషించుచుం ద్రచ్చటన్.
కం॥ అన్యతవాదిజనుల యంగంబుఁ గుక్కలు కొఱికి తినుచునుండు మఱియునచట. 3౫౭
నవ్వియొల్లఁ దప్పు కష్టమమాసికశ్రాద్ధదానమునఁ బ్రశాంతి వొందు. 3౫౮

ఆ॥ అగ్నికూటనరక. మతిదారుణం. బందుఁ గూటసాక్ష్యమిడిన క్రూరజనులు
యాతనను సహింతు. రవ్వా ర్నవమమాసికప్రదానమునను గాంత్రు ముక్తి. ౩౬౦
ఉ॥ అంతటనంతటన్ శితములై వెలుగొందెడి యినుపమేకులన్
గ్రాంతె మిఁకొక్క నారకము కానఁగవచ్చెడి. నందులోన స్త్రీ
హంతలు గేహదాహకులు నంతకకింకరతాడ్యమానులై
భ్రాంతిఁ జరింత్రు వారి. దశమమాసిక మా నరకార్తి మాన్పెడిన్. ౩౬౧
ఆ॥ అంత నిప్పుకుప్ప లంతట వ్యాపించి క్రాలు నేలయొకటి కానఁబడెడి.
నందు నెందుఁ దిరుగుచుంద్రు స్వామిద్రోహు. లదియుఁ బదునొకండవది హరించు.
ఉ॥ ఆదటఁ దప్తమైన యిసు మంతట గల్గిన దుర్గతిన్ ధరి
త్రీదయితుండు వచ్చెనని దిక్పథంబునఁ బాఱిపోవు సో
న్మాదులు పచ్యమానులయి ఘర్మస్థలి వ్రాలుచునుందు రెంతయున్
ద్వాదశమాసికంబునను దానికిఁ గల్గు విముక్తి ధర్మజా! ౩౬౩
తే॥ అన్యాయజాలిడు నేకొంచె మన్న రసమొ లేక యుదకంబొ కోరులుచు నీకరణిని
హాయనము పూర్తియగుదాఁక నధ్వమందె మృతులు వసియించుచుందురు మేదినీంద్ర!
ఆ॥ అబ్దపూర్తియగుడు నాత్మశుభాశుభకర్మములకుఁ దగిన ఘనఫలముల
ననుభవించుకొంచు నల ధర్మరాజు నంతికమునను వసింతు రకుటిలాత్మ! ౩౬౪
తే॥ అట్లు పదియైదునిరయంబు లనుభవించి మరల జన్మించెదరు వారు మహీతలమున.
నితరదేశంబునం బుట్టు హేతువాది. నిత్యతర్పణమున నతని కగుఁ దృప్తి. ౩౬౬
కం॥ స్వామిద్రోహరతపరిజ భూమీశ! కురాజ్యమందుఁ బుట్టును. హంతృ
గ్రామమున కిడినదానం దాముసు సంతృప్తిగాంత్రు తత్పంచజనుల్. ౩౬౭
కం॥ పితృదేవద్విజుల కనశ్వితభక్తుండగుచుఁ దిన్న పిసిని జనించున్
దతదుర్భిక్షంబగుభువి. మృతదివసశ్రాద్ధమునను దృప్తుం డతఁడౌ. ౩౬౮
ఉ॥ ఒండొరు సానురాగులయి యుండెడి దంపతులన్ దురూహమైఁ
గొండెముల న్వచించి విడఁగొట్టెడి దుర్మతి భార్య చండియై
యొండొనినం బడంచు నత మూరఁ జరించుచు గర్హ్యమానయౌఁ
బాండవ! కన్నెధార సుఖభాక్కులఁ జేసెడి వారి వెండియున్. ౩౬౯
శా॥ కన్యావిక్రయకారి కన్యనిడ విఘ్నం బెంచువాఁడున్ సదా
కన్యాసంతతితోనె యుంద్రు. సుతుఁ డొక్కండేని గల్గండు. త
త్కన్యల్ భాగ్యవిహీనలున్ విధవలై కావింత్రు ఘోరత్వ. మా
కన్యాదానమె వారి కందఱికి సౌఖ్యంబీ సమర్థంబగున్. ౩౭౦
తే॥ గ్రంథచోరుఁడు రత్నతస్కరుఁడుగూడ నధముఁడుం గుంటి గ్రుడ్డియుఁ గగుచునుండు.
గ్రంథదానంబువలనఁ దత్కల్మషంబు నీఁగి సుఖముండఁగలరు. వారిరువు రనఘ!
కం॥ ఇవి మర్త్యలోకనరకము. లవగతముం జేయఁజా శుభాశుభముల ని
య్యవి. తీర్థసేవనంబున నవు వీనికి శుద్ధి ధర్మజా!" యని యనుడున్ ౩౭౨

## —* నరకయాతనా నిరసనోపాయము *—

క॥ నోములునోమియే యోమంగఁబడెడినో కలుద్రావియును నరకమునఁ బడక
నేమముల్జరిపియే నిరయసంస్థుఁడుకాఁడొ బంగారుదొంగిలియుం గరంబు
హోమంబుసేసియే యుత్తమోత్తముఁడౌనో గురుభార్యఁబొందిన కూళయయ్యుఁ
దీర్ఘసేవనె దుర్గతిం గూలకుండునో కలుకలు ద్విజు గ్రీవ దఱిగికూడ
నారకంబునుండి నరుఁ డెవ్విధంబున ముక్తుఁడగునొ యఘము పొనరిచియును
"నాకు భయముగలిగె నరకస్వరూపంబు నాలకింప నడుగుచుంటి"యనుచు 323

ఆ॥ పాండవాగ్రజుండు ప్రశ్నించుటయు భీష్ముఁ డిట్టులనియె. "ధాత్రి నెవనియస్థు
లభ్రతటిని గలయు నవ్వాని కుండదు నరకబాధ. వినుము ధరణినాథ! 324

ఆ॥ విష్ణుపదిని శ్రాద్ధవిధి యేరి పేరునఁ జేయఁబడునొ సుతులచేత దేవ
యానముల వసించి యమపురిమీఁదుగాఁ జనఁగలారు వారు స్వర్గమునకు. 325

తే॥ పాపమునకు యథోక్తమౌ పాచితంబు జరుపుకొనువారలును మఱి స్వర్ణదాన
మొనరిచినవారలును దుర్గతిని బొరయరు. తక్కువారల కయ్యది తప్ప దధిప!

క॥ ఏలికముందఱ నుండుచు నాలంబున మరణమొందినట్టిరుగూడన్
గాలునిపురికిన్ దవ్వుగ మేలగు స్థానంబునందు మెలఁగెద రనఘా! 322

సీ॥ విశ్వేశ్వరుండుండు విపులనివేశమౌ కాశీపురీమధ్యదేశమునను
బాండవకౌరవ ప్రకటితక్షాత్రమై చెలువొందు నీ కురుక్షేత్రమునను
శౌనకాదిమహర్షి సందోహమునకు శరణ్యమౌ నైమిశారణ్యమునను
హాటకేశ్వరదేవు నాశ్రయబలముచే విగరమైనటువంటి నగరమునను
గంగ యమున సరస్వతి గలయునెడను నల ప్రభాసంబునను మృతి నొలయునెడల
నెట్టిపాపంబుచేసిన చెట్టయేని నరకమునుబొందఁ డో యుధిష్ఠిరనృపాల!

ఆ॥ వెయ్యదూడతోడఁ బెండిలిగావించి మైలకోడెనే పుమాంసు పేరఁ
గొడుకుచేత విడువఁబడు వాఁడు బ్రహ్మఘ్నుఁడయ్యు నరకబాధ నందఁ డధిప!

తే॥ శ్రీశు పదినుంచి ప్రాయోపవేశమునను ప్రాణములఁబాయునటువంటి పంచజనుల
భూప! చిత్రేశ్వరమునఁ బ్రాయోపవేశ మొనరిచినవారు నరకంబు కనరు కనరు.

సీ॥ కడుపునిండం గ్రోల గంజియైనను లేక తిరుగాడుచుండెడి దీనులకును
బరుల సాయములేక పదమేని యిడఁజాల కల్లాడుచుండెడి యంధులకును
గడు దూరగమనంబు గావించి యరుదెంచి బడలియుండినయట్టి పాంథులకును
గంగాదిజలపూర్ణఘటభారవాహులై యరుగుదేరెడి తీర్థయాత్రికులకుఁ
గాలమునఁగాని లేక యకాలముననుగాని బహుభక్తియుతముగాఁ గడుపునిండ
నన్నముంబెట్టివనిచెడి యందఱికిని నరకమనునది యెట్టిదో యెఱుకపడదు.

క॥ జలజాప్తుఁడు వృషభంబున మెలఁగఁగ జలధేను వటులె మృగశీర్షమునన్
వెలఁగఁగఁ దిలధేనువు విప్రుల కొసఁగనివాఁడు కనఁడుపో నిరయంబున్. ౩౮౩

క॥ సోమమున సోమనాథుని సోమగ్రహపర్వమునను జూచినవాఁడై
నేమమున నబ్ధిఁగ్రుంకిన యామనుజుఁడు నిరయబాధ నందఁడు తనయా!

క॥ రవి రాహుగ్రస్తుఁడుగా రవివాసరమందుఁ బోయి రవి సన్నిహితీ
భవద కురుక్షేత్రములం దవగాహనసేయఁ దొలఁగు నటు నరకంబుల్.

తే॥ కృత్తికాయుతయుత కార్తికీ సేవండు కలితవహానతఁ జని త్రిపుష్కరమునర్ఘను
దాఁ బ్రదక్షిణ మొనరించు తన్మనుష్య నయనములలోనఁ బడదుపో నారకంబు.

సీ॥ బురదలో దిగఁబడి యఱచుచుండినయట్టి యావు నీవలకీడ్చు నలఘుమతులు
నతిదైన్యవశత బ్రాహ్మణికిఁ దటస్థమౌ దాస్యంబుదొలఁగించు ధర్మరతులు
దొంగలకుం జిక్కి యంగలార్చుచునుండు నార్యుల విడిపించు శౌర్యధనులు
హంతకుఁ జేతియం దర్పితప్రాణుఁడౌ భూసురుం గాపాడు పుణ్యతములు
నరకగాములగుచు నవయ" రంచని యిట్లు పలికె భీష్ముఁడనుచు భర్తృయజ్ఞుఁ
డానతిచ్చె నట్టు లానర్తభూపాలమణికి రోహితాశ్వమనుజనాథ! ౩౮౪

—* జలశాయి యుపాఖ్యానము *—

వ॥ అని మార్కండేయమహాముని శ్రాద్ధకల్పమంతయు వక్కాణించె. నట్లు నాగబిలద్వారంబున జనార్దనుండు జలశాయియై వర్తించెడిఁ. బావనంబగు తద్బిలద్వారంబునం గ్రుంకి శేషపర్యంకశయను సేవించు జనుండు జన్మమరణపాతకంబునుండి ముక్తుండగు. వార్షికంబులగు చతుర్మాసంబులను సరీసృపశయానుఁడగు జనార్దను సభక్తికంబుగా సమర్చించిన జన్మరాహిత్యంబగు. మును పెచట మునీశ్వరులు ముచి కుందుఁ బూజించి తత్స్థలస్థ మృత్తికాగ్రహణంబున వైకుంఠంబునకుఁ జనిరి. చాతుర్మాస్యాకృత జలశాయిసేవనంబున సకలతీర్థస్నానఫలంబును సకలయజ్ఞాచరణఫలంబును సంప్రాప్తగోగ్రహమృత్యుఫలంబును బడసెదరు. మఱియును ౩౮౫

సీ॥ ఎపుడుఁ జూచిన నొడ్లయిల్లాండ్ర కౌఁగిళ్ళ మనుచుండు పరమదుర్మార్గుఁడేని
యెట్టి బ్రాహ్మణుఁగూడఁ దిట్టి సహింపమిం గట్టి కొట్టి వధించు కటికయేని
యేనాఁడుఁ గల్లుఁద్రావి మేనెఱుంగక వీథిఁ బొరలాడుచుండు దుష్పురుషుఁడేని
యేయింతియైనను నిష్ఠురాజ్ఞానిచోఁ గుతికెయొత్తిడి మహాక్రూరుఁడేని
నాల్గునెలలు జీవన శయాను సేవింప నార్యులార! ముక్తులై రహింతు"
రనుచుఁ జెప్పుటయును నా శౌనకాదిమునీంద్రు లంద ఱతని కిట్టులనిరి. ౩౮౬

ఉ॥ "పాలకడలిఁ బాపప్రాప్తి పెలఁద మారి యోగనిద్రవశత నుండునసుదు
రెట్టు లమ్మహాత్ముఁ డీబిలద్వారమం దయ్యె నుపకశయనుఁ డార్య! మరల?"

కం॥ అని మనమున సంశయపడి తను నడిగెడి యమ్మునీంద్రతతిఁ గనుఁగొని పెం
ల్లన రోమహర్షణాఖ్యాయతనయుండగు సూతుఁ డప్పుడు తా నిట్లనియెన్. ౩౯౧

వ॥ మహాభాగులారా! యయ్యది సత్యంబ. యాదేవుండు బిలద్వారంబున జలశాయియై చతుర్మాసంబులును సంపూజితుండై జనుల నఘములం జేయుఁ దెలియంగఁ జెప్పెద సావధానులరై యాలకింపుఁడు. తచ్చతుర్మాసంబులును ముఖ్యంబులగు యజ్ఞోద్వాహాదికార్యంబు లొనర్ప ననర్హంబులు. దేవాదిదేవుండును నిర్గుణుండును గుణాత్ముఁడును నవ్యక్తుండును నప్రమేయుండును సర్వదేవమయుండును సర్వజ్ఞుండును గవీశుండును సర్వభూతాత్మకుండును నగు మహానుభావున కంజలిసేసి యయ్యది కీర్తించెద. తొల్లి నరసింహావతారమెత్తి విష్ణుండు వేని వధించె నామహాసురుండు హిరణ్యకశిపుండు నా భయంకరుండై యుండ వానికి వీర్యమం దప్రతిములును సర్వలక్షణలక్షితులును నై ప్రహ్లాదుఁడనియు నంధకుఁడనియు నిరువురు సుతు లుదయించి రంతఁ గొంతకాలంబున నారాక్షసుండు పరలోకగతుండు కా దేవతలు తద్రాజ్యంబునఁ బ్రహ్లాదుఁ బట్టభద్రుఁ జేయ నుంకించుటయుఁ బితృపైతామహంబై సమాగతంబగు నారాజ్యంబుఁ జేయుట కతఁ డియ్యకొనఁడయ్యెఁ దత్కారణంబు వచింతు వినుండు. రక్కసుల కందఱకుం జక్రితో సదా విరోధంబు. ప్రహ్లాదుఁడట్లు ద్వేషింపక దానవులం ద్యజించి స్వరాజ్యంబు సహితము సల్పనొల్లక విష్ణునాశ్రయించె. నంత విష్ణుద్వేషపరాయణులగు నాత్మురగతక్షస్సులు పితృపైతామహమగు రాజ్యమం దంధకు నభిషేకించిరి. వాఁడును వనజాసను నారాధించి యాచంద్రార్కస్థాయి యగు నమరత్వంబు నార్జించె. వరబలంబున వాసవు విరోధించి సమరంబున జయించి యజ్ఞభాగంబు లపహరించె. నాత్మీయసహితంబుగా నమరావతికిం జని హరిహయుం బాఱఁదోలి యమరాలయం బగ్గంబు సేసికొనియె. సర్వదేవసహితంబుగం జని శక్రుండు శంకరు సంసేవించి పెద్దకాలంబున కప్పినాకి ప్రీతుండై యేమి కావలయునని ప్రశ్నించుటయు ౩౯౨

ఆ॥ "అస్మదీయరాజ్య మధ్వరాంశములతో నంధకుఁడు హరించె నతిశయించి.
వానివలన మగుడ దానినిహరియించి కరుణ నేసి నన్నుఁ గావుదేవ!" ౩౯౩

వ॥ అని దీనంబుగాఁ బలుకుటయు భగవంతుఁడగు ప్రమథాధిపుండు త్రైలోక్యరాజ్యంబు భవదధీనంబు సేతు నుండుమని యూఱడించి ౩౯౪

ఆ॥ "నాదు మదలయయ్యె. నాకంబువిడిచి నీ పితృవ్యమైన రాజ్యపీఠ మెక్కి.
మధ్వరాంశములకు నాశింప కవనికిం జనుము. చనకయున్నఁ జచ్చెదీవు" ౩౯౫

— *అంధకాసురుఁడు శంకరునాజ్ఞ యుల్లంఘించుట. *—

వ॥ అని గణనాథుఁడగు వీరభద్రుముఖంబున నంధకునకుం జెప్పిపంపుటయు ౩౯౯
నమ్మహాబలుండు నవ్వి

తే॥ "దూత వధియింపఁదగమిని దుష్ట! నిన్ను విడిచితిని ప్రాణములతోడ నడువుమింకఁ
దప్పుదెలియక యీరీతిఁ జెప్పిపంప నెవ్వఁ డాశంకరుండు? నన్నెఱుఁగఁడొక్కొ?

క॥ ఎఱిఁగియుఁ బాదలఁచి యిటుల్ మెఱుఁగుచునున్నాఁడొ? తెలిసెఁబో మనమున నా
మెఱకుఁడు నిజజీవితమున నిరాశుఁడయి యున్నవాఁడు నిశ్చయముగఁ దాఁ.

సీ॥ ఎవ్వానిముఖమున నెపుడు దరిద్రదేవత తాండవంబాడుఁ గుతుకమునను
నెవ్వానిచేతను నేభోగమేనియు ననుభూతంబు రవంతయేని
యెవఁడు జగత్త్రయి నెటఁజోటుదొరకక యల శ్మశానంబునం దాటలాడు
నెవఁడు సుగంధవద్భవవస్తువులు లేక వెలిబూది మెయినిండ నలదుకొనును
నెవఁడు కరచరణాదులౌ నవయవములఁ బాములం జుట్టుకొని దిగంబరతఁ దిరుగు
వాని కిఁక జీవితముతోడిపని యదేమి? యందునను నన్నుఁగూర్చి యిట్లన్నవాఁడు.

ఆ॥ కాన వేగనేగి కైలాసమును వీడి కాశిఁదపము సేయఁ గడఁగుమనుము.
విభవసహితముగను వృతున కాకైలాసధరము నా సుతునకు దత్తమనుము. ౪౦౦

ఆ॥ ఏతదస్మదుక్తి యెంతయుం బాటించి సరవి నవ్విధంబు జరుపుమనుము.
జరుపకున్నఁ దన్ను శత్రుని వధియింతుననుము. బుద్ధిగలిగి మనుము. చనుము."

వ॥ అని వాక్రుచ్చుటయు వీరభద్రుండు పదింబదిగ భర్త్సించి కడుంగడు కోపంబునఁ గైలాసంబునకుఁ బరువెత్తి క్రతుధ్వంసి కాకాఱులు వినిపింప నతండు క్రుద్ధుండై యఖిలగణంబులతోడను హాహాయా ద్యఖిలామరులతోడను వృషభారూఢుండై వెడలి యమరావతి కరిగె. నదిగని యంధకుం డానందంబున నర్జునాశ్వయుతంబగు నరదంబు నధిష్ఠించి యనీకినీసహిత మభిముఖుండై నిలిచె. నంత నాహవం బారబ్ధమై వేయియేండ్లు నడచుటయు దినక్రమంబుగా దేవతాసైన్యంబె క్షీణించెఁ గాని రక్కసులు చెక్కుచెదరరైరి. కఱకంఠుఁ డంతఁ గనులెఱ్ఱఁజేసి త్రిశూలంబుచే వ్రేసినను బ్రహ్మవరప్రభావంబునఁ బ్రాణంబులం బాయక యంధకుండు మగుడ నాయోధంబునకుం గడంగి యనేకగణంబుల నలయించి గదాఘాతంబుల ఖండపరశువుం బలుమారంబులు నొప్పించుటయు నది యఖిలలోకభయావహంబై కనుపట్టె. నంత నంబుజాసనవరప్రభావంబున నంధకునకు మృత్యువు లేకుంట యెఱింగి యష్టమూర్తి శూలాగ్రంబునఁ బొడిచి గగనంబునకు లేవనెత్తి ఛత్రంబుం బోలె ధరించుటయు నధోముఖంబుగా వ్రేలాడు నాత్మాంగంబునుండి యవనిపైఁబడు నఖండరక్తధారలం బ్రబుద్ధధాతుచతుష్టయుండును జరాస్థిస్నాయుశ్లేష్ముండును నై యావీరుండు

### అంధకుఁడు భృంగిరిటియను పేర శివభక్తుఁడగుట

శా॥ "ఈదృగ్వీర్యసమన్వితుండవని నిన్నే గుర్తింపంగలే విభూ!
ప్రాదుర్భూతమదాంధతం దలఁచు దుర్భావ ప్రసంగించితిన్.
నా దౌరాత్మ్యవివేకహీనతలకున్ న్యాయ్యంపు శిక్షాక్రమం
బో దేవేశ్వర! నీ యొనర్చు పని. యెంతో శ్లాఘ్యమై యొప్పెడిన్. ౪౦౩

తే॥ నీతిరహితున కొదవు విద్యాతిశయము సిరియుఁ జిరకాల ముండవు. సిద్ధమిద్ది.
అతిమదాంధుఁడనగు నాదు నలఘుబలపరాక్రమైశ్వర్యరాజ్యసర్వస్వమట్లు. ౪౦౪

తే॥ పాపకర్ముఁడఁ. బాపుఁడం. బాపభవుఁడ. మఱియుఁ బాపాత్ముఁడను నేను గరళకంఠ!
అఖిలపాపహరుండవై యభవ! నీవు నన్ను రక్షింపుమయ్య. నిన్ సన్నుతింతు ౪౦౫

సీ॥ శూలంపు వ్రేట్లకుం దూలిపోయి కరంబు శోకాకులిత మానసుండనైతి.
నధమాధముండనై ప్రధనంబునను నీదు చేతిలోపల వచ్చి చిక్కుపడితి.
నధికతరైశ్వర్య మంతయుం గోల్పోయి దీనత్వమున నీవె దిక్కటంటి.
భాషించుటకుఁగూడ బలములే కెంతయుం బార్శ్వభాగంబుల వ్రాలుచుంటి.
నిట్టి యాపన్ను రక్షింపవే మహేశ! శరణుచొచ్చితి. మనసు నీచాయతిరిగె.
సర్వపాపక్షయంబైన సమయమందె భవునిమీఁదికిఁ జిత్తంబు పరువులెత్తు.

తే॥ శివుని బూజింపనటువంటి చెనటిప్రజకు వచ్చిపోయెడిదినములే చచ్చిపోవు
వారలకుఁగూడఁ గ్రమముగా వచ్చిపోవు బ్రదికియుండిన యటువంటి ప్రజకె కాక.

సీ॥ చెడు కుష్ఠగదమునం జేసి యత్యంతంబు మేనెల్లఁ జెడిపోవువానికేని
తెగులుగొంటయి సదా తీఱని వ్యథతోడ వర్తించునటువంటివానికేని
యంఘ్రిలోపమున నొక్కడుగిడుటకునైన వశముగా కల్లాడువానికేని
సవిధంబునందగు శంఖధ్వనుల్గూడ వీనులంబడనట్టివానికేని
యెవనిచేతఁ బరమశివుఁడు దైవతబుద్ధిఁ గొలువఁబడఁడొ వానికులమునందుఁ
గలుగకుండుఁగాక కటకటా! జన్మంబు పార్వతీశ! సకలపాపనాశ! ౪౦౭

సీ॥ విడిచినాఁడను నేను వివిధాఘములకును నాదికారణమైన యసురభావ.
ముజ్జగించినవాఁడ నొకమాటు త్రైలోక్యరాజ్యంబుగూడ విరాగినగుచు.
వదలిపెట్టినవాఁడ వాస్తవంబుగ నాదు పుత్రపౌత్రుల బుద్ధిపూర్వకముగ
నవలఁద్రోసినవాఁడ నష్టవిధైశ్వర్య మగ్నిసాక్షిగఁ బెండ్లియైన స్త్రీల.
ముట్టుకొని నీదు పదపద్మములను సరిగ మూఁడుపరులు వచించుచున్నాఁడ రూఢిఁ.
గాన నను విడిపించి సత్కరుణతోడ స్వాగతంబొనరింపుమీ సాంబ! యింక."

వ॥ అనినవిని గతకల్మషుండగా నెఱింగి శూలంబునుండి మెల్లనదించి వినయ
వినమితగాత్రుండగు నాతనికి భృంగిరిటియని స్వయంబుగం బేరువెట్టి ౪౧౦
తే॥ "నందికంటెను మఱి గజాననునికంటె నమ్మహాకాళుకంటెను నగ్గలంబు
వల్లభుండవైతి నాకు. నీవారిఁ దలఁచుకొనక సుఖముండు నాతోడఁ గొడుక! నీవు"
వ॥ అని వక్కాణించుటయు వాఁడు వల్లెయని నమస్కరించి గణంబులంజేరి
శంకరు నాశ్రయించి యుండె. నంతఁ దత్తనయుండగు వృకుండు నిరుత్సాహుండై
మహాభయంబున హతశేషుల్గం గూడుకొని యంభోధిం బ్రవేశించె. సంక్రందనుండు
సంతోషంబున శంభునకు జోతవెట్టి తదాజ్ఞం గైకొని యమరావతి కరిగి ముజ్జగంబు
లేలుచు హవిర్భాగంబు లనుభవించుచుండె. వృకుండు సాగరంబు వెలువడి జంబూ
ద్వీపంబున కేగి తండ్రి తపముండిన హాటకేశ్వర క్షేత్రంబు సిద్ధిప్రదంబని తలంచి
యొరులెవ్వరును నెఱుంగకుండ బ్రహ్మను ధ్యానించుచు వాయుభక్షకుండై కొన్ని
యేండ్లును జలాహారుండై కొన్నియేండ్లును జితేంద్రియత్వంబునఁ బుడమిపయి బొట్టన
వ్రేలు మోపి తపంబొనరించుటయుఁ గమలాసనుండు సంతుష్టుండై తపంబున్నకు
మెచ్చి గర్తామధ్యగతుండగు వాని డగ్గఱి ౪౧౧

—♦ వృకుండింద్రపదవిం బొందుట. ♦—

క॥ "ఓహోహో వృక! యిఁక నతిసాహసపదమైన తపము చాలింపుము. నీ
యాహితమైన వరంబెదో వ్యాహరింపు. మిడిపోవ వచ్చినవాఁడక్" ౪౧౩
వ॥ అని పలుకుటయు వాఁడిట్లనియె. ౪౧౪
క॥ "తుష్టింజెందితివేని మదిష్టంబగు వర మొసంగ నే తెంచితివేక్
గష్టంబని భావింపక నష్టజరామరణుఁగాఁగ ననుఁ జేయుము విధీ!" ౪౧౫
వ॥ అనియిట్లు కోరుటయు విధాత ౪౧౬
ఆ॥ మత్ప్రసాదమునను మరణంబు జరయును నీకు సంభవింప వో కుమార!
యేమె యనిరొననుచు నీవిషయంబున సంశయింపఁబోకు. సత్యమిద్ది." ౪౧౭
వ॥ అనివాక్రుచ్చి యదృశ్యుఁడగుటయు వృకుండు కృతకృత్యుండై సర్వత్ర
కుసుమాఢ్యలంబగు రైవతగిరికిఁ జని నిజామాత్యులతో యోజించి త్వరితంబుగా దైవ
తేజమునకై దండెత్త నతండు వాని బ్రహ్మవరంబున జరామరణవర్జితుంగా నెఱింగి
సర్వామర్త్యసహితంబుగా సత్యలోకంబునకుం జనియె. మహాబలుండగు వృకుండు
సంతసించుచు సమస్తపరివారంబుగా స్వర్గంబుం బ్రవేశించి దేవరాజ్యపదంబున
కుతూహలంబున బిడ్డౌజుల నడిపి కర్తయై హవిర్భాగంబులకుఁగా వసురుద్రాదిత్య

మరుత్ప్రముఖదేవతాస్థానంబుల నసురుల నెలకొల్పి యథేచ్ఛ జగంబుల శాసింప మొదలిడిరి. బలవీర్యధైర్యామర్షంబుల వాఁడంధకునకు వేయిరెట్లధికుండై లోకంబుల క్షోభింపఁజేయ నదిమొదలింగి జనులెవ్వరును యజ్ఞయాగాదులు చేయమానుకొనిరి. యెవ రేని చేసిన నమరసంతృప్తికిఁగా నతిగుప్తస్థలంబునం జేరి యాచరించెడివారు. స్వర్గతులగు రాక్షసులు భూలోకంబునం దమ్మఁగూర్చి హవిస్సులిచ్చువారు లేకునికికి సందేహించి. రంత వృకుండు కుపితుండై ౪౧౮

—* ఏకాదశీవ్రతమాహాత్మ్యము *—

కం॥ "ఎవడేని వేల్పులకుఁగా నవనీస్థలి దానహోమయజనంబులఁ దా
సవిధి నొనరింపఁ గడఁగిన నవలీలం జని వధింపుఁ డస్మదనుజ్ఞన్"

వ॥ అని యానతిచ్చుటయు బలవంతులగు పలలాశను లిలాతలంబునకు దిగి గుప్తంబుగా సర్వత్రి సంచరించుచు జపహోమస్వాధ్యాయ పరాయణుఁ డెవఁడేని కనఁబడినఁ గఱకుకత్తులం దఱిగివైచుచుండి. రట్టియెడ సాంకృతియను మునివరుండు తొల్లి వృకుండు తపించిన బిలంబున ఛన్నవిగ్రహుండై గుప్తంబుగం దపంబు వేయఁ బరుషాక్షరంబుల భర్త్సించుచు సమీపించి తదగ్రంబున గంధపుష్పాక్షతలం బూజితమై హస్తచతుష్టయంబుచే నలరారు హరివిగ్రహంబు నవలోకించి యాయుధంబుల యమివరేణ్యుఁ బ్రహరించుటయుఁ దళతళమను తదాయుధంబులు మొక్కవోయి చంప సమర్థంబులుగాకునికిని వారు వైలక్షణ్యంబువొంది వృకునికడ కేగి ౪౨౦

తే॥ "ఒక్క బాపఁడు తొల్లి దివౌకసులకు జడిసి నీవు తపంబున్న స్థలమునందు
హాటకేశ్వరమున విష్ణునర్చ తనదు నగ్రమున నిల్పి యొంటిమై నధికనిష్ఠ ౪౨౧

తే॥ తపము నేయంగఁ గనుగొని యపుడు మేము మొత్త మొత్తంగఁ గత్తులే మొక్కవోయెఁ
గాని యాతని మెయి కసుగందదయ్యె. నెద్ది యుచితమొ యదిచేయు మింక నీవు"

వ॥ అనినవిని వృకుం డాగ్రహంబున రయంబ తత్సవిధంబున కరిగి కృష్ణవిగ్రహంబును గుహాయవలికిం జిమ్మివైచి పదింబదిగ నదలించుచు నీకాల నాకాలం దన్ని

క॥ "నాకుం బగవాఁడగు నల వైకుంఠు భజించువాఁడు వధ్యుఁడు నాచేఁ
గైకొందు దొంగతనముగ నా కేళవుఁ గొలుచు నీదు నసువుల నింకన్" ౪౨౩

వ॥ అనిపలికి ఖడ్గంబున వ్రేయుటయు నది పడనుగలదయ్యెఁ దద్గాత్రంబునకుఁ దగిలి నూఱుముక్కలయ్యె. నంతతో విడువక యాత్మాగ్రహంబునఁ దత్సాంకృతి నామక భూసురశ్రేష్ఠుండు ౪౨౪

ఆ॥ " కాళ్ళు రెంటితోడఁ గడు దౌష్ట్యమున నీవు నన్నుఁ దన్నెదవుర దున్నపోత!
మరలఁ దన్నకుండ విఱుగఁబో నీకాళు లీక్షణంబ సారసాక్షు కరుణ " ౪౨౬

వ॥ అని యనునంతమాత్రంబునఁ బంచశీర్షంబులగు పన్నగంబులుంబోలె వాని కాళ్ళు రెండును విఱిగి ధరం బడుడుఁ దత్తైన్యంబులును విశేషించి తరుణీజనంబులును రుదితంబు లొనరించిరి. త్రిదశాలయు లడివిని పదింబదిగ నేతెంచి త దనీకిని పయిం బ్రిదరంబులు గురియుచుయు హాత శేషు లధోలోకం బాశ్రయించిరి. వృకుండు కుంటియై వెలందులుం దానును వెక్కివెక్కి యేడ్చి వెండియు విరించినిగుఱించి తపింపమొదలిడియెఁ. బాకశాసనుండు పాప్తరాజ్యుండై ప్రిణష్టకంటకంబుగం బరిపాలించె. ధరాతలంబున మరల ధర్మకార్యంబులు ప్రవృత్తంబులయ్యెఁ. బెద్దకాలంబునకుఁ బితామహుండు ప్రీతుండై వివరమధ్యగతుండగు వృకు సమీపించి ౪౨౭

క॥ " వృక! మెచ్చితి నీతపమున. కేఁకఁ దడయక యిష్టవరము లిచ్చెద. శంకిం
పక దుర్లభార్థమేనియుఁ బ్రకటింపుము హృదయగతము భయపడకుండక " ౪౨౮

వ॥ అని వక్కాణించుటయు వాఁడు ౪౨౯

క॥ " తుష్టుండవైతివేని యభీష్టము వెఱవేర్చెదేని యిప్పుడ యస్మ
న్నష్టాంఘ్రులు దయసేయుము. కష్టించుచునుంటిఁ గుంటికాళ్ళఁ గరంబుక "

వ॥ అనినవిని వనజాసనుండు వానిం దోడ్కొని సాంకృతి సవిధంబునకుం జని సాంత్వపూర్వంబుగా నిట్లనియె. ౪౩౦

క॥ " నావాక్యము పాటించుచు నీవృకు పంగుత్వ మపనయింపఁగ వలయుక.
గావలెఁడె యగుమగాక మహీవిబుధ! యనుగ్రహింపవే యెటులైనక " ౪౩౨

వ॥ అనవుడు సాంకృతి ౪౩౩

తే॥ " ఇష్టగోష్ఠులయందేని యెపుడు నేను బలికియెఱుఁగ నబద్ధ మోభారతీశ!
యట్టినియతవ్రతంబు నేఁ డెట్టు మరల విడిచిపెట్టంగవలయునో నుడువు మీవ " ౪౩౫

వ॥ నావుడు దేవజ్యేష్ఠుండు వెండియు నిట్లనియె. ౪౩౬

ఆ॥ " భక్తుఁ డీవృకుండు పాత్రుండవీవు నా. కగ్గలంబు ప్రియుఁడ. వట్లుగాన
ననఘ! యుష్మదుక్త మనృతంబుఁజేయలే కిట్లు వేడుచుంటి నేను నిన్ను " ౪౩౬

వ॥ అనియిట్లు వాకుచ్చుటయు నమ్మునీశ్వరుండు ౪౩౭

సీ॥ " వీఁడు దురాత్ముఁ డెంతయుఁ. వేల్పులయు విశేషముగ నాదుగురుఁడైన శ్రీధరునియు
సహితమున నిందువాఁడు. కుంటియై వసింప నర్హుఁడగు. ద్విజదూషకుఁ. డధిక పాపి.
తే॥ జరయు మరణంబు లేకుండ సల్పితివి. యట్టి బలవంతునకుఁ గాళ్ళు నమరునెడల
సరసురాసురసహితమైన జగ మెల్లఁ బాడుసేయంగఁగడ గడు వీఁడు నేఁడు. ౪౩౮

ఆ॥ కాన నుండనిమ్ము కార్శ్యలేకుండనే జరుపకుము వికల్ప మరసి మరల.
ముజ్జగములు సౌఖ్యముగనుండఁ జింతింపవలయు నీవుగూడఁ దలఁపునందు "

వ॥ అనివచించుటయుఁ దమ్మ్రచూలి మత్రియునిట్లనియె. ౪౪౧

ఆ॥ "వానకాలమునం బ్రయాణంబు దుర్ఘటం, బందు మొదలె కుదుర దాహవమున.
కెండకాలమునను హేమంతముననె నిరంతరాయముగను నది పొసంగు. ౪౪౨

తే॥ అట్లుగావున వార్షికంబైన నాల్గునెలలు వృకునకుఁ బాదము ల్గలుగునెడల
నప్పు డఖిలజగంబుల కరుగలేక తగుపను ల్సేసికొనుచు స్వస్థలి వసించు. ౪౪౩

ఆ॥ కాన దానవేంద్రుఁడైన యావృకుఁడు దాఁ గాళ్ళుగలిగియుండుఁగాక యపుడు.
దేవతలకు భూమిదేవతలకు దీన నొలయఁ బాధ లెవియు నుండఁబోవు. ౪౪౪

క॥ ఏవంవిధముగ నగుచోఁ దావకమైనట్టివాక్కు తథ్యంబునుగా.
దీవృకుఁడు నన్నుఁ గూరిచి కావించిన తపమును వితగాక ఫలించున్ " ౪౪౫

వ॥ అని యిట్లుపలికి మహాత్ముఁడగు తత్సాంకృతుచేఁ దథాస్తనిపించుటయు వృకునకు వెండియుఁ జరణంబులువచ్చె. శీతాతపసమయంబులఁ జెలియలుం దానును దక్కంగల బందుగులును బర్హిర్ముఖులతోడి బలువిరోధంబునం బలవరించుచుఁ బడియుండినను జలదాగమంబుగల చతుర్మాసంబులును భయంకరుండై ౪౪౬

సీ॥ వేధించు నీర్ష్యశీలమై వృద్ధశ్రవోముఖ్యబృందారకులను దత్సుందరులను.
బాధించు నలుకమై బ్రాహ్మణప్రముఖాఖిలావనీజనముల ననఘతముల.
శోధించు బలిమిమై క్షోణిఁ గూలంద్రోసి పట్టణంబుల నెల్ల పల్లియలను.
ఛేదించు వీఁకమైఁ జెట్టొక్కటియువీడ కుద్యానవనముల నుటజములను.
నివ్విధమునఁ బెట్టు నిడుములు పడలేక క్షీరవారినిధిని శేషశయ్యఁ
బవ్వళించియుండు పద్మాక్షుదండ నానెలలునాల్గు గడపి నిర్జరాళి ౪౪౭

వ॥ వెండియు వృకాసురుండు విగతపాదుఁడగుటయు నష్టమాసంబులును హర్షాన్వితులై యమరావతి నలంకరించుచుండి, రట్లనేకాబ్దంబు లరుగుడు నాషాఢమాసాంతంబున హరిహయుం డాచార్యు నాలోకించి ౪౪౮

పృథ్వి॥ "గురూ! మరల వర్షముల్ గురయువేళ వచ్చెన్. వృకా
సురుండు ధృతపాదుఁడై సురలపైఁ బడున్ రౌద్రతన్.
సరీసృపశయానుఁ డా సరసిజాక్షునొద్దం బయ
స్సరిత్పతి వసింపఁగం జనఁగనా నికన్ వేలుపుల్

సీ॥ గగనభాగస్థ ప్రాకారావృతములైన చంద్రకాంతోపలసౌధములను
హంసతూలికలపై నమరుపంబడిన హొంబట్టుదిండ్లంగ్రాలు మంచములను
రతనముల్గాపి స్వర్ణమున నిర్మితములై శయనీయమైన యాస్తరణములను
గలధౌతఘంటికాకలితంబులౌ గజవాజిముఖ్యవిచిత్రవాహనముల
నతిహితములైన యితరపదార్థములను విడిచి కడుదీనతం బురి వెడలిపోయి
సతతముం బరాశ్రయంబున వెతలఁబడుట మన కభాగ్యంబగుంజుమీ మంత్రివర్య!
తే॥ కాన మానీంద్ర! మామీఁదఁ గరుణయుంచి వ్రతమొ హోమమొ నేనుమో మతిని లెస్స
యోజనముచేసి వాక్రువ్వ మొకయుపాయ. మనుభవింపంగఁజాల మీయలజడులను.
తే॥ దేవ స్వకళత్రశూన్యంబుగాని శయ్య స్వగృహముం బాసిపోవమి సంఘటిలునొ
దాని వాక్రువ్వమయ్య స్వస్థానచలనమునను నిర్విణ్ణమయ్యె నామనసు మిగుల.
కం॥ ఏడాదికి నాలుగునెల లేడకొ భయపడుచుఁబోయి యిల నిజభార్యన్
వీడి యొకండఁ బరుండుచు నూడిగపుంబ్రహ్మచర్య మొనరుపవలసెన్."
వ॥ అనినవిని బృహస్పతి తడవుధ్యానించి శతక్రతువున కిట్లనియె. ౪౫౪
తే॥ "విష్ణునారాధనముసేంతె విబుధనాథ! కల దశూన్యశయననామకవ్రతంబు.
దానిఁజేయుము క్షీరయాదఃపతిస్థుఁడైన యాహరి తీర్చు నీయభిమతంబు
ఆ॥ పట్టుపఱుపులందుఁ బవళించుచును నీదునిలయమందె యుండఁగలవు నీవు
సర్వశత్రువులును సమసెద రాజలశాయికరుణవలన సత్వరముగ" ౪౫౬
వ॥ అనియిట్లు వక్కాణించి యాయనచే నశూన్యశయనవ్రతం బాచరింపఁజేయు
టయు భగవంతుండగు విష్ణుండు సంతుష్టుండై ౪౫౭
కం॥ "ప్రీతుండనైతిఁ ద్వత్కృతచాతుర్మాస్యవ్రతమున శతమన్యూ! నీ
చేతమ్మునఁగలకోరిక నాతోఁజెప్పుకొను మిత్తు నాతోడింకన్" ౪౫౮
వ॥ అనుటయు నింద్రుండిట్లనియె. ౪౫౯
తే॥ "విష్ణుదేవ! దురాత్ముఁడౌ వృకునివలన నేనుబొందుపరాభవం బెఱుఁగుదీవు
వే నొకన్నిదినెలలేల నేలు నాల్గునెలలు తానును ముజ్జగంబులను వాఁడు. ౪౬౧
ఆ॥ తెలిసికొనుచు మెంతయు నామీఁదఁ గరుణయుంచి యెల్లకాలములను
నాకు రాజ్యమందువీక విధింపుమీ యిందిరేశ! యసురబృందనాశ!" ౪౬౨
వ॥ అని యిట్లు ప్రార్థించుటయు విష్ణుదేవుండు [యుండ
తే॥ "జరయు మృతియును లేకుండ సల్పియుండెఁ బ్రహ్మ వానిని కవ్వాఁడు బ్రదికి
నీవు త్రైలోక్య మెబ్భంగి నేలఁగాను? నైనను హితంబు నీకునై యాచరింతు.

ఉత్సాహము॥ వానకాలు నాల్గునెలలు వాసవా ! రమాయుతం
బేను బాలకడలి వెడలి యేగి హాటకేశ్వర
స్థానమున శయింతు నంతఁ దద్భరంబునన్ సదా
మేను నెత్తలేక వాఁడు మిడుకుచుండ యుండెడున్. ౪౬౫

మ॥ ప్రతిసంవత్సర మిట్లునీకు హితమున్ భావించు చుందుందు. సం
భృతరాజ్యుండవు కమ్ము. పొమ్ము దివికిం బ్రీతుండవై మున్ను నీ
వతివర్షాసమయంబులందును భయంబందంగఁబో కింక నీ
వ్రతమందుండు ననున్ గుఱించి ప్రజ నిర్వర్తింప నిష్టాప్తియౌ " ౪౬౬

వ॥ అనియిట్లు వచియించి హృషీకేశుండు స్వరాజ్యపరివృద్ధిపొందె నిశ్శేష భయుండగు నిర్జరేశుం బంపించి యేటేట నాషాఢశుద్ధైకాదశీదినంబున హాటకేశ్వర క్షేత్రంబున కరిగి ప్రయత్నపూర్వకంబుగా వృకాసురుపైఁ బవళించుచుండుటయుఁ దదాక్రాంతుండగు వాఁడు భారాతిరేకంబునం బ్రక్షీణుండై చచ్చినట్లు పడియుండెడి. నాల్గు నెలలును నట్లుండి విష్ణుండు వెండియు బాహుళశుక్లైకాదశీతిథిం బ్రబుద్ధుండై పాలసంద్రమునకుఁ బయనంబు సేయుటయుఁ బలలాశి బ్రాహ్మణశాపంబునఁ బంగువై పడియుండెడు. నట్లు హరి యానాల్గునెలలును నఘాత్ముఁడగు నసుర భయంబున హాటకేశ్వరంబునం దధివసించు. భగవంతుఁడగు యజ్ఞపురుషుం డప్పుడు పన్నుండి భాగంబును స్వీకరింపమి నవనీజనంబులచే నఖిలయజ్ఞక్రియలును నాచరింపఁబడ. వట్లన్నప్రాశన చూడాకర్మంబులు దప్పఁ గన్యాదానాది నిఖిలశుభకార్యంబులును నిషిద్ధంబులు. జగన్నాథు శయనసమయంబున సలుపంబడు సకలశుభకర్మంబులును వ్యర్థంబు. లయ్యవసరంబునం దాచరించు వ్రతనియమంబు లధికఫలంబులగుట నత్యంతయత్నంబున హరిసంతృప్తికై వ్రతస్థులగునది. శయనబోధనైకాదశీదినంబుల జరుపంబడు యత్కించిత్కర్మంబును నక్షయఫలంబగు. నశూన్యశయనవ్రతంబె యాచరితంబుగా నడుగవలసియే యుండు. దసురపై శయనించు నంబుజనాభుఁ డద్దాని కనంతఫలంబె యొసంగు. నట్లుచట శయనించిన యచ్యుతుండె యానతిచ్చెఁ బాపాత్ముఁడై యెవఁ డయ్యేకాదశి నన్నంబుదినువానికి జ్వరమేని వచ్చియుండ వలయు. లేదేని యేదేని వేదనయేని యేర్పడియుండవలయుఁ. గావున నెన్నివిధంబులఁ జూచినను నన్యంబగు హరివాసరంబునఁగూడ నన్నంబు భుజింపఁజనదు. శయనబోధనైకాదశుల నీక్ష నడుగనేల. వార్షికంబులగు చతుర్మాసంబులును హాసుదేవుఁ బూజించువాఁడు వైకుంఠంబున వసియించు. దానంబులవలనను నన్యవ్రతంబుల

వలనను నుపవాసంబులవలనను వచ్చు విశేషంబు లేమింజేసి నుత్తుండగు సుదర్శన
హస్తుఁ బూజించునది" యని సూతుండు నుడువుటయు శౌనకాదులు

## —♦ చాతుర్మాస్యావ్రతనియమములు ♦—

సీ॥ "హరి నిదురించెడి యవసరంబున నింక నేయేవ్రతంబులం జేయవలెనొ
దైత్యారి శయనించు తఱిని గింకిమంత్రజపముల నిష్ఠమై జరుపవలెనొ
చక్రి నిద్రించినసమయమునం దెట్టువంటి హోమంబులం జేయుచుండవలెనొ
విష్ణుండు పన్నుండువేళ బ్రాహ్మణులకు నేమేమిదానంబు లీయవలెనొ
యిదియునుంగాక నియమంబు లెట్టివపుడు పట్టవలయునొ చెపు"మంచుఁబ్రశ్న సేయు
టయును బౌరాణికాగ్రణియైనసూతుఁ డెంతయును నాదరంబున నిట్టులనియె.
సీ॥ కలితస్వరార్థావగాహపూర్వకమైన యజురాది వేదపారాయణంబొ
యష్టాక్షరద్వాదశాక్షరప్రభృతులౌ ముఖ్యమహామంత్రముల జపంబొ
వటపలాశాశ్వత్థవానీరధవళార్క సమిధాజ్యచర్వాదికము హవనమొ
కలోప్తక్తవిధ్యుతిక్రమముగాఁ నుండంగ సాత్వికాహారమౌ సద్వ్రతంబొ
యేదొయొక్క నియమ మూఁదంగవలె మునీశానులార! శార్ఙ్గిశయనవేళ
నద్ది కొంచెమయ్యు నగ్గలంబు ఫలించు నంచు మును విరించి యనుటఁజేసి.
సీ॥ ఈనాల్గునెలలను నేకభుక్తము సేయ ధనము సమృద్ధమౌఁ దపసులార!
యీనాల్గునెలలు రేయి భుజింప సుమతియై సిరియు సురూపంబుఁ జెందుమనుజుఁ
డీనాల్గునెలలనే కాంతరోపవాసముల వైకుంఠధామము ఘటించు.
వీనాల్గునెలలు వస్త్రానేవాఆహారి రాజసూయా ద్యధ్వరఫల మొందు.
విమ్తరక్రోవుండు వృషమైఁ బరున్న యీనాల్గునెలలు మూఁడునాళ్ళ కొక్క
పరి భుజింప మగుడఁ బడఁడు తా సంసారసాగరమున జనుఁడు యోగులార!
సీ॥ ఒకనాఁడు పవలు వేఱొకనాఁడు నిశఁ దిన్న నబ్బు నగ్నిష్టోమయజ్ఞఫలము.
యాచితేతరమైనయది పసాపడినచో నొలయదు బంధువియోగ మెపుడు.
నెయిమానియలు వెట్టి నెత్తంటుకొనకున్న స్వర్గభోగంబులు సంభవించు.
నస్థలబ్రహ్మచర్యమున వర్తించుచో దేవయానముమీఁదఁ దిరుగు దివిని.
వీరదావృతి నలరు నీనెలలు నాల్గుమైని నూనియరాయుక స్నానమాచ
రించి మధుమాంసములనువర్జించువాఁడు ముక్తుఁడేయగు సంయమిముఖ్యులార! ౪౨౦
సీ॥ శాకంబునందుండు శ్రావణమున బ్రహ్మ యటుగాన సంత్యాజ్య మప్పుడద్ది.
దధిలోనమందు భాద్రపదంబునం జక్రి యట్లాట విడువనా నపుడుదానిఁ.
బాలయందుండు నా శూలి యాశ్వయుమునఁ దాన నవేయ మత్తఱిని నదియు.
నామిషమందుండు రమ్యమ్మపురుం గార్తికమునఁ గాబట్టి దూష్యమదియపుడు.

వానివదలువాని వత్సరకృతమైనయఘము వదలిపోవుననుచమున్న
చేయిరెత్తిచెప్పె స్వాయంభువుండై నమనువు శౌనకాదిమానులార ! ౪౭౧

సీ॥ కంచు వివర్జించి కనుమదా వాజపేయాతిరాత్రింబుల యధికఫలము.
నక్షారలవణాశియగు మహీసురుచేత నఖిలవ్రూర్తములు చేయఁబడినట్లే.
స్వాహాంతవైష్ణవసన్మంత్రములఁ దిలాక్షతలు వేల్చినఁ గాఁడు జాడ్యయుతుఁడు
స్నాతుఁడై వైకుంఠసన్నిధిఁ బురుషసూక్తముపఠించిన బుద్ధి తద్దపెరుఁగు.
మఱియు వార్షిక తచ్చతుర్మాసములును సఫలమాస్తత మానివై చక్రిహస్త
నూటయెనిమిదిసారులు నూటిగాను వలగొనినవాని కొలయ దేకొలయునేని. ౪౭౨

సీ॥ మేదినీసురులకు మృష్టాన్నమిడువాఁడు పొందు నగ్నిష్టోమఫల ఫలంబు
హరిమందిరాచరితామ్నాయపాఠుండు విద్వద్వరిష్ఠుఁడై వెలయఁగల్గుఁ
గత్తివేల్పుగుడిఁ గృతగాననృత్యునిమోాల నవిసేయుదురు దివి నప్సరసలు
అహరహశ్చరితగీతాదికుండగువాఁడు గంధర్వభావంబు గాంచితీరు.
వార్షికంబులగుచు వఱలు నాల్నెలలందొ కడకు నొక్క కార్తికంబునందొ
పట్టఁదగు నరుండు ప్రాగుక్తనియమముల్ చేతనైన మానిసింహులార !

వ॥ అట్లుపట్టినను నిహపరార్థులగు విష్ణుభక్తులు కార్తికపూర్ణిమనాఁ డవి
కావించునది. ౪౭౪

సీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన స్త్రీనేని కలియకుండుట మేలు కార్తికమున.
హుతశేషమైన యత్యుత్తమాన్నమేని కడకుఁద్రోయుట మేలు కార్తికమునఁ
ప్రకరణాంతర ముఖ్యభావ్యముండనమేని కావించుకొనమి మేల్కార్తికమున.
లాజాదికాత్యంతలఘుపదార్థంబేని క్రిమ్మఱఁదినమి మేల్కార్తికమునఁ.
గంచు వాడుకొనమి మేలు కార్తికమున. క్షౌద్రరస మానకునికి మేల్కార్తికమునఁ
గార్తికంబున వీని త్యాగంబుసేయ నబ్బుఁ బూర్వోక్త సకల నియమఫలంబు.

వ॥ కార్తికమాసంబున జలశాయి దేవు ప్రాసాదంబుమీఁది కలశంబున దీపంబు
పెట్టువానికిఁ గాంస్యాది వస్తుదానత్యాగంబునఁగలుగు ఫలంబు చేకూరెడి. శుభార్థులు
సుప్రాప్యంబును నిష్టతమంబును నైన దేనికేని చాతుర్మాస్యంబున నేమంబును బూన
నది. నియమసమాప్త్యనంతర మదియే యవనీసురున కర్పించునది. శక్తికొలఁది నియమంబు
చరించుటయును ఫలంబు సిద్ధించు. జపమో వ్రతమో నియమమో లేక చతుర్మాసంబుల
గడపిన మూర్ఖుండు జీవించియు మృతుండు. శాకయవలుం దిలారణ్యంబులుం బోరె
నమాన్నవులు నామమాత్రప్రసిద్ధులుకానఁ గడంకమైఁ గార్తికంబునఁ గొలఁదివానిద్రై

నను నేదో యొక నేమంబు పట్టవలయు. సమాహితుండై నిత్యంబును దీనిఁ జదివినను
విన్నను జాతుర్మాసీకృతపాతకంబున సంత్యక్తుఁడగు." ౪౭౬

## —♦ చాతుర్మాస్య మాహాత్మ్యము. ♦—

కం॥ అనియిటులన మును లాతనిఁ గని చాతుర్మాస్యవ్రతము కడ వెళ్ళఁ ద్వాదా
నసమునసుండి వినఁగ మా మనముల జనియించెఁ గోర్కి మహనీయతమా! ౪౭౭
తే॥ కాన నగ్గలంబు కరుణించి దాని సవిస్తరముగ మాకు వినుచుమయ్య.
త్వద్వచోమృతంబు గ్రోవంగ మఱియింత గలిగె శ్రద్ధ" యనుడుఁ గథకుఁడంత
వ॥ మునులారా! చాతుర్మాస్యవ్రతమహత్త్వంబు విస్తరించియే మీముందఱ
వచించెద. నందఱును వినుండు. తొల్లి నారదుండు బ్రహ్మముఖంబున నానావ్రత
విధానంబు విని. ౪౭౮
ఆ॥ "దేవ! వింటిఁ బెక్కుతీరులవ్రతములం ద్వన్ముఖమునఁ గాని తనివితీర.
దీక దయఁగ వచింపు మిపుడు చాతుర్మాస్యవ్రతము. నాలకింప వాంఛవొడమె"
వ॥ అనియడుగుటయు బ్రహ్మదేవుం డిట్లనియె.
క॥ "విను చాతుర్మాస్యవ్రత మనఘా! వాకృత్తు. దీని నధికశ్రద్ధఁ.
విను భరతఖండమందలి జనులకు మోక్షంబు సులభసాధ్యం బగుఁబో. ౪౮౧
క॥ భగవంతుండగువిష్ణుం డగు మోక్షప్రదుఁడు. ఘోరమగు సంసృతి దాఁ
టఁగ నౌక. యతని స్మరణము విగతాఘులఁజేయు జనుల వేలుపుజోగీ! ౪౮౨
సీ॥ బహుపుణ్యములఁగాని పడయంగరానిది మానవజన్మంబు మహీతలమున.
నందులోఁగూడ బ్రాహ్మణుఁడయిపుట్టుట యత్యంతదుర్లభం బరసిచూడ.
బ్రహ్మత్వసంసిద్ధి పడసినప్పటికిని గరుణాయుతుండౌట కష్టతమము.
సహకరుణున కేని సత్సహవాసంబు దొరకుట మఱియును దుర్లభంబు.
అట్టిసజ్జనసహవాస మమరకున్న విష్ణుభక్తి జనింపదు. విష్ణుభక్తి
లేనివాఁడు వ్రతంబుల లెక్కసేయఁ. డవ్వి కరణీయములు సదా యాత్మజాత!
క॥ చాతుర్మాస్యంబున నోతాతా! విష్ణువ్రతంబు తద్దయు శుభ. మీ
చాతుర్మాస్యంబున వ్రతియై తోఁపనివాని పుణ్యమంతయు వృథయౌ. ౪౮౪
క॥ చాతుర్మాస్యంబు సమాయాతము కాఁ బుణ్యదేవతాయతనంబుల్
ఖ్యాతములగు తీర్థములం బీతాంబరు నాశ్రయించుఁ బృథుదానములన్.
క॥ చాతుర్మాస్యంబున వారి కాతతమగుభక్తి మెఱిక్క యావజ్జీవం
బాతనికిఁ బ్రీతులై సుర లోతనయా! వరములిచ్చుచుందురు చుమ్మీ. ౪౮౫

ఆ॥ మనుజులగుచుఁబుట్టి మహిని జాతుర్మాస్యమునకు విముఖులైన మూఢతముల
కాయములను జేరఁ గలుగు సహస్రముల్. సంశయంబువలదు సంయమీంద్ర!

కం॥ మానవతయె దుర్లభ. మామానవతను విష్ణుభక్తి మఱిదుర్లభ. మో
హానీ! చాతుర్మాస్యములోనే యది యున్న నున్నె లోప మ్మింక హో!

కం॥ చాతుర్మాస్యంబునఁదాఁ బ్రాతఃకాలంబునందె బహుభక్తిని సు
స్నాతుఁడగువాఁడు సకలఖ్యాతక్రతుఫలముఁబొంది క్రాలు దివమునన్. ౪౮౯

కం॥ చాతుర్మాస్యంబునఁజని పూతజలంబగు తటాకమునఁనో నదినో
ప్రీతిం గూపంబుననో స్నాతుఁడుకా నపుడ యడఁగు సకలాఘములున్. ౪౯౦

ఆ॥ పుష్కరప్రయాగపూర్వంబులగు మహాస్థలములందు నెందొ శ్రద్ధనరిగి
హరిశయించియుండునట్టి చాతుర్మాస్యమున మునుంగఁ బుణ్యమునకు మితియె

కం॥ రేవ తొలిసంద్రమునఁబడు తావు రవిక్షేత్ర. మచ్చటం జాతుర్మా
స్యావసరపు టొకదినమే నేవాఁడు మునుంగు వాని నెనయవు దోసఁగుల్. ౪౯౧

తే॥ నర్మదానదిలో మూఁడునాళ్లు లేగి చక్రి నిదురించునెడల సుస్నాతులైన
ప్రజల పాతకములు పటాపంచలగును. నారదమునీంద్ర! వింటె తన్మహిమ మహహా!

కం॥ గోదావరి దిగి ప్రజ సూర్యోదయమున నొక్కపక్షు మొగి నాడెడిచో
భేదించి కర్మజంబగు నీదేహము విష్ణులోక మెనయును దనయా! ౪౯౪

కం॥ చాతుర్మాస్యమునఁ దిలాన్వితామలకోపనీత బిల్వదళాంచ
త్పూతోదకములతోడను స్నాతుండగు జనుని దోషజాతము లడఁగున్. ౪౯౫

—• గంగాస్నానఫలము. •—

కం॥ ఏజలముల కడకేనియుఁ దాఁజని గంగేయమనుచుఁ దలఁచినమాత్రన్
సాజంబుగ నగు నది గంగాజల మటు స్నానవిధిని గావింపనగున్. ౪౯౬

ఆ॥ గంగగూడ విష్ణు కాలిబొట్టనవ్రేల నుండు. నద్ది కొలలఁ జెందునెపుడు.
నందులోన మఱియు నట్లు చాతుర్మాస్యమునను బాపహంత్రి మునివరేణ్య!

క॥ స్మరియింపఁబడుచు విష్ణువు హరియించును వేలకొలల. నటుగావునఁ ద
చ్చరణోదకంబు శిరమున ధరియించుట శివ. మతండు తాఁగూడ్కనెడన్

క॥ చాతుర్మాస్యంబునఁ దత్పీతాంబరుఁ డుదకమందుఁ బ్రీతిని మను. న
ట్లాతని తేజముచేసము పేతం బదితీర్థమగుచుఁ బేర్కొనఁబడెడిన్. ౪౯౯

ఆ॥ అట్టి దాన స్నానవువిష్ణునామపారాయణంబు నగు మహాఫలములు.
శేవు నిద్రవేళ దేవత్వమే యిచ్చు నవ్వియాచరితములైనయెడల. ౫౦౦

ఉ॥ స్నానముసేయకుండ నెవి సల్పిన నౌనవి నిష్ఫలంబు. ల
వ్వానిని రాక్షసాధములె వచ్చి గ్రహించుచునుండ్రి బల్మినై.
స్నానము సత్యదంబును. సనాతనధర్మము. దాన ముక్తుఁడై
మానవుఁ డెన్నడుఙ మరల మగ్నుఁడుగాఁడు భవాబ్ధిలోపలఙ. ౫౦౧

మ॥ ఎవ రధ్యాత్మమెఱింగి పుణ్యతములై యుద్ధాత్రి వర్తింతురో
యెవ రామ్నాయ తదంగము ల్సదివి యెంతేఁ గీర్తి నార్జింతురో
యెవ రెవ్వా రెవి యాచ్న చేసినను న వ్వీఁజాలియుందొ్రి యామి
ప్రవరా! వారికి శుద్ధి స్నానమున నే ప్రాప్తించుచుండుం జుమీ. ౫౦౨

ఆ॥ స్నాతు నొడలుసొచ్చి సకలక్రియాకలాపముల ఫలదుఁడగును బద్మనాభుఁ.
డట్లుగాన స్నాన మమరసంతుష్టికిం గలుషహారణమునకుఁ గార్య మెపుడు.

తే॥ గ్రహణమువినాఁగ నవి నిశాకాలమునను సంధ్యలందును గూడదు సంయమీంద్ర
కూడ దుష్ణోదకంబునంగూడఁ గాన నొనర దటువంటిస్నానంబులను విశుద్ధి.

ఆ॥ సూర్యదర్శనమున శుద్ధి సమస్తకర్మముల విహిత. మందుమతియు వారి శ.
యించు నాల్గునెలలు నేర్పడు జలశుద్ధి యమరమునివరేణ్య! యార్యగణ్య! ౫౦౬

క॥ సలిలస్నానాశక్తులు బలుమంత్రస్నానమున నో భస్మస్నానా
మలవిష్ణుపాదజలములవలననొ శుద్ధంబుసేయవలయును దనువుఙ. ౫౦౭

ఆ॥ క్షేత్రతీర్థనదుల శ్రీనాధుముందఱ స్నాతుఁడైనవాఁడు పూతుఁడగును.
వారి పరుండియున్న యపుడు విశేషించి శుద్ధదేహుఁడగునుజూ యతేండు. ౫౦౮

—♦ చాతుర్మాస్య నియమవిధి. ♦—

శా॥ చాతుర్మాస్యమునందు స్నాతుఁడయి తత్స్నానావసానంబునఙ
బూతాత్మం బితృతర్పణంబు సలుపం బుణ్యం బనంతంబు. ద్వి
ప్రోతస్విన్యమలాంబుసంగమమునఙ సుస్నాతుఁడై దేవతా
వ్రాతంబుం బితృవర్గముం దమపు నవ్వాఁడుఙ మహాపుణ్యుఁడౌ. ౫౦౯

కం॥ గోవిందస్మరణంబును గావించి యొనర్పనగు సుకర్మములెల్లఙ.
దేవ పితృమనుష్యావళి కీవిధమగు తృప్తిదం బిఁకేమనవలయుఙ. ౫౧౦

కం॥ చాతుర్మాస్యను ధర్మాన్వితంబగు శ్రద్ధతోడ నిఖిలక్రియలఙ
ధూతాఘులగుటకై స్మృతిపూతంబులుగాఁగఁ జేయఁబోలును దనయా! ౫౧౧

సీ॥ అవనీసురులయెడ నతిభక్తినునికియు సత్పురుషులతోడి సంగమంబు
గురుజనంబులుగోరు కోర్కె తీర్చుటయును దైవతనివహ సంతర్పణంబు
గోవులపై భక్తి గోప్రదానంబును పితిహోత్రమునందు వేల్చుటయును
వన్యతంబులాడమి యామ్నాయపాఠంబు దాతృత్వమందలి తత్పరతయు
సంతతమును ధర్మసాధనసత్కార్యములు తలంపనందు మురవిరోధి
నిదురవోవునట్టి సమయాబద్దంబుగా వీని కేయు కెంతయేని లెస్స" ౫౧౧

వ॥ అని యిట్లనుడువుటయు నారదుండు

కం॥ "నియమంబన నెటువంటిది ? నియమంబున నేమిఫలము నిర్ణీతం ? బా
నియమము పట్టుటవలనను దయ యెవ్విధిఁగలుగు వారికిఁ ? దండ్రీ ! చెపుమా "

వ॥ అని యడుగుటయు వెండియు బ్రహ్మదేవుండిట్లనియె.

ఆ॥ " చక్షురాది వివిధసత్క్రియలందును బూనవలయు నియమమును బుధుండు.
తత్ప్రయోగమునను దద్దయు సుఖమున్న దవనిజనుల కో మహర్షి వర్య ! ౯౧౭

కం॥ అది యరిషడ్వర్గహారం బది బహిరరినిగ్రహంబు నది యధ్యాత్మ
ప్రద మఖిలసౌఖ్యములకుం బదమది. యవ్విష్ణుదేవు పరమపదంబుఁ.

ఆ॥ అది వివేకరూపమగు క్షమాసత్యాది సకలగుణములకును స్థానభూత.
మది యొనర్చువాఁడు యజ్ఞాదు లొనరించినట్టివాఁడునగును యమివరేణ్య !

కం॥ అది యెవనిచేతఁ జక్కఁగ విదితంబగుచుండు వాని వెనుకటివారుఁ
విదితంబుసేసికొనియెద రది యొక త్రుటిఁజేయు భస్మమగుఁ బ్రాగఘముల్

ఆ॥ ఆకలియును దప్పి యాదిగాఁగల శ్రమ సంకుచించు నియమసంయుతునకు
నెపుడు నియమియైన నీతండు యోగియే యగు. విశేషమందు వారి పరుండ

కం॥ చాతుర్మాస్యను నేనరుచేతం దమి యోగ మభ్యసింపంబడదో
యాతని చేతులలోపలి పూతసుధాపాత్రి జాఱి భువిఁ బడినదగుఁ. ౯౨౦

ఆ॥ ఎల్ల కోరికెలను నెప్పుడుం గోరెడి మనసు చిక్కఁబట్టు మనుజవర్య
జ్ఞానమోక్షములకు ఘనమైనహేతువు మన సెయగును ఋమ్మ మౌనివర్య ! ౯౨౧

క॥ మనమును నియమించుటకై యనయముఁ బ్రజ్ఞాయుతుండు యత్నింపనగుఁ.
మనము సుగృహీతమగుచోఁ దనయా ! జ్ఞానాప్తియగును దథ్యమ్మిదిమా. ౯౨౨

ఆ॥ వారివలననుండి వహ్నివిధంబునం దన్మనంబు క్షమను దద్దగాత్రిహ్య.
మొక్కక్షమనె సకల ముక్తంబు నియమంబు బుధులచేత ననుఁగుఁబుత్రి ! వింటె.

క॥ సత్యంబె పరమధర్మము. సత్యంబే పరమతపము జనతతి కెపుడుఁ.
సత్యమె పరమజ్ఞానము. సత్యముననె ధర్మమెల్ల స్థాపితమయ్యెఁ. ౯౨౪

తే॥ ధర్మమూల మహింసయు. దాని మనసుచేతఁ జింతనసేయుచుఁ జేతచేత
వాక్కుచేతనుగూడ నీవై ఖరిగనె యాచరింపంగవలె నారదా ! మనుజుఁడు.

క॥ పరధనహరణము చౌర్యము. నరు లది వర్జింపవలయు నారద ! యెపుడుఁ.
మఱియుం జాతుర్మాస్యను సురభూసురధనమువంకఁ జూడఁదగదుమా.

పృథ్వి॥ అకృత్యకరణం బనర్హము మునీ సదా ! యేరికిఁ.
నికృష్టమగు చైదము ల్నెఱపనట్టివాఁడే ఋషి
ప్రకృష్టుఁడును బ్రాజ్ఞుఁడుం బరమయోగి ప్రక్షాళితుఁ
వికారత కుహంకృతిఁ వెడలద్రొబ్బువాఁడేనియుఁ. ౯౨౭

పృథ్వి॥ అహంకృతి శరీరమం దగు విషంబు మర్త్యాళి కో
యహీన! యటుగాన నయ్యది విసర్జనీయంబుచూ.
యహీనశయనంబునన్ హరి పరున్న యట్లైన న
య్యహంకృతికిఁ జిత్తమం దయనమీయరా దెంతయున్. ౯౨౮
క॥ ఆశారాహిత్యంబున ధీశాలి జితక్రుధుండు ధిక్కృతలోభుం
డైశుద్ధిగనడుఁ గలువము లా శాంతుని యొడలు విడిచి యవలకునడచున్ ౯౨౯
క॥ శమరూపమిత్రు సాహాయ్యముచే జితమాన మోహుఁడగునది. మఱియా
శమము విచారంబున గ్రాహ్యము. సంతోషమున దాని నార్జింపవలెన్.
క॥ మాత్సర్యంబును బుజుతను వత్సా! నియమింపఁజూడవలయును జుమి. యే
తత్సర్వ మెవఁడుచేసెడుఁ దత్సజ్జనతల్లజుండు తా మునివరుఁడా. ౯౩౧
క॥ చాతుర్మాస్యమున దయోపేతుండై వర్తిలుటయె పృథుధర్మమగున్.
భూతద్రోహ మధర్మం. బేతత్కృతి వర్జ్య మెల్లయావుల నెపుడున్. ౯౩౨
క॥ ఇది పాపసహస్రములకు మొదటికతంబని మనీషిముఖ్యు లనుదు. ర
య్యది కతముగ భూతదయను మదిలో నూనంగవలయు మనుజులు కడఁకన్.
ఆ॥ సర్వభూతములకు స్వాంతంబునందుండు సంతతంబుఁ దా ననంతుఁ. డట్టి
వాని నవమతించువాఁడు భూతద్రోహియగుట కేమిసంశయంబుగలదు? ౯౩౪
క॥ ఏధర్మంబున దయ మన దాధర్మముదూషితంబ. యద్దానివినా
సాధించు జ్ఞానవిజ్ఞానాధీనంబై నధర్మ మన లే దింకన్. ౯౩౫
ఆ॥ అట్టుగాన సేవ్య మఖిలాత్మభావంబుచే దయాభిధాన మాదిధర్మ
మహాదంబుగూడ. నందుఁ జాతుర్మాస్యమునను మఱియు సేవ్య మనఁగుఁగొడుక!

## చాతుర్మాస్యయందుఁ జేయఁదగినదానములు.

ఆ॥ సర్వధర్మములను సర్వదా యార్యులు దానధర్మమే ప్రధానమందు.
రందు హరి పరుండునపుడైన బ్రహ్మత్వకారణంబు దానకర్మ మవని. ౯౩౭
క॥ అన్నా నారద! కోవిదు "లన్నం బ్రహ్మస్వరూప"మని యందురిక దే.
హొన్నఁగఁ బంచప్రాణము లన్నంబునయందె యుండు నటుగాన నరుల్.
ఆ॥ అన్న ముదక మిచ్చునది. యన్నదాత యక్షయ్యసుఖమునొందు. సలిలదాత
యును నదేవిధముగ నొందు. నన్నోదకదానసమము లేదు ధర మఱొకటి.
సీ॥ వజ్రవైడూర్యాది వరవర్ణనీయమహాగమణీయతర మణిరత్నములయు
మెలియుం గిలియు లేక మిక్కిలి యొప్పువై బహుభంగులంగాలు పగడములయు
భూషణనిర్మాణమున కనుకూలమౌ కడుమంచి వెండిబంగారములయు
క్షౌమ రాంకవముఖాచ్ఛాదనంబులయును నిద్ప్రశంబు లెయ్యైన యుతరములయు

దానములను నన్నదానంబు మిన్న. యన్నోదకముల యాలయుం బ్రదాన
ములును వేదపాఠమును హోమమును మహాఫలము లచ్యుతుండు పండునపుడు.

కం॥ వైకుంఠుఁగూడి సతతము వైకుంఠములో వసింప వాంఛించెడిచో
వీఁకం గలుషక్షయమునకై కేశవశయనవేళ నన్నంబిడనా.

తే॥ వేయి జన్మంబులకునైన విబుధమౌని! పెట్టనిది పట్టెఁడన్నముం బుట్టదిలను.
గాన నన్నప్రదానంబుకతన సకలజంతువులుఁగూడ మిక్కిలి సంతసించు. ౫౪౨

క॥ దేవతలుం గాంక్షింతురు భావములం దన్నదానపరు నెల్లపుడుం.
దేవర్షి! మదుదీరిత మీవచనము నిజము నిజ మిఁకేమనవలయుం. ౫౪౩

ఆ॥ వజ్రమిశ్రితముగ వైవంగవలయుఁ బాత్రముల నాజ్య మన్నదానవేళ.
హరిపరుండియున్నతటి వజ్రదాతయౌవాఁడు వేల్పెకాని కాఁడు నరుఁడు. ౫౪౪

ఆ॥ గురువులకును భూమిసురులకు భోజన మాజ్యదాన సత్క్రియలను శ్రద్ధ.
హరి పరుండియున్నతటి నాచరించెడివాఁడు వేల్పెకాని కాఁడు నరుఁడు. ౫౪౫

సీ॥ ఆత్మీయవర్ణాశ్రమాచారసరణికిం దగురీతినుండు సద్ధర్మములును
శ్రీవత్సలాంఛనదేవసంబంధమై స్వాంతమాకర్షించు సత్కథలును
సురభూమిసురగురు సరిదకూపార తీర్థక్షేత్రముఖర సద్దర్శనములు
నియమితంబైనట్టి నిఖిలేంద్రియములచేఁ జేయంగఁబడెడి సత్సేవనములు
దానశీలతయును దైత్యారిపూజయు సురల ననుకరించు జ్ఞులకుఁదప్పఁ
బ్రజలకెల్ల దుర్లభములు చాతుర్మాస్యసమయములను వినుము సంయమీంద్ర!

క॥ పితృదేవతలంగూరిచి క్షితిఁ జాతుర్మాస్యయందు క్షితిదేవులకుం
గృతమైన యన్నదానము పితృలోకంబునకుఁ బనుచుఁ బృథుకల్మషనేఁ.

ఆ॥ చీమయేని యెవనిధామంబునుండి తా భోజ్యమును గ్రహించిపోవు వాని
యన్నదానమునను నఖిలదేవతలును దృప్తులగుచుఁ గోర్కి తీర్చుచుంద్రు.

క॥ చాతుర్మాస్యంబునఁ గడుఁబ్రీతిన్ మజ్జిగయుఁ బాలుఁ బెరుగును మర్త్య
వ్రాతంబునకుం బోసెడి యాతండు మహాఫలంబు నందుం దనయా! ౫౪౯

ఆ॥ జననకాలమందుఁ జక్కగం బిండంబు దేనిచేత బద్ధమైనమతియొ
దానిదాన మర్హతమము. శాకప్రదాతయును నరకమునకుఁ దాను జనఁడు. ౫౫౦

ఆ॥ బట్టలిచ్చువాఁడు ప్రళయంబువఱకును సోమలోకమందు సుఖముగాంచుఁ.
దక్కు ప్రతిమలకును దగుపువ్వవస్త్రంబు లిడిన సంతు వృష్టి నెనయకుండు. ౫౫౧

ఆ॥ చందనాగురులను జక్రి పరున్నచో ధూపమిడినయట్టి యాపురుషుఁడు
పుత్రపౌత్రసహితముగ విష్ణురూపుండు గాఁగలాఁడిఁకేమి గావలయును. ౫౫౨

ఆ॥ హరిపరుండియుండ నామ్నాయవేత్తయా విప్రుచేత ఫలము పెట్టువాఁడు
శయ్యనిచ్చువాఁడు జముపీడఁజూడరు. తిలలొసంగఁ బుట్టు రిలను మరల. ౫౫౩

ఆ॥ విష్ణుఁ బ్రీతుఁ జేయ విద్యను గోవును భూమి నిచ్చునట్టి పురుషవరుఁడు
తనదు పూర్వికులను దరియింపఁజేసెను. యతఁ డింద్రలోక మందఁగలఁడు.

ఆ॥ అనలమందు హోమ మవనీసురాళికి దాన మర్చనంబు ధేనువులకు
ననయ మొనర్పనగును. జాతుర్మాస్యమున విశేషముగను బొనరుచునది.

సీ॥ మంచిపాకములోన దించంగఁ జేసినదై యెంతయుం దివ్యనౌ నెఱ్ఱబెల్ల
మపగతమాలిన్యమగుచు స్థూలమును దనరారునట్టి సంద్రంపుటుప్పు
పాకంబునకుఁ గడుం బనికివచ్చెడిరీతి నాత్మసంసిద్ధమౌ నువులనూనె
అత్యంతమధురంబు నద్యతనంబునై పాలుపొంగునటువంటి పుట్టతేనె
వగరుగలిగిన పచ్చయింపు వస్తువులు తిలాన్న మేదేవతంగూర్చి యర్పితంబు
లగునో యా దేవతాలోకము గుడియించి చనును దద్దాత కలశాభోజనమునీంద్ర !

ఆ॥ దానపాత్రమగుచుఁ దనరు చాతుర్మాస్య వచ్చి వెళ్ళిపోవువఱకుఁగూడ
వసుమతీసురునకు వాగ్దత్త మీకున్నఁ దొంటిసుకృతమెల్ల మంటఁగలయు.

ఆ॥ వర్ధిపెరుఁగుచుండు వాగ్దత్తమైన ద్రవ్యమున కహరహంబు. నట్లుగాన
నించుకేని శీఘ్రమీనున్న దాని వాగ్దత్తమాచరింపఁ దగదు తగదు. ౧౯౯

ఆ॥ మోహసహితుఁడగుచు ముం దిత్తునన్నాఁ డాదిగాఁగ నిచ్చునంతవఱకుఁ
బెరుఁగుఁ గోటిరెట్లు సరిగఁ. జాతుర్మాస్య నంతకంటె దశగుణాధికమగు.

తే॥ అట్టిదాతలు పదునల్గురైన యింద్రులయగువఱకును నరకంబు నందఁబడుదు.
రట్లుగాన వాగ్దత్తమర్పణీయ మాలసింపక నరులచే యమివరేణ్య ! ౨౦౦

తే॥ ఒకరికొసఁగినదాని వేఱొకరి కొసఁగరా. దొసంగియు హరియింపరాదు మరల.
దత్తమైనట్టిదియును వాగ్దత్తమైనయట్టిదియుఁ దుల్యము లెఱుగు నరసిచూడ. ౨౦౧

సీ॥ స్వాధ్యాయ పఠనాదిసత్కార్యకరులకుఁ గరమిష్టమైన యాస్తరణములును
మాత్మాసనంబులై చూచుట కింపయి యలివహించుచునుండు కలశములును
బలుప్రకారంబులౌ పాకము ల్గావింప బహ్వనుకూలమౌ భాండములును
సంధ్యారుణద్యుతిం జాల దీప్తంబులౌ పావనతమ తామ్రపాత్రములును
శక్తికొలఁది నీయఁజనును జాతుర్మాస్యమున మహీసురులకు మునివరేణ్య !
తన్నుఁ బూర్వజులను దద్దాత విడిపించు వృజినవితతినుండి వేగముగను. ౨౦౨

సీ॥ అవయవసౌష్ఠవం బగ్గలంబుగఁగల్గి వత్ససంయుక్తమై వఱలునావు
మప్పుడుండెడి వట్టియావరక్షేత్రంబు వంటిదిగానట్టి పంటవలంతి
మాతి మిక్కిలి తెల్ల నవధాన్యములచేతఁ బూరింపఁబడియున్న చారుపాత్రి
చమురుయు వస్త్రాలు సంపూర్ణముగఁగల్గి బహుగుణవిధమైన వెలుఁగుదివ్వె
విశ్వకర్త గోత్ర విశ్వఫలప్రదుం డైన శౌరి ప్రీతుఁడగుటకొం కె
నవనిసురున కొసఁగుదాతయు ఋణత్రయమునను దప్పురుండె ముక్తుఁడగును. ౨౦౩

## —• ఇష్టవస్తు పరిత్యాగఫలము. •—

ఆ॥ ఇష్టవస్తువులను విడువాఁడు విష్ణుండు. లోక మిష్టవస్తులోల మెపుడుఁ.
గాన యత్నపూర్వకముగఁ జాతుర్మాస్య వదలవలయు నిష్టవస్తువులను. ౧౨౮

ఆ॥ కంచుకంచముం దృజించుటవలనను భూమిపాలుఁడగుచుఁ బుట్టఁగలఁడు.
రాగితళియఁ గుడువరాదు సదాగృహి. కందు వారి పరుఁడ ముందె. తగదు. ౧౨౯

తే॥ బ్రహ్మభూయస్త్వమొందుఁ దప్పక పలాశపత్రములలోన భుజియించుపంచజనుఁడు.
పొందు జిల్లేడుదళములయందు మెసవు పురుషుఁ డుపమానరహితమౌ పూజ్యపదము

తే॥ మఱ్ఱియాకునఁ దిననౌను గఱ్ఱినెస్తి మఱ్ఱియాకున శయనింప మఱియుఁ గుఱ్ఱ!
పోలు నశ్వత్థపత్రసంభోగ మెపుడు. నేకవారాన్నభుక్తి మహీశుఁడగును.

సీ॥ త్యక్తగోధూమాన్నుఁ డగు జనవల్లభుం. డగు లవణత్యాగి యధికసుభగుఁ.
డశ్వాప్తి తండులత్యాగికి ఘటియించు. రసపరిత్యాగికి వసువు లెదుగు.
శాకపరిత్యాగి సహితదీర్ఘాయువౌ, ఫలపరిత్యాగి యౌ బహుసుతుండు.
మధుపరిత్యాగికి మంచికను గ్గద. నాసవత్యాగికి నబ్బు ముక్తి.
పాలు పెరుగు వదల గోలోకవాసియౌ. వెండివదలఁ బుట్టకుండు వెండి.
కనకముం దృజింపఁ గలితబలుఁడగుఁ. బాయసంబువదల బ్రహ్మయగును.

సీ॥ అలచందలనువీడ నగును ధనాఢ్యుండు. పెసలనువీడ నాఁ బీడితారి.
మిరియంబులనువీడ నరపాలకుండగు. శొంఠివీడిన నౌను సుకవివరుఁడు.
పంచదారనువీడఁ బ్రహ్మపూజితుండగు. బెల్లంబువీడినఁ బెరుఁగు సిరులు.
ఆజ్యంబువీడిన నగును మహాసుఖి. నూనెవీడ సురూపుఁడౌను గరము.
బూరెలనువీడ రెండవ మారుఁడగును. బూరణపుబూరెలనువీడఁ, బొందుసుఖము.
పూవులనువీడ జ్ఞానసంపూర్ణుఁడగును. దలిమమునువీడ సతి వీడ కెలమినుండు.

సీ॥ కందులందృజియింప జ్ఞానవంతుండయి బలమును వీర్యంబు గలిగి వెలయు.
మృగమాంసమునువీడ నిఁగ నారకముచూడఁ. డగు జ్ఞాని.లావకత్యాగమునను.
సౌకరసంత్యాగి సత్యలోకమువొందు. దాడిమత్యాగి యౌఁ దతవిభూతి.
రక్తవస్త్రత్యాగి రాజవల్లభుఁడగుఁ. బట్టుకూలత్యాగి పడయు దివము.
త్యక్తగార్హస్థ్యుఁడగుచు బాహ్యక్రమమున శౌరి శయనించు నాల్గెల లీల్మను నెడల
మాతృగర్భంబునందున మరలఁబుట్టఁ. డేమిగలదింకనుడువ మునీంద్ర! నీకు. ౧3౦

సీ॥ చణకమాషాన్నముల్ సంత్యక్తమైనచో జన్మరాహిత్యంబు సంఘటించుఁ.
జందనత్యాగంబు సల్పంగఁబడినచో గాంధర్వలోకంబు గాంచితీరుఁ.
గుంకుమతోడి యలంకృతి మానుచో ననవలోకితమౌ యమాలయంబు.

చేటు నొకప్పుడుం జేత నంటకయున్న నగును యావజ్జీవ మతిధనాఢ్యుఁ.
డన్నృతసంత్యాగమున మోక్షమబ్బు. యక్షకర్దమత్యాగి బ్రహ్మలోకంబునొందు.
రాజవల్లభుఁడగుఁ గేసరంబువీడ హరిపరుండినసమయంబునందుఁ బుత్రి!

ఆ॥ నల్లవలువ వీడఁ జెల్లునుసతి. మవశ్యముగ వీడవలయు హరిపరుండ.
శ్యామలాంబరంబు సంద్రుష్టమగుమీఁద సూర్యదర్శనమున శుద్ధిగలుగు. ౫౩౨

క॥ పరమర్మంబును బ్రకటముపఱచుటచేఁ దత్క్షణంబ పాపముకలుగుఁగా.
హరికెయనావసరంబునఁ బరనింద త్యజింపవలయుఁ బ్రజ యటుగానఁగా.

క॥ పరదూషణంబు పాపము. పరదూషణవలనఁ గలుగు భయ మధికముగా.
బరదూషణంబు దుఃఖము. పరదూషణకన్న నున్నె పాపము పుడమిఁగా. ౫౩౪

క॥ కేవలదూషణమునసే కావలసినయంత పాతకము గల్గును గా
నీ వినినయట్టివానికి నావిధమైనట్టిపాప మబ్బదు తలఁపఁగా. ౫౩౫

తే॥ కేశసంస్కారసంత్యాగికిం దనూజ! తొలఁగుఁ దాపత్రయంబును దూరముగను.
హరి పరుండఁగ నఖరోమధరుఁడె యైనఁ బ్రిక్యహము గంగనాడినఫలమువొందు.

ఆ॥ ఎల్లవర్ణజనుల కెలమిఁ జాతుర్మాస్య యమ్యుపాస్యుఁడైన హరి ప్రసాద్యుఁ.
డగును బంధముక్త మాహరినామంబు పలికి తలఁచుకొనియుఁ బ్రజ మునీంద్ర!" 

వ॥ అనియిట్లు వక్కాణించుటయు నారదుండు ౫౩౬

—• వ్రతమహిమము. •—

ఆ॥ "విష్ణుదేవుప్రీల విధినిషేధంబుల నెపుడుచేయవలెనొ కృపను జెపుము.
త్వద్వచోమృతంబు తద్దయుఁద్రావినం దృప్తిగా దదేమొ దేవ! నాకు" ౫౩౭

వ॥ అని వాక్రుచ్చుటయు వెండియు బ్రహ్మదేవుం డిట్లనియె. ౫౪౦

ఆ॥ "కర్కసంక్రమమునఁ గమనీయజంబూఫలములచేత హరికి యమివరేణ్య!
యర్ఘ్యమీయవలయు. నల్ల జంబూద్వీపసంజ్ఞ వానఁగాదె సంఘటించె. ౫౪౧

శ్లో॥ మణ్మాసాభ్యంతరే మృత్యు ర్యత్ర క్వాపి భవే న్మమ
తన్మయా వాసుదేవాయ స్వయ మాత్మా నివేదితః.

క॥ అను నీమంత్రముచెప్పుచు ఘనచాతుర్మాస్యమందు గ్రహియింపఁగనౌ
తనయా! విధియు నిషేధము జనార్దనునిప్రీల జనము శ్రద్ధాయుతమై. ౫౪౩

ఆ॥ విధియనంగ వేదవిధి. నిషేధంబన నియమ. మవ్విరెండు వీరజాక్షుఁ
డే తలంపఁ. గాన నెవ్విధమునసైన సేవ్యుఁడతఁడు మానిసింహ! భక్తి. ౫౪౪

సీ॥ సాధుజనవ్రాతసంరక్షణార్థమై కృతమైన తన్మూర్తి కీర్తనమును
నమరసంహారణార్థ మవతరించెడి యాదిపూరుషుఁడగు శౌరి పూజనమును

ధర్మసంస్థాపన దక్షమైనటువంటి తదవతారంబుల ధ్యానములును
నష్టాంగసహితమై యతిభక్తిసహితమై కడుశ్లాఘ్యమౌ నమస్కారములును
సర్వమును నెవండు చక్రిసంప్రీతికై చేయువాఁడు ముక్తిఁజెందఁగలఁడు.
వాస్తవస్వరూపి వర్ణాశ్రమవిధికి మూర్తి విష్ణుమూర్తి మునివరేణ్య! ౫౪౫
ఆ॥ వ్రతమువలన హరిని వశుఁజేసికొనవలె. వ్రతము శ్రద్ధఁ జేయవలెను మేన.
మేను తపముచేత మిక్కిలి శోధ్యంబు హరిపరున్నయట్టి యవసరమున" ౫౪౬
వ॥ అనియిట్లు వచించుటయుఁ గలహభోజనుండు ౫౪౭
ఆ॥ "ఎద్ది వ్రతము? మఱియు నెద్దితపంబని వ్యవహరింపఁబడును వసుధలోన?
హరిపరుండ నెద్ది యాచరించిన మహాఫలముగలుగు? నాకుఁ దెలుపుమయ్య"
వ॥ అని యనుటయు నంబుజాసనుం డిట్లనియె. ౫౪౮
ఆ॥ వ్రతమనంగ భక్తియుతమైన విష్ణువ్రతంబయగును కామ్య తాపసాగ్ర్య!
తపమనంగ నగును ధర్మవర్తిత్వంబు. కృచ్ఛ్రముఖరకృచ్ఛ్రకృత్యమేని. ౫౫౦
ఆ॥ వినువచింతునీకు మును వ్రతమాహాత్మ్య మమరమౌనిసంచయాగ్రగణ్య!
అన్నివ్రతములకును నత్యుత్తమవ్రతంబగును బ్రహ్మచర్య. మడుగనేల. ౫౫౧
సీ॥ బ్రహ్మచర్యముకన్నఁ బరమోత్తమంబైన ధర్మసాధనమొండు ధరణిఁగలదె.
బ్రహ్మచర్య ప్రభావముచేత నేకాదె యుగ్రమైనతపంబు నుర్విమనుట.
బ్రహ్మచర్యమకదే పనులెల్ల నిర్విఘ్నముగ సమాప్తమ్ముఁజేయఁగఁ గలయది.
బహుఫలాఢ్యంబైన బ్రహ్మచర్యముకదే సత్తపంబునకెల్ల సారభూత.
మట్టిబ్రహ్మచర్య మనఘ! చాతుర్మాస్య నాచరింపఁబడిన నతివిశేష.
మది మహావ్రతంబటం చనవరతంబు నెఱుఁగుమయ్య. చెప్ప నేమిగలదు.
క॥ మున్నూటఱువది దివసము లెన్నఁగ సంవత్సరమున. కీదివసములం
దన్నారాయణు నొకదిన మున్నతి భజియించుటన్న నుత్తమ మరయన్. ౫౫౩
తే॥ ఈసుకార్యముచేసెద నేను దేవ! యని యిటు లేర్పరుచే వ్రతమందు. రదియ
హరిపరుండినయపుడైన నతివిశేష. మదియె నారాయణను. ముక్తుఁడగు నొనర్ప.
సీ॥ వీతిహోత్రమునందు వేల్పుట విప్రులయందు భక్తియు ధర్మమందు శ్రద్ధ
శుభమతి హరిభక్తి సుజనసంగమమును సత్యవాదము దయాస్వాంతతయును
ఋజుభావమును సచ్చరిత్రమం దాసక్తి మధురమౌ వాణి శమాదమములు
స్వాధ్యాయపాఠంబు చౌర్యంబులేమియు హింసావిదూరత హ్రీయుతతయు
మోహాశోపలోభములను మమత్వంబు నవలఁద్రోసియునికి యాగమోక్త
సత్క్రియాపరమగు జ్ఞానంబు మఱియుఁ గృష్ణార్పితమయిపెలయు నాత్మవృత్తి

ఆ॥ ఈవ్రతంబులున్నయెడల జీవన్ముక్తుఁడగు నరుండు. వాని నఘము లంట
వేకవారకృతమ యెపుడును ఫలియించు. హరిపరుండఁజేయ నధికఫలము.
క॥ వ్రతమెఱియును లేకుండను క్షితిఁజాతుర్మాస్య మెవరిచే నీతముగన్
విత వారి ధర్మమని యానతియిచ్చిరి తత్త్వవిదులు నారద! వింటే. ౧౫౭
ఆ॥ సర్వవర్ణములకు సద్వ్రతచర్య మహాఫలంబు స్వల్పమయ్యు వత్స!
యంత కెచ్చుసుఖద మదియు చాతుర్మాస్య. నింతకన్నఁజెప్ప వేమికలదు. ౧౫౮
క॥ సర్వత్రి చూడఁబడును సుపర్వముని! వ్రతులచేతఁ బంకజనాభుం
డుర్విం జాతుర్మాస్యను సర్వవిధంబులను వారి సాక యతించున్. ౧౫౯
సీ॥ తీర్థస్వరూపుండు ద్విజరూపుఁడును నయి జగతిఁ బవిత్రింబుసల్పు నెవఁడు
ఆగమమయుఁడును వనలమయుండునై ఘనకిల్బిషాటవు గాల్చు నెవఁడు
ఎవ్వనికృపచేత నెక్కఁ గూర్చుండు మోక్షమహీరుహాంబుపై సజ్జనంబు
ఎవనిసేవించిన భవనూర్యమూలమౌ తాపంబు గలుగదు ధరణియందు
ఆవిరాజా విష్ణు నజు షోడశోపచారములచేతఁ బూజనము విధింపు
మదేతపంబు మఱియు హరిపరున్నపుడు మహాతపంబటందు రార్యజనులు

## — తపోమహిమము. —

॥ పంచయజ్ఞము లాచరించుటయును నొక్క భంగితపంబయాఁ బ్రత్యహంబు
గృహికి స్వస్త్రీతోడి బుతుకాలగమనముం దపమని చెప్పంగఁబగినదగును.
అనవరతంబును నన్నృతంబులాడమియును నొక్క తపమయా నుర్వియందు
పతిత మహింపాదిసద్గుణంబుల నెల్లఁ బాలించుటయును దపంబె యరయ.
ప్రత్యహంబుఁజేయు పంచాయతనపూజయును దపంబె కాని మునివరేణ్య!
అవి మహాతపంబులగును జాతుర్మాస్య వాచరింప ఫలము నగ్గలంబు" ౧౬౧
వ॥ అని యిట్లుపలుకుటయు నమరముని ౧౬౨
కం॥ "పంచాయతనంబనుచు విరించీ! దేనికది సంజ్ఞ? కృప యధికముగా
మంచి దెటువ్యో? యది పూజించుట యెటో? విస్తరించిచెప్పుమీ నాకున్"
వ॥ అనవుడు బ్రహ్మయిట్లనియె. ౧౬౪
కం॥ ప్రాతఃసంధ్యావర్ణంబుల నోతనయా! రవిని రాత్రి యుడుపతి మధ్య
స్థానముజేవి సువర్ణములైతనరెడి పూలతోడ నర్చింపవలెన్. ౧౬౫
ఆ॥ వహ్నికోణమందు ద్వైమాతురుని నిల్పి రక్తచందనసుమరాజిచేతఁ
బూజసేయవలయుఁ బుత్రి! చాతుర్మాస్యమున విశేషముగను బూజ్యుఁడతఁడు.

ఆ॥ అసురదర్పహారి యగు భగవానుండు నైఋతీయవరేశమునం బ్రతిష్ఠి
తుఁడయి గేస్తు పగఱఁ ద్రుంచెడి సర్వదా. యట్లుగాన విష్ణు నచట నునిచి. ౫౬౭
ఆ॥ గంధపుష్పములను గమ్మని వంటకంబులను జేయవలయుఁ బూజనంబు.
వాయుకోణమందు వరుస నంబికనుంచి కొలువవలయుఁ గులము నిలుచుపొంటె.
ఆ॥ వేనిమహిమ బ్రహ్మవిష్ణ్వాదులును లిఖింపంగఁజాల రట్టి రవుని శ్వేత
పుష్పములను సతముఁ బూజించునది యాపమృత్యుముఖర దోషబృంద మెడల.
క॥ ఏతత్పంచాయతనము భూతలమున గేస్తులెల్లఁ బూజింతురుగా.
ఈతప మెపుడుం గార్యము. చాతుర్మాస్యఁ గృతమైనఁ జాలఫలంబౌ. ౫౭౦
ఆ॥ అన్ని పర్వవేళలందును గృతమైన దానధర్మములును దపమయగును.
అది యనంతఫలదమగును. జాతుర్మాస్యసమయమందు శ్రద్ధ సల్పఁబడిన. ౫౭౧
ఆ॥ బాహ్య మాంతరమనఁ బరగును శౌచంబు ద్విప్రకారమగుచు విప్రముఖ్య !
జలకృతంబు బాహ్యశౌచంబు. శ్రద్ధమై నాచరించుశౌచ మాంతరంబు. ౫౭౨
ఆ॥ ఇంద్రియముల నిగ్రహించుట యొకతపం. బింద్రియముల లౌల్య మెల్ల నణఁప.
నది మహాతపంబటంద్రు. చాతుర్మాస్య నింద్రియాళ్వనియమి యెనయుసుఖము.
ఆ॥ ఉత్పథమునఁజనెడి యుర్వింద్రియంబులే నరకమునను ద్రోయు నరుని. గాన
మనతయనెడి దుష్టమతియైన మొసలిని నిగ్రహించుటొప్పు నిరత మనఘ ! ౫౭౪
ఆ॥ అదియు నొక్కతపమె యగును. జాతుర్మాస్యమందదైన నగుమహాతపంబు.
కామమును జయింపఁగలవా ర్మహాత్ములు. అఖిలజగము గెలిచినట్లె వారు. ౫౭౫
క॥ కామంబును సంకల్పము నేమనుజుఁడు గెల్చు వానిదే జ్ఞానమనం.
గా. మూలమదియె తపమున కోమునీ యది హరిపరుండ నురుతపమగుఁజా. ౫౭౬
తే॥ లోభ మెపుడును ద్యాజ్యంబు. లోభమందుఁ గిల్బిషంబుండు. నద్దానిగెల్వ తపము.
హరిపరుండిన సమయమం దట్టిగెలుపు వహితతపమనఁబడుఁ బెక్కుమాటలేల. ౫౭౭
తే॥ మోహ మవివేకమును సదా మెనసి విడువఁదగును నారద ! వానిచేఁ దృక్తుఁడైన
వాఁడె యగు జ్ఞాని. యవ్వాని వదలకున్న విన్నియున్నను నజ్ఞానియే నరుఁడు.
ఆ॥ మదము దేహమందు మను వైరి జనులకు. దాని నిగ్రహింపనౌను సతము.
హరిపరుండుసమయమం దవశ్యంభావ్య మిమ్మదంబు నిగ్రహించు టన్న. ౫౭౯
క॥ మానము భయదంబగుచును దానుండును సకలభూతతతియందును. న
ద్దానిని క్షమచే గెల్వఁగనౌ. నది హరిశయనవేళ నధికఫలంబౌ. ౫౮౦
ఆ॥ అధికపాపకారియైనట్టి మాత్సర్యమును జయింపవలయు మునసి ప్రాజ్ఞుఁ.
డట్లు హరిపరుండునపుడు జయించునొఁ దిగజగముల సురల నొగిజయించు. ౫౮౧

క॥ మునులు జితేంద్రియులయ్యును దనయ! యహంకారమునఁ దావలమగుచున్
ఘనధర్మమార్గమును విడి చనయం బున్మార్గగాములగుదురు చూవే. ౫౮౩
ఆ॥ కాన నెప్పుడు విడువఁదగును నహంకృతి. యందువలన ఫలము ననుభవించు.
అట్లు హరిపదుండునప్పుడు విడుచుచో నధికఫలము గలుగు సామివరేణ్య!
క॥ మనమున నేకత్వాగం బనునది తపమునకు మూలమగు నారద! వీ
నిని వదలి శుద్ధమతివై మనుమనుజుఁడు బ్రహ్మమయుఁడు మహిఁ బరికింపన్.
ఆ॥ మొదలు కాయశుద్ధి పొందరే ప్రాజాపత్య మాచరింపవలయు నవనిజనము.
హరిపదుండుసమయమందే యొనర్చుచో నది మహాతపంబటండ్రు బుధులు.
క॥ హరిశయనవేళ నేకాంతరమైన యుపోషణము సతంబును జేయన్
నరుఁడు యమాలయమునకేఁక నరుగఁడు నారదమునీంద్ర! యఘవిరహితుఁడై.
ఆ॥ హరిపదుండు నెడల నహోహమును నరుం డేకభక్తమును సహించెనేని
ద్వాదశాహఫలము తప్పక కలిగెడి దినదినంబు నతనికిని మునీంద్ర! ౫౮౭
సీ॥ ఎవఁడు చాతుర్మాస్య నవుడు శాకాహారి క్రతుసహస్రఫలంబు గలుగు వాని.
కెవఁడు చాతుర్మాస్యఁ దవిలి చాంద్రాయణ మొనరించుఁ దత్పుణ్య మూర్జితంబు.
ఎవఁడు చాతుర్మాస్య నెంతయుఁ బారాక మాచరించును వాని యఘములడఁగు
ఎవఁడు చాతుర్మాస్యఁ గృచ్ఛ్రసంసేవియౌ వైకుంఠముననుండు వాఁడు ఘనత.
ఏప్రమాంసుఁడో మునీశ! చాతుర్మాస్యఁ దప్తకృచ్ఛ్రపరతఁ దావసించు
వాఁ డిహమునఁ బుత్రవంతుఁడై విష్ణుసాయుజ్యమొందుఁ గీర్తి యొప్ప వెలయు.
సీ॥ దుగ్ధపానమునఁ జాతుర్మాస్య గడపినఁ బాపసహస్రముల్ రూపుమాయు.
మితమైనయన్నంబు మెసవఁ జాతుర్మాస్యఁ గోలలం దొలంగి వైకుంఠ మొందు.
ఏకాన్నభోజన మెలమి జాతుర్మాస్యఁ జేసినఁ దెగుళులు చెందు లయము.
అక్షారలవణాశియైనఁ జాతుర్మాస్య బ్రహ్మహత్యాదిపాపములు వాయు.
ఉదకములను ద్రావి యున్నఁ జాతుర్మాస్య నహరహంబుగూడ నశ్వమేధ
యాగమాచరింప నబ్బెడిఫలమబ్బు సంశయంబులేక సంయమీంద్ర! ౫౯౧
తే॥ కందమూలాశనుండైన ఘనుఁడు తిన్నఁ దనదు పూర్వుల ఘోరపాతకమునుండి
యుద్ధరించుటయే కాక యొందుఁ బోయి విష్ణుసాలోక్యమును దాను విప్రవర్య!
క॥ చాతుర్మాస్యను విష్ణుప్రీతికిఁగా నెవఁడు శీతకృచ్ఛ్ర సహించున్
పీతాంబరుఁడగు శ్రీహరి యాతని కగు వశుఁడు నారదా! వింటివొకో.
ఆ॥ మాసమంతయు నుపవాసంబులుండిన నది మహాపరాక మనఁగఁబడును.
హరిపదుండియున్న యానాల్గునెలలలో నొకటనేని దాని నొనరుపనగు.

కం॥ ఎవ్వఁడిది భక్తి నోనర్చునో యవు విష్ణువు వాఁడు. తపములన్నిటిలోనఁ జా
భువినిది మహితతపంబగు. సవనంబులకన్నఁ బెద్ద చాతుర్మాస్యన్. ౯౩

ఆ॥ దుర్లభంబు మఱియు దుష్కరంబగు నీమహాతపంబుఁ జేయు సకలుషునకు
ప్రతిదినంబునందుఁ బదివేలయజ్ఞము ల్సలిపినంతఫలము గలుగఁగలదు.

సీ॥ ఈమహాపారాకమే మహాపుణ్యంబు. నీమహాపారాకమే సుఖంబు.
ఈమహాపారాకమే కడు శ్రేయంబు. నిదిసేయువానిమే నెనయు శౌరి.
జ్ఞానంబు వానికిఁ గలుగుఁ. బాతకయుక్తుఁడయ్యు జీవన్ముక్తుఁడగు నతండు
మాసోపవాసియౌ మట్టుకేగర్జించు నఘములు. నరకంబు లంతకఱకె,
మాయలంతకఱకె. మఱియుఁ జాతుర్మాస్య నుపవసించియున్న యుర్వ్యమరుని.
నతిథిఁజేయువాని హత్యాసహస్రసంజనితపాపములును క్షయముగాంచు. ౯౪

ఆ॥ ఎవ్వఁడీపురాణ మితరులకును సుబోధముగ వినుచుఁ జదువుఁ దనకుఁదాను.
వాఁడుగూడ గురునివంటివాఁడై ఫలం బనుభవించు సంశయంబులేక. ౯౬

క॥ పరమపవిత్రంబగు నీపురాణమును మానసమునఁ బురుషోత్తము సు
స్థిరముగనుంచి పఠించిన సురలకు దుష్ప్రాప్యమైన సుధ లభియించున్." ౯౭

——• తపోధికారము. •——

వ॥ అని యిట్లు చెప్పుటయు నారదస్తి. ౯౮

తే॥ "షోడశోపచారంబుల చొప్పదెట్లో హరిపరుండంగ నిత్యంబు నాచరింప
నుచితమైనట్టి యాషోడశోపచారములును నెయ్యవో వివరించి తెలుపుమయ్య."

వ॥ అని యడుగుటయుఁ బద్మయోని మఱియు నిట్లనియె. ౧౦౦

కం॥ "శ్రుతిశాస్త్రవిధానముచే నతివృథముగ విష్ణుభక్తి యాచరణీయం
బు తనూజా! ఇదియంతయు శ్రుతిమూల. మనాది హరియు శ్రుతి పఠించున్.

తే॥ బ్రాహ్మణాధారములు శ్రుతుల్. బ్రాహ్మణుండు వహ్నియారాధనముచేయువాఁడు. [ వాఁడు
యజ్ఞమున దేవునర్చించు చాళ్రియాశమందుఁ బ్రాస్తాహుతి జితేంద్రియా!

కం॥ హరిపూజారతమగుపరిక నిరతము ధరియింపఁజేయు నిఖిలజగంబున్. [ మునీంద్ర!
స్మరణముసేయఁగఁబడిహరి హరియించు నశేషమైన యాభీలంబుల్.

కం॥ జలరూపంబునుదాలుచు జలజాయతలోచనుండు చాతుర్మాస్యన్.
దలఁచుకొనఁబడినయెడలను విలయించు విశేషముగను వెతలు మహర్షి!

తే॥ ఉదకమునమండి యన్నంబు లుద్భవించె. హరిశరీరాంశ సంభూతమైనయన్న.
మగును బ్రహ్మము. దానిని హరినిభిలిచి యిడ జరామరణాదు లేన్నడవు వీఁడ.

సీ॥ ఆకాశమునుండి యాది ఋగ్వేద మొక్కటియె యేర్పడెఁగాని క్రమముగాను.
జగతి యజుస్సామసంజ్ఞలుగలది సహస్రశీర్షమును నారాయణమయ.
మయి షోడశార్చల నలరారుచును మహాసూక్తంబటంచుఁ దాఁ బ్రోక్తమయ్యె.
తత్పాఠమాత్ర నెంతటి బ్రహ్మహత్యయు నడఁగును. బుధుఁడైన యవనిసురుఁడు
స్వీయదేహమునను స్మృత్యుక్తమున న్యసించునది మొదటఁ. బిదప శుద్ధమయిన
సురుచిరప్రతిమల మఱియు సాలగ్రామములను నొగి న్యసింపవలయు లలిని. ౬౦౬
సీ॥ వైకుంఠపురమున వర్తించునట్టిఁడు కౌస్తుభమణిచేఁ బ్రకాశమానుఁ
డర్యమకోటితుల్యప్రభాసహితుండు పంచశాఖస్థిత భవ్యదండుఁ
డఖిలపాపసమూహహారణుండు శిఖయును సూత్రంబు గలిగిన సుందరుండు
పచ్చనిరంగు హొంబట్టు పుట్టముగట్టి సెంపెసలారెడిభిత్తురాట్టు
నైన విష్ణురూప మావాహనముచేసి పూజసేయవలయుఁ బూర్ణభక్తి.
అవిధంపుఁబూజ యల్లచాతుర్మాస్యమున విశేషఫలదమని వచింతు. ౬౦౭

—♦ షోడశోపచారపూజ ♦—

ఆ॥ ధ్యానసంస్థుఁడైన తద్విష్ణుభగవాను బ్రణవముఖరమలను బరఁగునట్టి
ఆదిఋక్కుచేత నావాహనముచేయవలయుఁ బ్రథమమందుఁ గలహాశీల! ౬౦౮
తే॥ పార్షదులతోడ సహితుఁడై పరగుచున్న హరినిగుఱియించి సౌవర్ణ మాసనము ద్వి
తీయఋక్కునఁ గల్పించి యీయవలయు. భూరిభక్తిని నది పరిపూర్ణమగును. ౬౦౯
తే॥ పాద్యము తృతీయఋక్కున హ్యద్యముగను నొసఁగవలయును గంగను సంస్మరించి.
నాలుగవఋక్కుచే నర్ఘ్య మోలి నిచ్చునది సరిత్తులతోడ సప్తాంబుధులను. ౬౧౦
తే॥ మఱి జగన్నాథునకు నాచమనము చేయనగును శుద్ధోదకమున. మాఁడాచమనము
లాచరించిన బ్రాహ్మణుఁ డగును శుద్ధుఁ. డాచమనవారి పవిత్రతిష్ఠమగుట లెస్స.
సీ॥ ఫేనబుద్బుదముల హీనమౌ నుదకంబు హృత్కణ్ఠంబుగా శుద్ధినొందు ద్విజుఁడు.
కంఠగతంబుగా క్షత్రియునకుఁ దాలుగతముగా విశునకుఁ గలుగుశుద్ధి.
స్త్రీయును శూద్రుండుఁ జేత జలంబుల స్పృశియించియే శుద్ధిఁజెందఁగలరు.
భక్తియుక్తంబుగం బంచమఋక్కుచే నాచరితవ్య మయ్యాచమనము.
భక్తిచేతనె గ్రాహ్యుండు పద్మనాభుఁ-డాత్మనిచ్చును భక్తిచే నతఁడు సరిగ.
ఆచమనమైనతరువాత నాఱవదగు ఋక్కుచే స్నాన మొగిని జేయింపవలయు.
సీ॥ నిఖిలౌషధీరసాన్వితము భస్మఘటసంస్థితమును మఱి సువాసితము నైన
జలమున మనసుచే సముపాహృతంబైన తీర్థోదకమునను దేవునకును

స్నానంబుఁ జేయింపనౌను గరముఁ శ్రద్ధ-నశ్రద్ధ దత్తమానస్తి రత్న
రాశిమైనను ఫలరహితమౌ. శ్రద్ధచే నర్పిత జలమే ననంతఫలద.
మట్టిశ్రద్ధతోడ నట్లు చాతుర్మాస్య నర్పితస్వుఁడైన నగుఁ బవిత్రుఁ.
డంత వస్త్రదాన మాచరితవ్య మేడనదిమైన బుక్కున వినువునకు. ౬౧౩

క॥ ఆచ్ఛాదింపఁగఁబడు జగ మాచ్ఛాదింపంగఁబడిన హరివస్త్రముచే.
ఆచ్ఛాదనదానం బోనచ్ఛల! మహాఫలంబు చాతుర్మాస్యన్. ౬౧౪

ఆ॥ విష్ణురూపిమైన భిక్షునకుం బునరాచమనము నొసఁగవలె మునీంద్ర!
అంత యజ్ఞసూత్ర మష్టమ బుక్కుచే నీయవలయు. దానిచాయ వినుము. ౬౧౫

సీ॥ దానిసంస్పర్శంబు భానుకోటిస్పర్శమున కనురూపమై తనరు ఘనత.
అనవరతంబును నత్యధికముగ విరాజమానంబది తేజుతోడ.
అగ్రహారికుండగు విప్రునం దది సౌదామినీకోటిసమతఁబరఁగు
బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపంబును వేదమయంబునై వెలయునద్ది.
సవితృచంద్రవహ్ని సంగమమున బుణత్రయము చేత సంయుతంబునద్ది.
తత్ప్రభావమునను దా ద్విజన్ముండుగాఁ జేర్కొనంగఁబడెడుఁ బృథివి జనుఁడు.

సీ॥ జన్మంబుచే శూద్రశబ్దవాచ్యుండును సంస్కారమున ద్విజశబ్దవాచ్యుఁ
డతఁడు. శాపానుగ్రహసమర్థుఁ డట్లు కోపంబు ప్రసన్నతి బ్రాహ్మణునివె.
త్రైలోక్యమునయందుఁ బ్రవరుండు నాఁగను బ్రాహ్మణునుండె పలుకఁబడెను.
బ్రాహ్మణసముఁడైన బాంధవుఁ డిఁక లేఁడు. కలుగదు తత్తుల్య గతియు నేని.
సచర మచర మైన జగతీత్రయంబునం దొకఁడు బ్రాహ్మణునకు నద్దిగాఁడు.
వారిపరుంతు నెడల యజ్ఞోపవీతి బ్రాహ్మణుఁడు చేయు నఖిల మాత్మమయము.

ఆ॥ అఖిలజగముగురుఁడు హరి యత్నకర్తమలిప్తుఁడగుట దాన లేపనంబు
నవమ బుక్కుచేత నవనరూపున కాచరింపవలయుఁజూ నిలింపమాని! ౬౧౮

క॥ ఈ నిఖిలంబగులోకం బా నారాయణునిచేత నాప్యాయిత. మా
శ్రీనాయకు నతీకర్తినెకా నారద! వాసితంబు కడు జగమెల్లన్. ౬౧౯

సుగంధి॥ తేజమునను సూర్యుఁడగుచు దేవభావమొంది వి
భ్రాజమానమైన నట్టి బ్రహ్మముఖ్యరపదములన్
రాజిలంగఁగలదు చందనంబు హరి కొసంగుచో
త్మ్మానసం బిఁకేమి నీకు సంయమీ! వచింపెదున్. ౬౨౦

క॥ చందనలేపముచేఁ గడుసుందరుఁడగు నందసూనుఁ జూచిన భాస్వ
న్నందను మందిర మొందరు. సంతియమే యందులకిఁకఁ జాతుర్మాస్యన్. ౬౨౧

ఆ॥ దశమబుక్కచేతఁ దగఁ బుష్పపూజయు భక్తిపూజ చేయఁగలయు నట్లు.
పుష్పగర్భమందె పూజ్యుఁ డగు లక్ష్మి రహిఁ వసించుఁ దా నిరంతరంబు. ౬౨౩
తే॥ సర్వమయుఁడయ్యు విష్ణు వేచారు దోషముల స్పృశింపఁగఁబడఁడో యాలలిని లక్ష్మి
యును సతీత్వంబు లోపింపకుండ నందు సర్వమయుఁయయ్యు నారదసంయమీంద్ర!
ఆ॥ ఎల్లప్రతిమలందు నిలఁగల మనుజాది సర్వభూతములను సంతతంబుఁ
బూలతోడిపూజ పోషరింపఁదగినది దేవతల పితాళ్ళ తృప్తిపొందె. ౬౨౪
ఆ॥ అబ్ధిజాఁతుతోడి హరి యొక్కఁ డెవనిచేఁ బూజసేయఁబడునో పూలచేత
బ్రహ్మమొదలు స్తంబపర్యంతమగు జగం బతనిచేత నగును నర్చితంబు. ౬౨౫
ఆ॥ అట్లుగాన విష్ణు నవదాళసుమములఁ బూజసేయఁగలయుఁ బూర్ణభక్తి
అనయ. మధికఫలదమగును జాతుర్మాస్యయందె యట్టిపూజ యాచరింప. ౬౨౬
ఆ॥ భక్తిసహితమైన ప్రసవార్చనంబున నభిమతార్థసిద్ధి యగును సతము.
ప్రసవశోభి హరికిఁ బ్రణతుఁడౌ నొరుఁడును క్షయవిహీనమైనజగము వొందు.
క॥ ఈపని చాతుర్మాస్యను నేప్రజ చేసినను గలుగు నెక్కువఫల మో
శాపాయుధ! యేకాదశి ధూపము యతిరూపుఁడగు విధువునకు నిడనౌ. ౬౨౭
శ్లో॥ వనస్పతిరసో దివ్యో గంధాఢ్యో గంధ ఉత్తమః
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం. ౬౨౮
శా॥ ఈమంత్రంబును జెప్పి యాగుడజమై యేపారు ధూపంబు త
ద్భూమిభర్తకు నిత్య మిచ్చునది. చాతుర్మాస్య నింకన్ ఫలం
బౌ. మాంసీజటలన్ పితామహులన్ వ్యాప్తంబు బాహ్లీకమున్
స్తోమంబుం గల దైన ధూపమిడినన్ సూనా! బలిధ్వంసికిన్. ౬౩౦
ఆ॥ క్రతుభుజులు తనూజ! ఘ్రాణంబునలనను సంతసించుచుంద్రు సంతతంబు
ఘ్రాణహారము ధూపకర్మంబు. గావున నర్పణీయమద్ది హరికి భక్తి. ౬౩౧

## — దీ ప మ హి మ. —

క॥ ద్వాదశబుక్కన దీపం బౌ దేయము ముక్తికాములగువారల కో
భూదేవా! తేజోవిభవా దీపము ముఖ్యమగును నఖిలక్రియలన్. ౬౩౨
శ్లో॥ దీప స్తమోఘనాశాయ దీపః కాంతిం ప్రయచ్ఛతి
తస్మా ద్దీపప్రదానేన ప్రీయతాం మే జనార్దనః. ౬౩౩
ఆ॥ వేదబుక్కతోడ విహితమైన పురాణమంత్రమిది కుమార! మహితదీప
దానమునఁ బ్రియుక్తమై నశింపఁగఁజేయుఁ గల్మషములు. నేమిగలదు చెప్ప.

శా॥ చాతుర్మాస్యమునందుఁ జక్రియెదుటన్ జాజ్వల్యమానంబుగా
జోతిన్ నిల్పినవాని పాతకపురాసుల్ దహ్యమానంబులౌ.
శ్రీతుం గృష్ణుని యాలయంబునను దివ్వెం బెట్టుపర్యంతమే
భీతుండయ్యెడుఁ బాపి. పాపములు నిశ్చేతాత్మ గర్జించెడిన్. ౬౩౫
శా॥ దీపంబున్ దరిసించుమాత్రమున సిద్ధించున్ సమస్తంబు. శ్రీ
గోపాలాలయమందు దీపమును నేకోర్కెం బ్రతిష్ఠించునో
ప్రాపింపంగలఁ డెన్నలేక యది పుత్రా! చక్రి నిద్రించుచో
దీపారాధనచేయునట్టిఁ డెనయుం దృప్తిన్ ఫలం బెంతయున్. ౬౩౬
క॥ పంచాయతనస్థలముల నంచితకల్పించ దేవతాయతనములం
దుంచునది దివ్వె త్రిజగత్సంచారా! తప్పకుండఁ జాతుర్మాస్యన్. [నిచ్చుముక్తి
తే॥ అర్చితుఁడు ధ్యాతుఁడును స్తుతుఁడగుచు నొకయపేంద్రుఁ డానందమొందుచో
ముక్తికోటి కిచ్చునది విష్ణుమూర్తి కెపుడు స్వగృహమందునఁగల శుభవస్తువెల్ల.
క॥ శ్రీపతిదీపం బస్మద్దీపంబునకన్న మిన్న. శ్రీపతియే చూ
నాపాలిటి యైశ్వర్యం. బోపుత్రా! కోరకుండ నొసరిన దదియున్.” ౬౩౯
వ॥ అనియిట్లు వక్కాణించుటయు నారదమునీంద్రుండు ౬౪౦
ఆ॥ “మాధవాలయమున మంత్రపూర్వకముగా దినదినమునఁ బెట్టు దివ్వెకంటె
నధికఫలద మెట్టులగును జాతుర్మాస్యమునఁ బెట్టుదివ్వె యబ్జయోని!” ౬౪౧
వ॥ అనవుడు సురజ్యేష్ఠుండు ౬౪౨
సీ॥ “పులుఁగుతత్తడి రాతెపో యధిదైవంబు సంతతంబును నాకు సంయమీంద్ర!
చుట్టుకైదువుజోదె చూ పూజనీయుండు నిరతంబు నాకు మునిప్రకాండ!
మనుగాడ్పుదిండి పానుపునఁబండెడు మేటి ధ్యానింతు సతమేను దాపసేశ!
పసిడిపుట్టముదాల్చి పగఁగు వైకుంఠుండు నాకంటె సత్కృష్టుఁ డోకుమార!
అట్టివారి కభీష్టమగు దీప మనయంబుఁ బాపహారకంబు భక్తవర్య!
అది విశేషముగను నల్ల చాతుర్మాస్యఁ గామసిద్ధికరము ధీమదగ్ర్య! ౬౪౩
క॥ వెన్నుఁడు దీపమునంబలె జన్మముల సహస్రమునను సంతుష్టుండై
తన్నుభజించినజనులకుఁ గన్నగ వరమీఁడు తనయ! తెలియునొ లేదో.
ఆ॥ అల్పమైనయట్టి శ్యామమున దీపంబు నిల్పవచ్చు. ఫల మనల్పమద్ది.
హరిపదుండఁ బెట్టు నాదీపపుణ్యంబు మింత యనిగణింప నేరితరము? ౬౪౫
తే॥ కాన సర్వాత్మభావనఁ గరముశ్రద్ధ హరికిఁ బ్రీతిరూపమైనట్టి యతికి దీప
దాన మొనరింపఁ బంకజాతని కృపాశించె. వట్లు ఇంద్రాత్సితంబగు నఖిలజగము.

ఆ॥ అట్లు దీపదాన మగుడుఁ ద్రయోదశబుద్ధిచేత హరికి వ్యాప్తమగుచు
వెలయునన్నమును నివేదింపవలయుఁ జూ భక్తియుక్తులగుచుఁ బ్రజలు తనయ!
ఆ॥ అమృతముం ద్యజించి యా యన్నముం గోరు నమరులును గృహస్థు నంగణంబు
గాచి యుందురెప్డుఁ గానఁ జాతుర్మాస్య నన్న మొసఁగవలయు హరికి ద్విజుఁడు.
సీ॥ కమనీయతమములౌ తమలంపుటాకులం బొలుపారుచుండెడి పోకపండ్లు
స్వాదువులైనట్టి జంబూఫలంబులం దద్దయు మధురమౌ ద్రాక్షపండ్లు
తృప్తికరంబులౌ తియ్యమామిడిపండ్లఁ జాల స్థూలములైన జామపండ్లు
కోరదములగునట్టి దాడిమఫలములం దత్కాలసముదాహృత ఫలములను
జక్రిపాణికి గరము సంతుష్టి నొసరింప నర్ఘ్యమీయవలయు నధికభక్తి.
అంత నాచమనము నారతికమును నిచ్చునది యఘంబులెల్లఁ బ్రిదలుపొందె.
తే॥ శంఖతీర్థంబు గొంచుఁ దత్సలిలమందు ఫలములుంచి మధుద్వేషి ప్రీతికృతియగు
యతివమున కర్ఘ్యమిచ్చిన నబ్ధిసప్తకాంబుదానఫలావాప్తి యగును బ్రజకు. ౬౫౦
క॥ పదునాలవ బుద్ధిన యతిపదముల కేఁగంగవలయుఁ. బదపడి భక్తిన్
పదునైదవదగు బుద్ధినఁ బ్రదక్షిణము సేయనగును బాలుఁతోడన్. ౬౫౧
తే॥ నాలుగుపర్యాయములు జగన్నాథరూపుఁడైన యతికిఁ బ్రదక్షిణమాచరింప
నద్ది జగతీత్రియంబున గగుఁ బ్రదక్షిణం. బటుల సర్వతీర్థాటనంబు నగును. ౬౫౨

—• సాయుజ్యచింతనభక్తి. •—

ఆ॥ యోగవేత్తయగుచు నొగిఁ బదునాఱవ బుద్ధిచేత దేవఋషివరేణ్య!
స్వాంతమందు దేవసాయుజ్యచింతన సేయవలయు భక్తి క్షితిసురుండు. ౬౫౩
క॥ తనకును మధుసూదనునకు ననయము భావింపఁగూడ దాత్మను మూర్తిన్.
మను యోగవిదుఁడు దృశ్యంపన మూర్తామూర్తరూపుఁడగుటఁ దనూజా! ౬౫౪
ఆ॥ అతఁడు దృష్టుఁడైన యావల సదసత్స్వరూపమునను బ్రిభవమై పొలిచెడి
క్రియ నివృత్తమగుఁ దనయ! తేజములలోన నాత్మ రవిగ నెంచునది సతంబు.
ఆ॥ ఏని హరి నటంచు నెద నెప్పుడును విచారించునట్టి ద్విజవరేణ్యుఁడు సుత!
హరిశరీర మొంది యగుచు జీవన్ముక్తుఁ. డింతకన్నఁ జెప్ప నేమిగలదు. ౬౫౬
క॥ చాతుర్మాస్యమ యోగసమేతుఁడు కావలయు ద్విజుఁడు మిక్కిలి. శ్రీయో
దాతయగు విష్ణునం దిడి యాతతమగు భక్తియోగ మాత్మజ! వినుమా. ౬౫౭
ఆ॥ అట్టిభక్తియోగ మాహాత్ములకె కాక క్షత్రియవైశ్యులకును సముచితంబు.
స్త్రీలు శూద్రజాలును ద్విజగతిసంచార! దాని నాచరింపఁ దగరు తగను." ౬౫౮
క॥ అని చెప్పుటయు నారదుండిట్లనియె. ౬౫౯
క॥ "స్త్రీశూద్రుల కెదిధర్మము? శ్రీశుని సేవింపకుండ నెటు లవ్వారల్
పాపిష్ఠ్యము వహియించెద? లోకశ్రుతి! ముక్తియెట్టు లొగిఁ జెప్పుమయ్యా."

## —♦ సచ్ఛూద్రులు. ♦—

వ॥ అనవుడు బ్రహ్మదేవుండు ౬౬౧

క॥ “ సచ్ఛూద్రులుసహిత మతిస్వచ్ఛములగు వేదములను జదువందగ దో
సచ్ఛీల! నరకమునఁబడుఁ దచ్ఛ్రవణంబునన. యేల తదుపరివార్తల్. ౬౬౨

పృథ్వి॥ పురాణపఠనంబునుం మునివరేణ్య! తచ్ఛూద్రులా
చరింపఁదగదయ్య సంశ్రవణముం వినా యెంతయుం.
ధరామరుముఖంబునం దవిలి యర్థ మా గ్రాహ్య. మె
త్తఱిం స్మృతుల విన్కియుం దగ. దిఁకేమి వాక్రువ్వనా ” ౬౬౩

వ॥ అని వక్కాణించుటయుఁ గలహాశనుండు వెండియు నిట్లనియె. ౬౬౪

తే॥ “ ఎవరు సచ్ఛూద్రులను ఖ్యాతి నెనసినారొ వారి వివరించి చెప్పంగవలయు దేవ!
ఎవరు సచ్ఛబ్దమున వాచ్యులెవరు శూద్రులిలను సచ్ఛూద్రనామ మదెట్లువచ్చె?”

వ॥ అని ప్రశ్నించుటయుఁ బంకజాసనుండు ౬౬౫

తే॥ “ తుల్యకులరూపయును దశదోషరహిత యయినకన్యక వేదోక్తమైనవిధిని
పరిణయంబైన శూద్రుండు ధరణిలోన నగును సచ్ఛబ్దపూర్వుఁడై యనఁగుఁదనయా!

సీ॥ అంగంబులం దెందు హైన్యంబులేక పావిత్ర్యంబువహియింపఁ జాలుదాని
కుష్ఠంబు మొదలైన గొప్పజాడ్యములచే నిందితగాకుండ నెగడుదాని
పలుకుపల్కినఁ దేనె లొలుకంగ మాటాడు చెంతయు లలితయై యొసఁగుదాని
దశదూషణములకు స్థానంబుగాకుండఁ జూచుకుదనంబునం బరఁగుదాని
ఆగమోక్తవిధిం బెండ్లియాడినట్టి వాఁడు సచ్ఛూద్రుఁ. డతఁడు దేవముఖులకు వి
భాగకృత్తగును. దదూఢ ప్రథమ మెల్లపుణ్యకృతులం బ్రకీర్తిత పుత్ర! వినుము.

వ॥ దానితోడం గూడి చేయు ధర్మంబు సంపూర్ణఫలప్రదంబు. ౬౬౬

సీ॥ మఱి నమస్కారాంతమంత్రపూర్వకముగఁ బంచయజ్ఞము లాచరించుకొనుచు
ఎలమి నిష్టాపూర్తములను శ్రాద్ధాదికంబులను శుద్ధుండయి సలుపుకొనుచు
భృత్యులు మొదలైన బీదజనంబుల సంరక్షణమునందు సక్తులగుచు
ఆమ్నాయవిధిఁ బెండ్లియాడిన స్త్రీతోడి రతమాత్రమునఁ దృప్తమతులగుచును
కృష్ణు పావననామ సంకీర్తనమ్ము నేమఱక చేయు శూద్రునియెడల దేవ
తలును సంతుష్టులగుదురు తనుభవా! విశేష. మట హరి పవళింప శేషశయ్య.

తే॥ ఆడుదియుఁ జేయనగుఁ బంచయజ్ఞముల నమంత్రకంబుగ నారదమానిచంద్ర!
పితరులకు దేవతలకును బ్రీతియగును బంచయజ్ఞంబులంబోలెఁ బతిసపర్య.

క॥ పతివ్రత దేహంబున దేవతలెల్లరు నుండ్రుగాన భార్యాభర్తల్
యుతులయిరె ధర్మకృతులను సతమును గావింపవలయు సంయమిముఖ్యా!
తే॥ ఉభయులుం గొల్చి యర్థింప నొసఁగినట్టు లొకరికొసఁగరు వేలుపు లోకుమార!
కాన నెల్లప్పుడును బుణ్యకార్యములను సహితులైయుండవలయును సతియుఁబతియు.
క॥ చాతుర్మాస్యంబున సంప్రీతి సతీపతులు గూడి విష్ణుని భక్త్య
న్వితంబుగ సేవించుట యోతనయా! భవ్య. పేల యుక్తులు పెక్కుల్. ౬౨౪
తే॥ భర్తకున్న దర్ధభాగంబె తనమేన. నపర మూర్ధమైన యాత్మకులజ.
దర్ధకార్యమునకు నధికార మాపెది యగుట సర్వధర్మ మదె ధరించు. ౬౨౫
తే॥ ఎవతె మృతుఁడైన పతితోడ నెలమి ననుగమించు నాపె పతివ్రతయంచుఁదెలియు
ముద్ధరించును గులమంతయును గుమార! యాపె యాత్మీయమైన మహత్త్వమునను.
ఆ॥ అన్యజాతివాఁడె యగుఁగాక తనుఁ బెండ్లియాడినట్టివాని ననుగమించి
అగ్నిఁజొచ్చునట్టి యాసాధ్వి కులమెల్ల నుద్ధరించుఁజుమ్ము యోగిచంద్ర! ౬౨౬
ఆ॥ పుణ్యపురుషు లుదకముననుండి పాచిని పీరమునకు బలిమిఁ దీసినట్టు
లనుగమించువనిత యాత్మీయనాథు సముద్ధరింపఁగలుగు నోకుమార! ౬౨౭
క॥ ఒకజాతిపురుషుఁడును వేఱొకజాతిస్త్రీయుఁ బెండ్లి యొనరిచికొనినన్
బ్రికటంబగుధర్మక్రియ నిఁక వారిరువురును బ్యాజ్యు. లేమనవలయున్. ౬౨౮
ఆ॥ ఎవరివర్ణమునకు నేర్పడియుండిన యాసుకర్మములు సమాచరించి
యభమొ శుభమొ పొందనగుఁగాని సంబంధ మించుకయును నుండ దిద్ధరికిని.
ఉ॥ ఎక్కువదానిఁగాని మఱి హీనకులోద్భవఁగాని పత్నిఁగా
నొక్కపుడుం బొనర్పఁదగఁ డుర్విని శూద్రుఁడటులొప్పనర్చి పెం
డెక్కుఁడు. దానిఁగూడుకొని యేదియొనర్చినఁ గాదు తృప్తిదం.
బక్కట! తత్తనూజకృతమైనను నట్టులె వ్యర్థమయ్యెడిన్ ౬౩౧
ఆ॥ విలిచిచేసికొనిన జలజాక్షి దాసినా వాచ్యయగునుజుమ్ము వసుధలోన.
సంయమిప్రకాండ! సచ్ఛూద్రునధికారమందు మన దొకప్డు నమ్మృగాక్షి. ౬౩౨
క॥ ఏకన్నియ జనకునిచే శ్రీకరముగ నిచ్చి పెండ్లిచేయంబడునో
ఆకన్నియ పితృదేవార్చాకరణంబునకు నగును సాధక యెపుడున్. ౬౩౩
సీ॥ సల్లక్షణంబులు చాలంగఁగల్గియు వినయవిధేయతాన్వితయగుచు
పతిమీఁద నత్యంతభక్తిగల్గినదయి సచ్చరిత్రముతోడ సహితయగుచు
సద్వంశమందున జనియించినట్టిదై మతిమతి శోభాయమానయగుచు

ధర్మకార్యంబులం దత్పరయయి వివేకముదొట్టిగుణములు గలదియగుచు
వెలయుకన్య ధర్మవిధిచేత సద్ద్విజనుఁడు పెండ్లియాడఁజనును సుత ! ప
విత్రములనుజేయుఁ బితృమాతృవంశంబు లట్టికన్య. యేమియనుదు నీకను.

క॥ ఇదియే సద్ద్విజులవిధి. యదిచెప్పితి. వారికన్న నపకృష్టులకున్
పదితీరుల పెండ్లిండ్లును బదివిధముల తనుభవులును బరగెడి వినుమా. ౬౮౫

ఆ॥ నాలు గుత్తమములు నారద ! యవ్వివాహములలోన. మిగిలినట్టి నాల్గు
హీనజాతివారి కేర్పాటుచేసిరి యాద్యులైన ప్రాజ్ఞు. లది వచింతు. ౬౮౬

సీ॥ తనయ ! ప్రాజాపత్యమును బ్రాహ్మమును దైవ మార్షంబు గాంధర్వ మాసురంబు
ప్రాతిభంబును మఱి పైశాచనామంబు ఘాతన రాక్షసాఖ్యములు పదియు
అగునువివాహంబు. లౌరస క్షేత్రజుల్ క్రీత కానీనులు కృత్రిముఁడును
గూఢజ దత్త సహోఢజుల్ పౌనర్భవా పవిద్ధులు పదుం డాత్మజాతు.
లౌరసునికన్న హీనులైనట్టివారు హీనులకె పుత్రులై శుభ మీయఁగలరు.
ప్రకృతులుంబోలె నీచులు పదునెనిమిదిమంది. తత్కారణీయధర్మములు వినుము.

సీ॥ విధియొండులేదుచూ వీరికిఁ బూజ్యులౌ క్షోణిదేవతల శుశ్రూషదప్ప.
క్రియ యనుక్తం బీనికృష్టుల కెడియును నంబుజనాభు ధ్యానంబుదప్ప.
స్మృతి యెది విధియింప దితరంబు వీరికిఁ జంద్రశేఖరుని యర్చనముదప్ప.
మంత్రింబులనువీరు మదినైనఁ దలఁచు టక్రమమగు దానధర్మములఁదప్ప.
శ్రద్ధనొనరించు దానధర్మముల కెపుడు నాశముండదు లోకంబునం గుమార !
శ్రద్ధలేకుండ నశుచిత నల్పనేని యగును వైరస్యకారణ మదియె తుదకు. ౬౮౭

తే॥ హీనకులులకును నహింస ధర్మంబు. మహాఫలప్రదంబు. నందులోన
హరిపరుండ దేవతార్చకుఁడగుచు నహింసనూనఁ బున్నె మెన్నఁదరమె. ౬౮౮

క॥ అవిరోధులును సుదర్శను లవు సచ్ఛూద్రు లటు ధర్మ మనయము సేవిం
త్రివనీసురశుశ్రూషను నవితథమగు దానమునను యమికులచంద్రా ! ౬౮౯

తే॥ వృత్తి సద్ద్విజనులకు వృథగ నన్నృతములను బలుకక వాణిజ్యముం బొనర్చు
టింక వడ్డిని నూటింటి కెనుబదియవ పాలు గైకొను టెంతయుం బాడియగును.

ఆ॥ క్షత్రియాదులందు సహపాదవృద్ధి గ్రహింపఁబడెడి సంయమీంద్ర ! పుడమి.
ఇటులొనర్పఁ గలుగ దించుకయును బాపబంధ మొకపుడేని ప్రజల కరయ.

తే॥ కల్యమున దేవతాపూజ క్రమముగాను ధరణిసురసేవనంబు మధ్యాహ్నమందు
స్వకృతులన్నియు నపరాహ్ణసమయమందు సల్పునటువంటిమనుజుండు సౌఖ్యమొందు

సీ॥ గోప్త్రులై యనుచు సత్క్రియ లాచరించుచు నాతిథ్యమిచ్చుచు హరిఁ దలఁచుచు
పంచయజ్ఞంబులు భక్తిఁ గావించుచు దీనులం బోషించుచు దానమిడుచు
సాధులం గొల్చుచు సదపత్యముం గంచు క్షమవహించుచు సదాచారులగుచు
ద్వాదశాక్షరజప మొనరించుచుఁ ద్యక్తసంతాపమాత్సర్యులౌచు
శక్తికొలఁది భూతసంతృప్తి సేయుచుఁ ద్రయి పఠింపకుండ ధర్మపరత
వర్తిలంగవలయు వసుధ సచ్ఛూద్రులు స్వర్గలోకసుఖము వడయుపొంటె. ౧౯౪
ఆ॥ అనయ మెవరు హరికి హరునకు భక్తులై యుంద్రొ వారు స్వర్గమందుఁ బోయి
యుండఁగలరు దేవతోత్తములుంబోలె. హరిపరుండ నంత కతిశయంబు" ౧౯౫

## అష్టాదశప్రకృతులు

వ॥ అని వక్కాణించుటయుఁ గలహాశనుండు వెండియునిట్లనియె. ౧౯౬
క॥ "పదునెనిమిదిప్రకృతులటం చుదిత. మ్మవి యెవ్వి? వాని కుండిన ధర్మం
బెది? మఱియు వృత్తియెయ్యది విదితంబొనరింపుమయ్య విశ్వస్రష్టా!" ౧౯౭
వ॥ అనియిట్లు ప్రశ్నించుటయుఁ జతురాననుండు ౧౯౮
క॥ "తనకాలపుఁ బరిమితి మేల్కాను శ్రీహరి బొడ్డుదమ్మిలోపల నే మున్
జనియింపఁ బెద్దకాలంబున కాఁతఁడు సృష్టి సేయఁ బూని స్మరించెన్. ౧౯౯
మ॥ చతురాస్యంబులతోడఁ బంకజమునన్ జన్మించి తర్వాత నో
ముని! తత్కుక్షిఁ బ్రవిష్టుఁడై యిటునటుం జూడంగ బ్రహ్మాండముల్
శతము ల్కానఁగనయ్యె. నబ్రపడి మెల్లన్ వెండి నేనంత వ
చ్చితిఁబో యీవల. కంతయున్ మఱచితిన్ సృష్ట్యర్థమౌ హేతువున్. ౨౦౦
ఉ॥ క్రమ్మఱ నాభినాళమున గర్భముఁజొచ్చి ప్రజన్ సృజించి యా
పిమ్మట వచ్చి యీవలకు విస్మృతిఁజెంది జడుండునా మనన్
ఖమ్మునుండి విస్ఫుటముగం "దపముండు" మటంచు నొక్క శ
బ్దమ్ముగుడుం దపించితిని దద్ద నటం బదివేలయబ్దముల్. ౨౦౧
చ॥ మఱియు శ్రుతి స్వరూపమగు మంచివచస్సు తపోబలంబునన్
సురసరణిన్ వినంబడియెఁ జోద్యముగన్. భగవానుఁడైన శ్రీ
హరియును "రాజసంబయినయట్టి గుణంబును బూని చేయుమీ
సరవి నకల్మషంబయిన సర్గ" మటం చిటు లాజ్ఞయిచ్చెఁ దాన్. ౨౦౨
ఉ॥ మానససృష్టి పూర్వమున మత్కృత. మంత మరీచిముఖ్యులౌ
మానివరు ల్విసృష్టులయి మామకసృష్టికి బాసలైరి. త

త్రాణముల వేదరక్షకయిచూ సృజియించితి బ్రాహ్మణుల్గ. నీ
వా నయకోవిదాగ్రణులయందుఁ గనిష్ఠుఁడవోయి నారదా! ౨౦౩

సీ॥ ఉపనిషత్సారంబు నొయ్యన గ్రహియించి జ్ఞానసంపూర్ణతం బూనినావు.
అన్ని వ్యాపారంబు లవలీల వర్జించి విష్ణుభక్తుండవై వెలసినావు.
అజ్ఞసంగ్రహమునకై కర్మములఁ జేయు చొంటి బ్రహ్మము చూచుచుండినావు.
అంతరంగమున నహంకారమమకారములకుఁ జోటీయక నిలిచినావు.
అస్మదాత్మభవుల యందతిలోపలం జివరవాఁడవగుచుఁ జెలఁగినావు.
ఇటు ద్విజాతులైన యీరల నెల్లర మనసుచే సృజించి మఱియు నేను ౨౦౪

సీ॥ ముఖకంజముననుండి మొనసి బ్రాహ్మణజాతి నిర్మించితిని మున్ను నేర్పుతోడ.
బాహుయుగ్మంబున బలవంతులైనట్టి రాజన్యు లుదయించి రోజ నంత.
ఊరుద్వయంబునం దుత్పన్నమగ్యోఁబో యల వైశ్యజాతి ధనాఢ్యమగుచు.
పదములనుండి యేర్పడియెఁ దద్వర్ణత్రయేతరమగు శూద్రజాతియెల్ల.
ఆ॥ యొప్పఁబ్రకృతులు మచ్ఛరీరాంశములను. బ్రాహ్మణులు క్షత్రియులును విద్వరులుమువురె
అల ద్విజాతులు. వారల కర్హమైన ధర్మముల వచియించెదఁ. దనయ వినుము.

సీ॥ చదివి వేదంబులు చదివించుటయు మఱి చేయించి జన్నము ల్సేయుటయును
ఇచ్చి దానం బొరం డీఁ బట్టుటయు హరిం గొలుచు చుగ్రతపంబు సలుపుటయును
నిర్జితక్రోధుఁడై నిర్మలత్వంబునఁ బను లలోభంబునఁ బొనరుచుటయు
అనృతంబులాడక యార్యుఁడై బ్రహ్మంబు ధ్యానించు చోరిమిం బూనుటయును
ఈగుణముల సతము నెవ్వఁడు భూషితుండగునో, వాఁడు విప్రుఁడనఁగఁబడెడి.
అతనికిం బ్రతిగ్రహము వృత్తియైనను దఱచుగా గ్రహింపఁ దపము చెడును. ౨౦౫

సీ॥ ఆమ్నాయపాఠంబు నాచరించుటయును సప్తతంతువులను సల్పుటయును
దానంబులను విప్రుఁ దనుపుటయును మఱి యుగ్రంబుగం దపం బుండుటయును
బ్రాహ్మణవరులపై భక్తిఁజూపుటయును విచ్చుకత్తులనె జీవించుటయును
స్త్రీబాలగోద్విజక్షితి పీడితులకెల్ల రక్షకుండయి బిట్టు రాజిలుటయు
క్షత్రియులకు ధర్మసరణి. యార్తత్రాణపరులుగాఁగ నుండ నరపి వార
లకు విధించినాఁడ. నిఁక వైశ్యధర్మంబు విను వచింతునీకు వివరముగను. ౨౦౬

సీ॥ అర్థార్జనంబునం దాఱితీరుటయును బశువులం బోషించి ప్రబలుటయును
కృషియొనరింపించి కృతకృత్యుఁడగుటయు విక్రయవ్యాపారవిదుఁడగుటయు
సురభూసురార్చనపరత వర్తిలుటయు సవనంబులం బెక్కు సల్పుటయును
బాత్రతావిఖ్యాతి తా గడించుటయును సరిగఁ జతుష్క్రతు ల్సదువుటయును
వైశ్యధర్మంబులివి. కాఁపువార లింకఁ దగ నమంత్రకముగఁజేయ నగును సవార
హమును వద్వైతశ్రాద్ధ మగ్ని విప్రక్రతు భుగర్చనములు నమస్కారమునను.

తే॥ శూద్రుఁడును బ్రొద్దుపొడుపున శుద్ధుఁడగుచు హరిపదంబుల కెఱఁగి భక్త్యతిశయమున
వీకఁ దద్గుణవర్ణనశ్లోకములను జదువ హరిరూప మెలయు నారద! యతనికి.
తే॥ వార్షికవ్రతకృత్తనవరతము తిథివార దైవతుఁ డఖిలజీవముల కన్న
దాతయు గృహస్థుఁడగువాఁడు జాతిచేత శూద్రుఁడని చెప్పఁబడియెడిసుత! క్షితిపయి.
క॥ చాతుర్మాస్యవ్రతకృత్తై తనరెడు శూద్రజనుఁడు హరితనెనయు. సం
ప్రీతి నమంత్రకముగనే నాతఁడు కర్మములఁజేయ నర్హము లడంగుడు" ౨౧౧
సీ॥ శిల్పి ప్రజాపతి చిత్రకుండును నర్తకుండు వర్ధకి సూత్రకుండు రజకుఁ
డౌనామికుండును సూనిక క్ష్మాకుల్ కాష్ఠకరుఁడు చర్మకారకుఁడును
గచ్ఛకుండును దంతుకార చక్రికులును ధ్వంసిక మత్స్యఘాతకులు మఱియు
చండాలుఁడునునాఁగ సరిగ నష్టాదశప్రకృతులు వీరలు. స్వర్ణకార
కాంస్యకార శిల్పి కాడ్డుక దారుక కుంభకారు లారుగురును నుత్త
ములు. తురంగవాహి బలి ఖరవాహియు నుష్ట్రవాహకుఁడును నిష్టకలను ౨౧౨
సీ॥ కుదురుచువాఁడును గోపాలుఁడును నధమాధమపంచకం బనఁగఁబడెడు.
రజకుండు చర్మకారకుఁడును భిల్లుండు కైవర్త నటుమేదక బురుడులును
నేడ్గురు నంత్యజు. లెవనికి నెవఁడు వర్ణమున హీనుఁడో వాఁడు క్రమముగాను
అష్టాదశముఁడగు. నఖిలప్రకృతుల నుత్తమమధ్యమాధమతం దిభేద.
మందు మణికార తాంబూలి తందులులును స్వర్ణకారక పుష్పలావకులు కంబు
కుఁడును నాపితుఁడనఁగ నేడ్గురును సిల్పు. లుత్తములు వారిలోపల నోతనూజ!
సీ॥ స్నానంబునకు నొకసమయమంచని లేదు. హోమంబు విధియింప దొక్క స్మృతియు
తపమొనరింపంగఁ దగు నర్హతయు లేదు. నియమంబుపట్టుట నింద్యమగును.
స్వాధ్యాయపఠనంబు సల్పఁగా రాదు. వషట్కారములు పల్కఁజనదు నోట.
మడిమైలయనియెడి మాటతోఁబనిలేదు. పెండ్లి పేరంటము ప్రీతికొఱకె.
ప్రకృతులకుఁ బుత్ర! గుఱుప్రాజ యొకటియుక్త. మన్నివర్ణంబులకు నన్నియాశ్రమముల
కన్ని ప్రకృతులకును విష్ణునందు భక్తి కలిగియుండుట కడు శుభకర్మ మరయ.
ఆ॥ ప్రకృతు లెవ్విధమున భాసిలుచున్నవో శూద్రుఁ డెవ్విధమున శుద్ధుఁడగునొ
అట్టిపుణ్యగాథ యంతయుఁ జెప్పితి. వినుము సావధానమనముతోడ. ౨౧౪
క॥ పరమపవిత్రంబగు నీపురాణమును శుద్ధమైనబుద్ధి జదివినన్
గురుముఖమున వినినను బాగ్దురితంబు లడంగుఁ. బొందుదురు హరిపదమున్.

—♦ పైజవనోపాఖ్యానము. ♦—

తే॥ శూద్రుఁడగు పైజవననామ సుజనవరుఁడు ధర్మమార్గమునకు విరోధంబు లేక
ఉండె గార్హస్థ్యమున శుద్ధినొందియుండె. పాలకింపుము వచియింతు నది మునీంద్ర!

సీ॥ తనధర్మమునఁ దాను దత్పరుండయియుండి యార్జించె నగ్గలంబైనయశము.
న్యాయమార్గమున భూర్యర్థంబు గడియించి యర్చించె. విప్రుల నబ్జనాభు.
క్షమవోలె నెంతయు శాంతిని వహియించి హితుఁడయ్యె జనముల కెల్లరకును.
కరము వివేకంబు గలిగినవాఁడయి వాదించె నేపట్ల వాస్తవంబు.
ఓతనూజ! తొల్లి త్రేతాయుగంబునం బైజవనుఁడనంగఁ బడెడిశూద్రుఁ.
డతఁడు కాశినుండి సతినొర్తుఁ గొని తెచ్చి వైజయంతిపురి వివాహమయ్యె.
సీ॥ సమరూపధనశీలజననంబువందున జనియించినది యా బిసరుహనయన.
చక్కఁదనంబున శచికిని రతికిని దులఁదూఁగునది యా మృదుపవిత్రిక.
అనసూయ మొదలైన యన్నుమిన్నలవంటి పతివ్రత యా శతపత్రవదన.
దేవతలను మహీదేవతలను సదా యర్చించునది యా మదాళిచికుర.
వైష్ణవవ్రతాది వరధర్మములఁ జేయ శక్తిగలది యా భుజంగవేణి.
అట్టి శోభనాఁగి యామ్నాయవిధిఁ బైజవనునిచేత లలి వివాహితయయి
చ॥ పెనిమిటితోడఁగూడి కడుఁ బ్రీతి రమించె వినీతయై. యతం
డును సుచితంపుఁ గాలముల నూతనయౌవనయైన యా పెతో
ననుఁగుఁదనూజ! మత్తకరి హస్తినితోడను బోలెఁ దా రమిం
చెను. మతి భూరిపుణ్యమున శ్రీసము పేతుఁడుగూడ నై మనెన్. ౭౨౮
ఆ॥ స్వపరదేశములను జక్కఁగం జేయించె స్వీయజనులచేత బేర మంత.
అట్టు లర్థవృద్ధి యగుటయుఁ గోటికిం బడగెయెత్తె నతఁడు. కొడుక! వింటె.
చ॥ తనయులు మువ్వు రాతనికిఁ. దండ్రికి భక్తులు. స్వీయధర్మమున్
బొనరుచుకొంచు విత్తమదము న్వహియింపక యుండువారలున్.
జనకుఁడు వారికిం దగిన చానలఁ దెచ్చి వివాహ మాచరిం
చినఁ దమ యుత్తమామలకు సేవలొనర్చిరి వార లెంతయున్. ౭౨౨
చ॥ ధనమును ధాన్యమున్ సుతులు తత్సుతులుం గడుఁగల్గి యిట్టులా
తనియిలు బుద్ధిమంతమయి తద్దయు నొప్పెడు దేవతాతిథుల్
దినదిన మర్చ్యమానులయి తృప్తిని జెందిరి. తద్గృహంబునన్
జని విముఖంబుగాదు ప్రజ నారద! యేమివచింతు నీకికన్. ౭౨౩
సీ॥ శీతకాలంబునం జేతి కబ్బినయంత ధనమిచ్చి బీదలఁ దనిపినాఁడు.
ఉష్ణదినంబులం దుదకంబు పోయించి యధ్వనీనులదాహ మార్పినాఁడు.
వర్షర్తువున మంచివస్త్రంబులిచ్చి దరిద్రులఁ గర మాదరించినాఁడు.
అపుడిప్పుడన కప్పు డన్నంబు వెట్టించి క్షుధితులయెడ దయం జూపినాఁడు.
గుళ్ళు కట్టించి త్రవ్వించి కూపములఁ జెఱువుల వేయించినాఁడు పైజవనుఁ డర్థ
వంతుఁడయ్యును సర్వదా వ్యసనములను బడక శివకేశవులపయి భక్తిగలిగె.
సీ॥ అకలంకమైన బ్రహ్మజ్ఞానసంపత్తిఁ "బరశివోహ" మటంచుఁ బలుకువాఁడు.
తిట్టికొట్టినయట్టి చెట్టలతోఁగూడ సఖ్యంబుమైనుండు శాంతమూర్తి

నిరతంబునుం దపోనిష్ఠాగరిష్ఠుఁడై యూర్ధ్వరేతస్కత నొప్పదిట్టి
అఖిలేంద్రియంబుల నధీనంబు గావించుకొని యున్న యటువంటి కోవిదుండు
గాలవుఁడు సశిష్యగణుఁడయి యావైజవనుని నిలయమునకు వచ్చుటయును
ఎదురుచని యెఱంగి మృదుమధురోక్తులం బలుకు చాసనంబుఁ బఱచి యంత

ఆ॥ "ఇపుడు సఫలమయ్యె నెంతయు నాజన్మ. మొదవె జీవితమున కుత్తమత్వ.
మిపుడు సఫలమయ్యె నెంతయు నాధర్మ. ముద్ధరించితీ వహో మహాత్మ! ౨౨౮

తే॥ నాదు పాపసహస్రముల్ నీదుదృష్టి పాఱి కాలిచివైచెఁ దాపసవరేణ్య!
బహుకుటుంబికుఁడైన నాభవనమెల్లఁ జేరి నీచేఁ బవిత్రంబు సేయఁబడియె." ౨౨౯

క॥ అనిభక్తిం గనఁబఱచుచుఁ బొనరిచి యుపచారములను ముకుళితకరుఁడై
మను నా సచ్ఛూద్రునితో మునిశార్దూలంబు స్నేహమున నిట్లనియెన్. ౨౩౦

సీ॥ "కుశలమే సౌమ్య! నీకు? మది ధర్మంబున వర్తించుచున్నదే వదలకుండ?
అర్థానుబంధులై యలరుచున్నారె దారపుత్రాదులందఱును సతము?
బ్రాహ్మణులందును దానంబునందును భక్తిగల్గివసింతె ప్రత్యహంబు?
హరిపాదతీర్థంబు శిరమునందునఁ జల్లుకొనుచుంటివా లేద దినదినమును?
విష్ణుపాదజలము వియదాపగాజలం బగును జూవె ద్వాదశాబ్దఫలద.
మద్ది ద్విగుణఫలద మగును జాతుర్మాస్య మస్తకమునఁ దాల్చు మనుజతతికి.

సీ॥ అవ్యాజభక్తిమై నాదినారాయణమూర్తికిం బొనరించు పూజనమును
బదుగురువినునట్లు బహిరంగముగఁ జేయు కేశవ సత్కథాకీర్తనమును
నానావతారము ల్పూని చరించు విష్వక్సేను మహిమంపు సంస్తవమును
అష్టాంగయుతముగా నాచరింపఁగఁబడు మాధవచరణ నమస్కృతియును
సచ్చరిత్ర! మోక్షమిచ్చుఁ జాతుర్మాస్య"నని వచించుటయును మునిని గూడి
ఇష్టగోష్ఠులఁ బరితుష్టుఁడై కొంత సేపటికిఁ బైజవనుఁడు ప్రణతుఁడగుచు

క॥ "భవదీయకృపాదృష్టిని నవితథమయ్యెను మునీ! మదాశ్రమఫల. మ
ట్లవుఁగాక. యనామయమగు భవదుక్త్యమృతమును గ్రోలి వాంఛించె శ్రుతుల్.

క॥ మిముబోటుల యాగమనము క్రమముగ సర్వార్థములను గల్పించెడి. నో
యమివర! చాతుర్మాస్యము సమీపగత. మేమికతము చనుదే నిటకున్? ౨౩౨

తే॥ తీర్థయాత్రాప్రసంగ మెద్దియయినను గలదొకో"యని వచియించుడు ముదితుఁడగుచు
ధార్మికుండును సత్యవాదరతుఁడైన వైజవననామ తచ్ఛూద్రుఁ బ్రక్కఁ దిరిగి ౨౩౩

క॥ "ఎన్నియొ నెలలే చన్నవి యన్నా! నాతీర్థయాత్రయందున. నత్యా
సన్నము చాతుర్మాస్యము. తిన్నగ మన్నిలయమునకె తిరిగెద నింకన్. ౨౩౪

క॥ తొలియేకాదశినాఁడట సలుపుదు నియమంబు నేను సచ్ఛూద్రవరా!
అల నారాయణుఁ బ్రీతుం జలుపుదు. సుకృతంబు నట్లు సంపాదింతున్" ౨౩౫

—♦ సాలగ్రామ మాహాత్మ్యము. ♦—

క॥ అని గాలవముని యనుటయు విని పైజవనుండు వినయవినమితగాత్రుండై
యను. "భూమిసురశ్రేష్ఠా! యనుగ్రహించి చెప్పుమయ్య యడిగినదానిన్. ౨౩౬
క॥ శ్రుతులును స్మృతులుం బురాణము లితిహాసము లేనియుఁ బఠియించుటకై యో
గ్యత లేదు నా. కనర్హుఁడ శ్రుతిసారజపంబునకును క్షోణీసుపర్వా! ౨౩౭
ఆ॥ కాన నాకుఁదగినకర్మంబె యొకటి మహాఫలంబుగలది యానతిమ్ము.
అదియె హరిపరుండినపు డాచరించిన ముక్తినొసఁగవలయు మునివరేణ్య!" ౨౩౮
క॥ అనవుడు గాలవముని యిట్లనుఁ. "చక్రాంకితపుటుఁడగు హరి సాలగ్రా
మునివహ్ను నెవరు నిత్యంబును గొల్తురో ముక్తి వారిముందట నుండున్. ౨౩౯
శా॥ సాలగ్రామముమీఁదనిల్పి మనమున్ సత్కర్మ మెక్కింతయే
నాలోచించునుగాక యక్షయఫలంబౌ నద్ది యెల్లప్పుడున్.
క్రీలోలుండు పరుండియున్న యపు డాకేతిం గృతంబైనచో
మేలౌ నంతకుమిక్కుటం బగుటఁ బేర్మిన్ దానిఁ బూజింపుమా. ౨౪౦
క॥ సాలగ్రామశిలయు గోమతి మేలగు ద్వారావతీశిల మిక్కిలి భక్తిన్
మేళన మొనరిచి యొకచోఁ బూలం బూజించుజనుఁడు పొందును ముక్తిన్. ౨౪౧
కం॥ సాలగ్రామశిలం బదివేలకొల త్సేసినట్టి వెంగలియేనిన్
హాళి నెటునుంచి కొలుచునో చాలఁ బవిత్రమగుఁ జుట్టుస్థల మేన్ గ్రోసుల్. ౨౪౨
ఆ॥ బ్రహ్మరూపమది. శుభమును. దేజఃపిండ. మదఁగు దానిఁజూడ నఘము లపుడె.
తీర్థములును నదులు దేవళోత్తత్సార్వ్వమునఁ జెలంగఁ దీర్థతను భజించు. ౨౪౩
ఆ॥ తత్సమీపమునఁ గృతములైన సత్క్రియల్ సత్క్రియాత్వ మొందఁజాలు ననఘ
అంతకును విశేష మదియె చాతుర్మాస్య సంఘటించునెడల. సత్యమిద్ది. ౨౪౪
క॥ సాలగ్రామశిల యెవనియాలయమం దుంచఁబడినదయి తులసీప
త్రిశిం బూజింపఁగఁబడుఁ గాలుం డవ్వానిగృహముకడ కరుగఁ డిఁకన్. ౨౪౫
ఆ॥ విప్రబాహుజులకు విశులకుసచ్ఛూద్రులకును బైజవన! కల దధికార.
మెట్టిసమయమందు నేని సాలగ్రామపూజనమున లేదుసో యొరులకు" ౨౪౬
క॥ అని యిటు వాక్రుచ్చుటయును విని పైజవనుండు "వేదవిద! స్త్రీశూద్రుల్
ఘనసాలగ్రామశిలార్చన మొనరుపఁదగరటంచు శ్రీవణింతుఁగదే. ౨౪౭
క॥ ననుబోటి శూద్రజనముల కనఘా! యది యెవ్విధమున నయ్యెడిఁ బూజ్యం?"
బని ప్రశ్న సేయుటయు నోతనయా! గాలవమహర్షి తగ నిట్లనియెన్. ౨౪౮

## లక్ష్మీనారాయణ మహిమము

ఆ॥ ఈప్రకారముగను హిమవత్కుమారిక యిడిన శాపమునను నెల్లసురలు
సంతువడయలేక సంతతం బెంతయు వంత ననుభవింపవలసె నౌర! ౧౦౧౭

కం॥ సాలగ్రామము గండకి నాలీల మహేశలింగ మగు నర్మద. సు
శ్రీలలితములై స్వయముగఁ గ్రాలు నకృత్రిమములగుచు క్షమనవి రెండుఁ౯.

కం॥ ఇరువదినాలుగువిధముల వరసాలగ్రామశిలల వర్తిల్లెడి శ్రీ
ధరుని బరీక్షింపఁగనగు. హరలింగం బేకరూపమయియే యుండుఁ౯. ౧౦౧౯

కం॥ సాలగ్రామజనుస్థలమై లలివహియించునట్టి యాగండకి కీ
లాలము గ్రోలియు నాడియు నోలిం బ్రజ బ్రహ్మపదము నొందు ధ్రువముగ౯.

తే॥ గండకీసంభవంబౌచుఁ గ్రాలునట్టి యాశిలను విధివత్తుగా నర్చితంబుఁ
జేసినట్టిఁడు యోగసంసిద్ధివడసి శుద్ధ మానసుఁడగును సద్ద్విజవర్య! ౧౦౨౧

కం॥ ఎది నీవడిగినవాఁడవో యది యుదితముని. కేఁక౯ మహాదేవున కే
విధమున బ్రాహ్మణశాపం బొదవెనో వచియింతు విను మహో పైజవనా!

కం॥ హరతాండవసంబంధము ధరజాదేవార్ధ వర్ణితంబును వాణీ
వర మతియుతమును నగు నీవరకథ విని బరమగతిని బడసెదరు జనుల్. ౧౦౨౩

కం॥ శ్లోకమొ శ్లోకార్ధంబో శ్లోకచతుర్థాంశమో విలుప్త విరోధం
బై కౌటిల్యము మానము లేక పఠింప సుగతి యవలీల లభించు౯. ౧౦౨౪

కం॥ చాతుర్మాస్యంబున నే యీతత్కథ విన్నఁ జదువ నిల ధనపుత్రా
న్వితంబై జన మెంతయుఁ జేతశ్చింతితపదార్థసిద్ధిని బడయు౯. ౧౦౨౫

తే॥ ఎట్లు బ్రహ్మాదిదేవత లెల్లఁ గూడి యర్ధనారీశ్వరేశ్వరు నంతికమున
గీతవాద్యాభియోగంపుఁ గృతి నవాప్తసిద్ధులై రట్లు పైప్రజ సిద్ధినొందు. ౧౦౨౬

ఆ॥ వానకాలములోన వాసుదేవమహేశ్వరాంబికల గురించి యధికమైన
భక్తియోగ మాత్మపరిశుద్ధిమైఁ జేయు నరుఁడు కాఁడికఁ౯ స్తనంధయుండు.

కం॥ గణపతిపూజ్యుఁడు. నారాయణుఁడు పరున్నప్పుడైన. నంతటఁబూజ్యుం
డణిమాదిసిద్ధులొదవెడు నణఁకువతోఁ జేయఁబడిన యాతనిపూజ౯. ౧౦౨౮

ఆ॥ భాస్కరుం డొసంగు బహుళతరారోగ్య మర్చ్యమానుఁడగుచు నధికభక్తి.
అధికఫలదుఁడగును నతఁడు చాతుర్మాస్యఁ బూజ్యమానుఁడగుచు భూజనులకు.

కం॥ ఏతత్పంచాయతనము ప్రీతిం బూజ్యంబు గృహికిఁ బేర్మిమెయిం ద
చ్చాతుర్మాస్యం బూజ్యము చేతశ్చింతితము దాన సిద్ధించు వెస౯. ౧౦౩౦

సీ॥ అర్చితంబై యెది యఘములం బోకార్చి యర్చితంబుగఁజేయు నఖిలజగము
వినుతింపఁబడి యెది విలయితకలుషమై వినుతంబులం జల్పు విష్టపముల
చదువంగఁబడుచు యత్సంబంధిపద్యము ల్పంకంబు నవలకుం బాఱఁదోలు
ధ్యానింపఁబడి యెది మానసంబునఁబుట్టు వృజినంబులన్నింటి వెడలనడఁచు
అహరహమ్ముగూడ నట్టి సాలగ్రామఁ బరఁగు హరిని ద్వారవతిని గలిపి
కొలువ ముగితిగలుగు. నఘచాతుర్మాస్య దర్శనంబె మోక్షదాయకంబు.

కం॥ సాలగ్రామగహరికిం జాల నివేదింపఁబడిన శాల్యన్నంబుల్
మేలగు నభిషేకోదక మాలలి సేవింప చెంక నఘగఁగవలెనే. ౧౦౩౨

ఆ॥ అగ్గలంపుభక్తి నల్ల సాలగ్రామశిలకు నర్పణంబు సేయఁబడిన
తిలలు బహుపవిత్రము సలుపుఁ-జాతుర్మాస్య నంతకును విశేష మమరజాగ్రి!

తే॥ వాఁడు లక్ష్మీసమేతుండు వసుధనెపుడు-వాఁడు ధనధాన్యసహితుండు-వాఁడు భాగ్య
వద్గృహంబుల జనియించు-వాని శ్రీసనాథవిష్ణునిగా నెఱుంగవలెఁజుమ్ము. ౧౦౩౪

కం॥ సాలగ్రామస్థిత వనమాలిం బూజించువాని మందిరమందుల్
శ్రీలక్ష్మి సుస్థిరంబుగ వాలిని వసియించు కూదరిజా! యేమందుల్. ౧౦౩౫

తే॥ ఎంతవఱ కచ్యుతుఁడు పూజింపఁబడఁడో యంతవఱకె దరిద్రత యవనిఁ బ్రజకు.
అంతదాఁకనె గర్జించు నఘచయంబు-నంతదాఁకనె క్లేశంబు లంగమందు. ౧౦౩౬

కం॥ ఆ గరుడధ్వజుఁ డెచ్చట బాగుగఁ బూజింపఁబడునో పంచక్రోశం
బౌఁ గడుఁ బావన-మచ్చటి కేగఁగలే వశుభము లిఁక నేమనవలయుల్. ౧౦౩౭

ఆ॥ అదె మహాతపంబు-నదియె మహాభాగ్య మదియె మోక్ష మెచట నాద్యుఁడగుచు
లలివహించునట్టి లక్ష్మీశుపూజనం బాచరింపఁబడునో యాలఘుభక్తి. ౧౦౩౮

సీ॥ ఏయింటిలోపల నెంతయు రాణమై వర్తించు దక్షిణావర్తశంఖ
మేమందిరంబున నెపుడును సుస్థిరంబగు లక్ష్మీనారాయణాత్మకంబు
ఏయగారంబునఁ గృష్ణసారంబగు తులసీమహీజంబు లలివహించు
ఏభవనంబున శోభాయమానమై ద్వారవతీశిల గూరియుండు
అచట శ్రీయును విజయంబు హరియు ముక్తి యుండుశ్రీలక్ష్మీనారాయణుండుతను య
జించువానికిఁ బుణ్యంబు నించు.వాఁడు క్షణంబున ముక్తుఁడౌఁ దప్పకుండ.

కం॥ చాతుర్మాస్యను లక్ష్మ్యన్వితముగ మఱింత యర్చనీయుఁడు హరి-యా
పీతాంబరధరు ధ్యానము పాతకహరమగుఁ గరంబు పైజవన! వెసల్. ౧౦౪౦

కం॥ తులసీమంజరులను హరి నలచాతుర్మాస్యమున సమర్పించెడివా
రలు మరలం బుట్టరు-శ్రీఫలదళములఁ బూజసేయఁ బాపము లడఁగున్. ౧౦౮౧
ఆ॥ జగదధీశుఁడగుచు జగమెల్ల వ్యాపించి యెవఁడు సృష్టిలయము లెపుడుఁ జేయు
యత్నపూర్వకముగ నవ్వాఁడె సేవ్యుండు. కుంద దింక వానిఁబొందు జనము.

— రామనామమంత్రమంత్రమహిమము. —

సీ॥ వీరబాహుండును వీరభద్రుండును వీరసేనుండును భృంగిరాజు
రుచి తుటి నందీశ్వరుఁడు పుష్పదంతుండు కంటక విఘట వికంటకులును
మాలాధరోత్కటుల్ మణి హార కేశులు పాశధరుండు విభద్రకుఁడును
నరనుండు శృంగియు నరక పుణ్యోత్కటుల్ కణప మహాభద్ర కాలవులును
కాల ధనప భద్రక ధనద రక్తలోచన విరోచనులు వృషవానువుఁడును
పారద వికటాఖ్య పంచశీర్ష ధ్వాంక్షి సింహవక్త్ర దీర్ఘజిహ్వాముఖులు ౧౦౮౩
కం॥ తుండియు హంసక్రియును బ్రచండుండు మహాద్భుతుండు శాలిగ్రహా
ఖ్యుండు త్రిశీర్షుఁడు మొదలగు దండిగణములు తిగకోట్లు తన సవిధమునన్
ఆ॥ భద్రకాళిఁగూడి "రుద్ర! జయజయ" యంచుచ్చరవము సేయుచుండ నొక్క
కాలమందు శివుఁడు కైలాసశిఖరమం దగజతోడఁ బరమమైన శ్రీని ౧౦౮౪
కం॥ భూతప్రేతపిశాచము లేతెంచి సమీపమునకు నెంతయు నుతి సం
ప్రీతుని జేయఁగ నుండుడుఁ దోతెంచె వసంతమటకు ద్రువులు రహింపన్ ౧౦౮౫
సీ॥ క్రొత్త మొగ్గలతోడ నత్తఱిఁ జెట్లు కరంబు ప్రకాశమానంబులయ్యె.
మందమందంబుగా మలయానిలము వీచెఁ. గవిచయంబునకయ్యెఁ గడుసుఖంబు
పుష్పించి కింశుకభూమీరుహములు వియోగిమానసముల నూపఁ దొడఁగె.
కామవికారసంక్రాంతంబులై బిట్టు ద్వంద్వముల్ క్రీడింపఁ దొరసిల్లె.
అట్టి గాఢసమయమందు మనంబు లున్మాదయుతములగుట మదిఁ దలంచి
దండధారియగుచు దండను వసియించు నందికిం బినాకి నయనసంజ్ఞ ౧౦౮౬
క॥ సలిపిన నవు డాతఁడు "చాపలదోషము చాలుఁ జాలుఁ, బనివిని యిఁకమీ
రలు తపముసలువుఁడీ గణము లనుటయుఁ దపంబువారు మొదలిడి రంతన్.
ఆ॥ అపుడు విశ్వజననియైన భవాని "యీయక్షమాల నీదుహస్తమందు
సతముఁ గానఁబడెడు శంకరా! యేమిజపింతో చెపుమ, కలిగె సంశయంబు.
సీ॥ నీవొకండవె కాదె నిఖిలభూతములకు నాదిమూఁడవు సకలాధిపతివి.
జననియు జనకుఁడుం గనబడఁ డెట నీకుఁ. బుట్టుంబు లేనియుఁ జూడఁబడరు.

జాతి యిత్యాదియంచు సరిగ నేర నెఱుంగ. రేనును నెఱుంగ నీ కితరముం గ్రు
టురుకష్టమున విడ్చు చుచ్ఛ్వాసనిశ్వాసములు జపించెదు నిత్య మలఘు భక్తి.
లేదు నీకంటె నన్యంబు లేశమేని. యేది మది నీవు ధ్యానింతో యేమొ నీకు
నేను బ్రాణప్రియనె యైనయెడల నాకు నుడువు మదిదేవ! యని గౌరి యెడలు ఫుడికి.
ఆ॥ అడుగ శంభుఁ డిట్టులను. " హరినామసహస్రసాక మెపుడు ధ్యాయమాన.
మవ్విధమున సప్తమావతారంబగు రామ నామ మెపుడు రహిఁ జపింతు. ౧౦౫౧
ఆ॥ బ్రహ్మరూపమైన ద్వాదశాక్షరము సనాతనంబు నేను నగకుమారి!
అక్షమాలఁబూని యన్వహంబు జపింతుఁ బద్మనాభుకరుణఁ బడయుకొంటె.
క॥ ఇరువదినాలుగువిధముల ధరణిం బ్రాదుర్భవించి తన రారెడి శ్రీ
హరి సద్గుణములు నిరతముఁ గరమర్థిని మనన సేతుఁ గాంతామణిరో! ౧౦౫౩
తే॥ తద్గుణంబుల సారంబుఁ దతఫలంబుఁ ద్వ్యక్షరంబును గ్రామత్రియాన్వితము స
బిందువుమ నగు ప్రణవంబు డెందమందు సతము ధ్యానించుచుందు నోచపలనయన!
ఆ॥ వేదసారమిద్ది. విష్టపాధారంబు. నిత్యమును. జడంబు నిర్మలంబు.
ద్వ్యక్షరంబు. శాంత. మమృతంబు. సదూప. మమృతతుల్యమును. నియామకంబు.
ఆ॥ దీనిఁ దెలిసికొనినఁ దెగ్గు సంసారబంధనము క్షణములోన జనములకును.
జనమునుండి కల్మషసహస్రములు వాయు. నిదియె పరమగుహ్య మేణనయన!
ఆ॥ ఇదె మహామహస్సు ముదితరో! లోకమం దిదియె దుర్లభార్థ మెంచిచూడ.
ఇదె త్రిలోకములకు నెంతయు భూషణం. బిదియె జన్మకోటి నాదవ్రనదియు.
ఆ॥ ఇందుబింబముఖిరో! యీద్వాదశాక్షరచింతనంబె యతను శ్రేష్ఠమైన •
జ్ఞాన. మందుఁగూడ సరిగఁ జాతుర్మాస్యఁ జేయ బ్రహ్మదం . చింతితదము.
క॥ ఈయక్షరజస్తోత్రముఁ బాయక యెల్లప్డు మదిని వాక్కునఁ గ్రియ నే
ధీయుక్తుఁ డాశ్రయించునొ యాయన యిఁకఁ బుట్టఁబోవఁ డవనీస్థలిలోన్.
తే॥ ద్వాదశాక్షరమహిమంబుఁ దప్పకుండ వర్ణనము సేయుటకుఁ జతుర్వదనునకును
కాదుశక్యము. వేనోళ్ళ కాద్రివేయుపతికిసహిత మశక్య మిప్పు తెలంప. ౧౦౬౦
ఆ॥ జప్యమైనయట్టి సన్మంత్రమియ్యది. స్తుతము ధ్యాతమగుచు క్షోణి సర్వ
మాసములను నఘము మాపుఁ. జాతుర్మాస్యమున విశేష మింక ననఘచరిత!
ఆ॥ శ్రుతుల స్మృతిపురాణతతుల ననుసార మీద్వాదశాక్షరంబు తథ్యముగను.
చింతితార్థసిద్ధి చింతనమునన యగు. యామ్యపుణ్యదాన. మమృతదంబు.
ఆ॥ ప్రణవసహితమైన ద్వాదశాక్షరమును విప్రబాహుజాతవిశులు మువురు
జపము సేయ మోక్షసామ్రాజ్యమబ్బు. స్త్రీశూద్రులకును దగనుచూ ప్రణవము.

ఆ॥ ప్రకృతులందఱికిని ద్వాదశాక్షరమంత్రజపము పనికిరాదు సత్యముగను.
విప్రభక్తి దాన విష్ణుకీర్తన కాయశోషణములె వారి సుగతిఁజేర్చు. ౧౦౬౪

ఉ॥ వారికి రామనామమె యవశ్యము జప్యము కోట్యతీతమా.
ఆరయ రామరామయను ద్వ్యక్షరమంత్రము సర్వపాపసం
హారకమౌను. నిల్వఁబడి యర్థ్యగుఁడౌచు శయానుఁడయ్యు నీ
శ్రీరఘురామకీర్తనము చేసిన విష్ణుగణత్వ మొందెడిన్. ౧౦౬౫

తే॥ రామయనియెడి రెండక్షరములమంత్ర మగునుబో మంత్రకోటిశతాధికంబు
ప్రకృతులందఱికిని నది పాపనాశకముగఁ జెప్పంగఁబడియెడి హిమగిరిభవ!

క॥ చాతుర్మాస్యనె యగుచో నేతచ్ఛ్రీరామమంత్ర మెంతేయు ఫలదం.
బీతీరు మంత్రరాజము చాతుర్మాస్యము లభించు సద్భక్తులకున్ ౧౦౬౭

తే॥ రామనామముకంటె నీరసఁ బ్రశస్తమగుచుఁ బఠనీయమైనది యగుపడ దెట
రామనామాశ్రయులకు నోరాజముఖిరో! యామ్యయాతన యుండ దేమనివచింతు.

తే॥ విగ్రహంబులు వ్రతకముల్ విఘ్నకరములైన దోషంబు లన్నియు నగకుమారి!
రామనామంబుచేనె విరామ మొందు. నల్ప కీవిషయంబునం జర్చయింక. ౧౦౬౯

ఉ॥ స్థావరజంగమాత్మకము సర్వజగంబున నంతరాత్మయై
యేయెడయున్ రమించుట మృగేక్షణ! రాముఁడునాఁ బ్రకీర్తితుం.
డా వరరామమంత్ర మఖిలార్థసుసాధక. మెల్లజాడ్యముల్
పోవును దజ్జపంబునను. బూర్ణజయంబు రణోర్విఁ గల్గెడిన్. ౧౦౭౦

ఆ॥ అఖిలతీర్థఫలద మా రామమంత్రంబు. కామదంబు శరము క్ష్మామరులకు.
రామచంద్రయనుచు రామయటంచు నుదాహరింత్రు దానిఁ దద్జ్ఞజనులు. ౧౦౭౧

ఉ॥ ద్వ్యక్షరరామమంత్రజపతత్పరు కార్యము సిద్ధిఁబొందు వా
మాక్షి! గుణాకరంబయిన యమ్మనురాజము రాము సత్కటా
క్షేక్షణగోరి వేల్పులును నెంతయుభక్తి జపింతురుగాన నీ
వీక్షణమాది తజ్జపము నెల్లపుడుం బొనరించుచుండుమా. ౧౦౭౨

ఆ॥ రామనామజపము రహిమైనొనర్చువాఁ డఖిలకల్మషములఁ ద్యక్తుఁడగును.
రామనామమునకె నామసహస్రజంబైనయట్టి పుణ్య మబ్బఁగలదు. ౧౦౭౩

క॥ చాతుర్మాస్యనుబదిరె క్లైతత్పుణ్యంబు మిగులు. హీనకులుల దా
పాతకమంతయు దగ్ధంబైతీరును దజ్జపమున నదీంద్రసుతా! ౧౦౭౪

ఆ॥ అంతరాత్మయైన యారాముఁ డివ్విశ్వమెల్లనిండి తేజమినుమడింప.
క్షణములోనఁ బూర్వజన్మార్జిత స్థూలసూక్ష్మపాపములను నుక్కఁజేయు,

## —* ద్వాదశాక్షరమాహాత్మ్యము. *—

ఆ॥ అని వచింప "ద్వాదశాక్షరమాహాత్మ్యమును సవిస్తరముగ వినుచు మనసు !
ఉన్న వర్ణములును నొదవెడి ఫలమును నేను దానిఁజేయునైన విధము." ౧౦౬
క॥ అని గౌరి యడుగ శివుఁ డిట్లనుఁ "బ్రణవముతోడ ద్వాదశాక్షరమంత్రం
బును విప్రబాహుజోరుజు లనుదినము జపింపవలయు నంబుజముఖిరో ! ౧౦౭
తే॥ స్త్రీలు శూద్రులుఁ బ్రణవముఁ జోలిపోక యది జపింపంగవలయుఁజూ సదమలాంగి !
ప్రణవమునువీడి ప్రకృతులుఁ రామనామమో షడక్షరమో జప మొనరుచునది.
చ॥ క్రమమిది సర్వవర్ణులకుఁ గంజదళాక్షి ! జపంబునందునన్. 106
క్రమమునువీడిచేయ నరకప్రదుఁడౌ విభుఁ డల్కఁబూను" నా 294-592
నుమయను. "నేఁ దిరిమాత్రి మదినుంచి జపింతును శ్రీశుఁ. గాని వా VYA
క్యములకుఁగూడ గోచరముగాని తదాకృతి యెట్లయుంచునుజ్ఞ" ౧౦౮
సీ॥ అనియిట్లు లడుగుటయును "నమోభగవతే వాసుదేవాయ" యన్ భానురాక్ష
రంబులు జపియింపు మంబుజముఖి ! సదా. స్త్రీలకుఁ బ్రణవంబు చెల్ల" దనుచు
శివుఁడుత్తరంబిడె. శివ యంత "సప్రణవంబైనయప్పుడే ద్వాదశాక్ష
రంబగు. నాకుఁ దత్ప్రణవమం దధికారమే యుండదంటివి. యెట్టులింక
ప్రణవమందు నేను బడయుదు నధికార" మనుడుఁ జంద్రచూడుఁ డఖిలదేవ
తలకు నాది ప్రణవః మల త్రిమూర్తులు నందు సతులఁగూడి యుంద్రు సంతతము
క॥ అం దఖిలభూతములు నింపొందఁగ భాగానుసార ముండును. మఱి యా
చందంబునఁ దీర్థంబులు నంద వసించెడిని. బ్రహ్మమది. మోక్షంబున్ ౧౧౦
ఆ॥ ఎపుడునీవు దేవి ! యెలమిఁ జాతుర్మాస్య వారినిగూర్చి తపము నాచరింతో
అపుడు ప్రణవసహితజపమునుగావింప యోగ్యయగుదు. వేమియున్నదింక. ౧౧౧
క॥ తపమునఁ గోరికిదీరును. దపమునన మహాఫలంబు దా ఘటియించున్.
తపమున సర్వము నగుఁ. దత్తపమే సులభంబుగాదు ధాతకుఁ బ్రజకున్. ౧౧౨
క॥ కీరితి సౌభాగ్యంబును నోరిమి నిజ మాదియైన యురుగుణనికరం
బేరుపడుఁ దపమువలనను. జారుముఖీ ! తత్తపం బశక్యముచేయన్. ౧౧౩
క॥ ఎపుడు తపము వర్ధిల్లునో యపుడే హరిమీఁదిభక్తి యభివృద్ధంబౌ.
ఎపుడది లేక కృతంబగు నపుడు తపంబునకు హాని యారంభమగున్. ౧౧౪
ఆ॥ ఎంతవఱకు విష్ణు నెద సంస్మరించి జిహ్వాంచలము పవిత్ర మాచరింతొ
అంతవఱకుఁ దపము లబల ! గణ్ణిలెడి జనులదేహములను సంతతంబు. ౧౧౫

తే॥ ఎట్లుదీపము వెలిగింప నెంతగాఢమైనచీఁకటియును నాశమందఁగలదో
అట్లు శ్రీహరికథనుండి యఘచయంబు పంచబంగాళమైపోవుఁ బద్మనయన !
ఆ॥ కాన హరిపరుండఁబూని చాతుర్మాస్య శుద్ధహృదయవగుచు శోభనాంగి !
ప్రణవసహితముగను బఠియింపు మంత్రరాట్టైనయట్టి ద్వాదశాక్షరంబు. ౧౦౮౮
ఆ॥ ద్వాదశాక్షరాధిదైవతంబయిన యా మాధవుండె ప్రీతమానసుఁడయి
బ్రహ్మరూపమగుచుఁ బరఁగు నఖండితజ్ఞానమొసఁగఁగలఁడు మానవతిరో !"

—* పార్వతి తపస్సుచేయుట. *—

క॥ అనియిటు వాక్ప్రచ్ఛటయును విని చాతుర్మాస్యయందు వెడలి యుమ హిమా
వనిధరశిఖరంబునకును జనియెఁ దపంబును జరింప దాసవరేణ్యా ! ౧౦౯౦
సీ॥ అష్టవిధంబైన యా బ్రహ్మచర్యంబు కడునిష్ఠమైఁ జక్క నడపుకొనుచు
వసనత్రయంబు సువ్రతమంచు భావించి తనశరీరంబునం దాల్చికొనుచు
బాల్యమాదిగ నెప్డు బాసటైవర్తించు మంచియాళులనొద్ద నుంచుకొనుచు
క్షమ లోనుగాఁగల సకల సద్గుణములు వీడిపోకుండఁ గాపాడుకొనుచు
శంకరునిగుఱించి సలిపినతపమునం బోలె మేలిమొదలు తూలిపోవ
అల త్రికాలములను హరిశంకరుంగూర్చి సలిపెఁ దపము నియమములకొమార్తె.
సీ॥ ఏపె యోగీశ్వరధ్యేయయై వర్తిల్లు నేపె భువనవంద్యయై పరంగు
ఏపె యా జనయిత్రి యీ ప్రపంచమునకు నేపెయే ప్రకృతిస్వరూప తాను
ఏపె తటిత్కోటి కెన తనుకాంతియం దేపె గుణాతీత యేపె విరజ
యన్మయంబులు పృథివ్యప్తేజఆశుగానంతముల్ యద్వ్యాప్త మఖిలజగము
ప్రకృతికంటెఁగూడఁ బ్రాక్తనత యేపె స్పృహాదిరూపమునను నవనిఁద్రుప్తి
దాత్రి యేపె యాపె తపము చాతుర్మాస్యమునఁ బొనర్చి శుద్ధినెనసె నవుర !

—* మునులు శివుని శపించుట. *—

ఆ॥ అద్రిరాజతనుజ యా ప్రకారంబుగా నుగ్రతపము సేయుచుండుటయును
హరుఁడు మరునిచేత నవమానితుండయి దేశదేశములను దిరుగఁదొడఁగె. ౧౦౯౩
సీ॥ కూరుచుండునుబోయి చారుధరాజము ల్పాదఁగాఁబడ వానినీడలందు.
సుస్నాతుఁడగుఁబోయి శుద్ధజలంబులై తేజరిల్లెడి పేటితీర్థములను.
ఈఁదులాడునుబోయి యిద్దరి యద్దరిం దన్నిపాఱెడి యేళ్ళమిన్నలందు.
ఎగిరి దూఁకునుబోయి యెంతయేని యగాధజలములై విలసిలు కొలఁకులందు.
తాప మపనయింపఁ దత్ప్రకారంబుగా బలుశ్రమములు పడియు ఫలములేక
అలల లలిఁజెలంగు యమునానదిం బడెఁ గడకుఁ బోయి గరళగళుఁడు శూద్రి !

చ॥ పడి యవగాహితుండగుడుఁ బైజవనా ! యిఁక నేమిచెప్పుదున్
మృడునిశరీరమందుఁగల మేటిస్మరాగ్నిని దప్యమానమై
వడి మసిబుద్దివోలె రహిఁబాసి కదంగదు నల్లనై కనం
బడియెఁ దదాపగాజలము. పాదములంబడియాక యంతటన్. ౧౮౫

తే॥ "కరుణ సేయుము దేవేశ ! నిరతమేను నీకు వశురాల" నవపుడు నీలకంఠుఁ
"డీనుతీర్థంబునకువచ్చి యేపుమాంసుఁ డాడుఁ దదఘసహస్రము లీడిపోవు. ౧౮౬

క॥ హారతీర్థ మనఁగనియ్యది ధరణిని విఖ్యాతమగుచుఁ దతపుణ్యంబౌ
నరుగు" మటంచని యచటనె హరుఁ డంతర్ధానమొంది యటుతరువాతన్ ౧౮౭

సీ॥ వలరాజు కడువేడ్క వచ్చి వసించెనా నంగంబు కడు మనోహరముచేసి
తుమ్మెదకొక్కులం దులఁదూఁగు నెఱులచేఁ గుదిరించి సొగసుగాఁ గొండసిగను
పాలమీఁగడఁబోలు భసితంబుచేఁ ద్రిపుండ్రములు లలాటమం దమరదిద్ది
డమడమయనిమ్రోయు డమరుకంబును గేల్ను నెంతయు వింత వాయించుకొనుచు
మునులపల్లియలకుఁ జని యాడువాండ్రలో నాడి పాడి నవ్వి యాత్మచాప
లంబుఁ జూపుచుం దదంబుజముఖులను మోహసాగరమున ముంచివైచె. ౧౮౮

తే॥ పతుల శుశ్రూషయును నింటిపనులు మాని యతఁడె పతియను భావన నగ్గలంబు
సరససల్లాపములు ప్రీతి సల్పుకొనుచు వెంటఁబడి రమ్మునీంద్రుల వెలఁదులకట !

క॥ మును లా దుశ్శీలంబును గనుగొని కినుకనువహించి కరములఁ గఱ్ఱల్
గొని "యీ యనయుం డెవ్వఁడొ చననీయక పట్టుకొనుఁడు చంపుఁ" డటంచున్.

క॥ వెనుదగులుటయుఁ బలాయన మొనరించెను విశ్వమంతయును జీవాంశం
బున నిండియుండు శంభుఁడు మునులకు ఖీతిల్లి యపుడు మ్రుచ్చువిధమునన్.

క॥ జ్ఞేయుఁడు గ్రాహ్యుఁడు ఛేద్యుం డాయన గాకుంటయును నాగ్రహమున శా
పాయుధులందఱుఁ దోయిఁటఁ దోయములు గ్రహించి దృష్టిదోషవిధిని బోన్.

క॥ "యల్లింగముకొఱకై మునిపల్లియలం జొచ్చి మ్రుచ్చుపగిదిని దుష్టం
డిల్లాండ్రను హరియించెనొ తల్లింగము ద్రెళ్ళి యిపుడ ధరఁ బడుఁగాతన్" ౧౯౩

మ॥ అని వాక్రుచ్చుడు వజ్రరూపధరమా నా శాపవున్నిప్ప చ
ప్పున నాధూర్జటి లింగము న్నఱకి యిబ్భూమిం బడన్ వైచె. నే
మనుదుం. దద్భగవానుఁ డంత రుధిరవ్యాప్తాంగుఁడై చిట్టు వే
దనకుం దాళఁగలేక మూర్ఛమునిఁగెం దా నేలపైఁ గూలుచున్. ౧౯౪

ఆ॥ అట్లు మూర్ఛవోయి యవనిపైఁ బడుటయు మునులు తత్సమీపమునకుఁ జనిరి.
అఖిలభూతములును నమరులున్ ఖీతిల్లి. రకట ! సంచలించె సకలజగము. ౧౯౫

చ॥ శివుఁడతఁ డంచెఱింగి ఋషిసింహులు మానసమందుఁ గుందుచున్
వివశత "దైవ మెవ్వ డనహానీయమ. యెంతటిఘోరకార్యమున్
దవిలియొనర్చినాము సుమనఃపరిపూజ్యుఁడు సర్వసాక్షియౌ
భవు భగవాను మూఢులము పాపులమై గురితింపలే కహా! ౧౧౦౮
సీ॥ ఎవ్వనిదేహమం దీయెల్లలోకము ల్వర్తిల్లు నా జగత్స్వామి హరుఁడు
నిర్వికారుండును నిర్వికల్పుండును నిరుపద్రవుండును నిర్మముండు
నిస్పృహుండును మఱి నిరహంకృతియు నైన శంభుండు కరము నజ్ఞాలదుర్బ
లులమైన మాచేతఁ దెలియంగఁ బడఁడాయె " నది యమ్మహేశ్వరు నంతికమున
కూరుచుండుటయును వారలఁగని పునశ్శాపభీతిచేత సరవి నతఁడ
దృశ్యుఁడగుచుఁ బఱచి దివికి గోలోక సంస్థితను సురభి సరిగఁ జేరఁబోయి
సీ॥ "జగదుద్భవస్థితిసంహారములఁజేయు నంబ! కైకొనుము నా యంజలులను.
రసభావముల నెల్లరం దృప్తిపెట్టెడి తల్లి పట్టుము నాదుదండములను
రసవిధ్ధణంబుచే వెస నెఱుంగఁగఁబడు మాత! గ్రహింపు మస్మన్నమస్సు.
బలమును స్నేహమును బ్రజకుఁ బ్రసాదించు నమ! తీసికొనుము నాయర్చనముల.
జననినీవు రుద్రసముదాయమంతకును. బుత్రినీవు వసుసమూహమునకు.
అనుజవీవు ద్వాదశాదిత్యులకు. వాంఛితార్థదాత్రివగుదు వందఱికిని ౧౧౦౯
సీ॥ తావకపదములం దా వేదములు నాల్గు స్తనములలోనఁ దత్సాగరములు
రవియును శశియును భవదక్షియుగమున రోమంబులను సురస్తోమములును
శృంగద్వయంబున శిఖరి సమూహంబు శ్రవణద్వయంబున స్పర్శనములు
నాభిని బీయూష మాఖీలఖురములం బాతాళములు మూపుపైని బ్రహ్మ
తల సదాశివుం డెదం గేశవుఁడు మలమునను బన్నగములు మూత్రమందు
సాధ్యులష్టులందు జన్నంబు లగ్రభాగమునఁ బితృగణంబు గ్రాల్చునెపుడు.
ఆ॥ ఫాలమునను మఱి కపోలంబులను యక్షకిన్నరులును గలిగి యున్న నీవు
సర్వదేవమయివి సర్వభూతవివృద్ధికర్త్రివగుచు నుందు గాదె యెపుడు ౧౧౧౦
సీ॥ ధృతివి పుష్టివి నీవు బుద్ధివి స్వాహావు స్వధవును సిద్ధివి శ్రద్ధవగుదు.
లక్ష్మివి కీర్తివి లజ్జవు కాంతివి మతివియు మఱి మహామాయవగుదు.
సకలమహార్థసాధకవు. ముజ్జగములఁగూడఁ ద్వద్రహితంబు కొంచెమేండ
దగ్నిభట్టారకుం డాదిగాఁగలయట్టి యమరాదులకుఁ దృప్తి యాచరింతు.
స్థావరంబును జంగమమై విలసిలు భువనమంతయు నీచేతఁబూరితంబు.
అఖిలలోకంబులకు హితవయిననీవ యస్మదంగంబునకు హితవగుము తల్లి! ౧౧౧౧

## శివుఁడు వృషభావతారమెత్తుట

క॥ దేవేశ ! నమస్కారము గావింతును. నాదుపూజ గైకొను మనఘా !
ఈ విశ్వార్తి హరించెడి యావా ! స్తుతియింతు వరదనగుమీ దయతోన్. ౧౧౨

తే॥ విప్రశాపాగ్నిదగ్ధమై విగతశోభమైన నామేను శోభనా ! యమృతజాత !
తిరిగి నిల్పుము కరుణ నీతేజుచేత" ననుచు నాగోవు కెంతయు నభినుతించి. ౧౧౩

క॥ వలగొని భక్తియుతంబుగ లలినొప్పెడి దాని మేన లయమగుటయు నం
దుల కెంతొ సంతసిలి యది యలఘుతరాత్మీయు గర్భమందు ధరించెన్. ౧౧౪

సీ॥ తెఱగంటు లందఱుం దిరుగంగఁజొచ్చిరి యగ్గలంబగు నార్తి కగ్గమగుచు
అవనీతలంబెల్ల నాధారశూన్యమై కడుభయంపడ జను ల్కదలఁదొడఁగె
సూర్యచంద్రులు ధూతశోభులై రెంతయుఁ జిమ్మచీఁకటి దెస ల్కమ్మకొనఁగ
గాడు ప్రచండమై కన్నులువో వీచె వారిధు ల్క్షోభించె ఘోరముగను
స్థావరము జంగమంబైన సర్వజగము వేనిలోఁ గాలమందున విలయమొంది
తిరిగి కలుగునొ యవ్వాఁడు ధరణిసురుల శాపమునఁ జేవి దగ్ధుఁడౌ సమయమందు

తే॥ అటు హతప్రాయమగుటయు నఖిలజగము యోజనాయామవిస్తృతి నున్నయట్టి
పుడమిఁ బడియున్న లింగంబుకడకువచ్చి మునిసహస్రంబు లత్యంతమును బనవుచు

క॥ అటునిటు లవలోకించుడు నెటుగూడను దృష్టిపథము నెనయఁడు శివుఁ. డ
ప్పటులింగంబును వేయేం డ్లటుఁ బదిలముచేసియుంచి రా ఋషివృషభుల్. ౧౧౬

ఆ॥ నెత్తురోడిసికొనుచు నీరప్లుతంబయి యుండియున్నయట్టి యుగ్రలింగ
మును గుఱించి శంకయొనరె నమ్మునులకు. దహ్యమానమయ్యె ధరణియెల్ల. ౧౧౭

తే॥ తన్మహాలింగ మటు స్థాపితంబుఁజేసి నర్మదంజేసి రద్దాని. నర్మదాను
కారి యవ్వారియు. నమరకంటకంబు లింగమును. నంత నమ్మునిపుంగవాళి.

ఆ॥ " సేవ్యమానమైన శ్రీమ దేతల్లింగ మపనయించు నరక మవనిప్రజకు.
భూతములను గ్రహము లేతన్మహాపూజనమున భూపలాయనమును జేయు.

క॥ ఇక్కడ సుస్నాతుండై దక్కినపుణ్ మొగమునఁ బిత్రుతర్పణముందా
నెక్కడ్డుశ్రద్ధం జేసినఁ జక్కగ ఫలియించు నరుని సకలేప్సితముల్. ౧౨౦

తే॥ నర్మదాలింగముల పూజనమునఁజేసి రుద్రమయదేహ మగుఁ బ్రిజ రూఢముగను.
హరి పరుండినతరుణమం దాచరించు లింగపూజ విశేష మొసంగు ఫలము. ౧౨౧

సీ॥ అగు జన్మరాహిత్య మలఘుచాతుర్మాస్య సల్పంగఁబడు రుద్రజపమువలన.
తలఁగును గర్భవేదనము చాతుర్మాస్యఁ బొనరింపఁబడు శివపూజనుండి.
పుట్ట రెన్నటికి నిబ్భువిని జాతుర్మాస్య భవుమీఁద నవ్యాజభక్తినుంచి.
అమృతంబు సేవింతు రల్లచాతుర్మాస్య శంభుఁ బంచామృతస్నాతుఁజేసి.
భీమగుడిని దివ్వెఁబెట్టి చాతుర్మాస్య స్వకులకోటితోడఁ జనును దివికి.
మధువుతోడ నీశు మస్తకమునఁ జేయు సేచనంబు దుఃఖమోచనంబు. ౧౨౨

తే॥ చందనమలంది శ్వేతపుష్పములచేఁ గరంబు గైసేసి యగరుధూపంబు వేసి
నర్మదాజలలింగంబునకు యజించు నరులు నరులనఁబడరింక హరులెకాని. ౧౧౨౪
క॥ ప్రాణప్రతిష్ఠచేసిన ప్రాణంబులులేని రాలె హరులగుచుండఁగ
ప్రాణములుగల శరీరులు రాణను హరులగుట యెంత రసఁ బరికింపన్. ౧౧౨౫
క॥ ఏతత్తీర్థంబున సంజాతంబయి పూతమగుచు జలధారణసం
పీతంబగు నీలింగము చాతుర్మాస్యము యజించు జనుఁ డా శివుఁడౌ. ౧౧౨౬
ఆ॥ నరగణంబు మఱియు నర్మదామరకంటకాఖ్యతీర్థమునను నధికనియతి
గలిగి జలకమాడ నలఘుచాతుర్మాస్యఁ జని త్రివిష్టపమున మనెడి నెపుడు."
కం॥ అని విశ్వతీర్థమునకుఁ జనవుచుఁ బద్మాసనమునఁ బ్రాణాయామం
బునుబట్టి నిశ్చలంబుగ మనమున ధ్యానించి ర య్యుమాహృదయేశున్- ౧౧౨౭
కం॥ పదపడి యింద్రాద్యమరులు కదలి ద్రుతం బమరకంటకమునకుఁ జని బి
ట్టాదవెడిభక్తిని నానతవదనులగుచు ఋషిగణంబువలను మొగంబై ౧౧౨౯
ఆ॥ "బ్రహ్మవిదులు గురులు బంధవిముక్తులు నవనిసురులు నైన యట్టిమీరు
ఎఱఁగుచున్నవార మేము మహేశ్వరులార యో ద్విజాతులార! భక్తి. ౧౧౩౦
కం॥ గుణరూపులుమీరలు. మఱి గుణాకరులు - త్రిగుణములకుఁగూడ నతీతుల్.
గుణమయభావములఁ బ్రతిక్షణమును ననుబుద్బుదములు క్ష్మాచక్రమునన్-౧౧౩౧
సీ॥ మీరు వాగ్జలధార వృజినుల శుచిచేతు. రపాపముల భస్మమాచరింతురు.
మీవాకె చురకత్తి. మీ శర్మ భూసము, లాగ్రహసమయమం దగ్నితుల్య.
మీరె పమర్థులనేకంబులైనట్టి శక్తులఁ బడఁగొట్టు క్ష్మాతలమున.
త్రిదివాదిలోకము శ్చర్ప మీరే గతి. యెక్కార్య మేని మీకే సుసాధ్య.
మీరె సత్కర్మకారకు లెంచిచూడ. మీరె సత్కర్మనిరతులు. మీరె మోక్ష
కాంక్షులగు మనుజులకు సత్కర్మములను ఫలమునిచ్చెడివారలు ప్రాజ్ఞులార! ౧౧౩౨
తే॥ వాగయోమయశస్త్రిమ్మవట్టియునికి యస్మదీయబలంబు లోకోత్తరంబు.
మీరలు తరింతు. రితరుల నెంతయును దరింపఁజేతురు. మిమ్ము వర్ణింపఁదరమె-
కం॥ త్రేతాగ్నులు సతతము మీచేతం దర్పితములగు. విశేషించి తద
ర్చాతత్పరులై యుందురు చాతుర్మాస్యమున ఫలము సమధిక మొందన్. ౧౧౩౪
కం॥ సావిత్రీమంత్రజపము కావించుచునుందు రెపుడుఁగావున మీ ర్కార్యా
ధావిలులగుచో సకలాంగావళి నశియింపఁజేయరయ్య విలీలన్. ౧౧౩౫
ఆ॥ విప్రశాపమర్వి వితథంబుగాకుండ వఱలుచుండునంతవఱకుఁగూడ
కులిశశూలదండములతోడఁ బనిలేదు హరిహరాయునకు హరున కంతకునకు. ౧౧౩౬
ఆ॥ అగ్ని కానఁబడెడి యఖిలపదార్థముం దగులబెట్టుఁగాని ధరణిసురుఁడు
శాపమునను జేసి జాత మశాతమ్ము నెల్ల బలిమిమై దహింపఁజేయు. ౧౧౩౭

తే॥ శస్త్రమునఁ గొట్టఁగాఁబడి చచ్చునట్టివాఁడు సహితము క్రిమ్మఱవచ్చుఁగాని
ధరణిసురశాపవహ్నిచే దగ్ధులైనవారు నారకమునుండి రారు మరల. ౧౧౩౮

కం॥ సురలకు మధుధాన్యంబుల సరిగన్ ఛేదించునట్టి సామర్థ్యములే.
దరసిన వాక్ప్రస్త్రమునను కటకట నగ మెల్లఁ దలఁగఁగలరు మహీసురుల్.

ఆ॥ అట్టిమీర లగుదు రస్మద్గురు ల్విశ్వకర్తలార! భువనకర్తలార!
ఈశ్వరుని వినాగ నేమును లోకము ల్పనవుచుంటి. మెఱుక పఱుపుఁ డతని” ౧౧౪౦

కం॥ అనివినుతించుటయును మును లనఘుండగుశూలపాణి యాత్మభయమునన్
జని సురభీగర్భంబున జనియించుట యెఱిఁగి విబుధసంఘంబునకున్ ౧౧౪౧

క॥ స్వాగత మొసఁగి తదన్వితులై గోలోకమున కరిగి రమరాధ్యమునన్.
వేగ నటులేగి యందలు బాగుగఁ గనుగొనిరి యచటి భద్రము లెల్లన్. ౧౧౪౨

క॥ పరమాన్నకర్దమంబుల సురుచిరఘృతనదులఁ దేనెసోనల దధిసుధా.
కరులగు పూర్వజగణముల మరీచిఘృతసోమపులను మఱిఁగాంచిరహో! ౧౧౪౩

సీ॥ నంద నందిని మేధ్య నర్మద సుమనస సకలప్రియ సుశీల శాంత నీల
శామిని ధర్మద వామన లంబిక ధనద తరేయిక శాంత కృష్ణ
దీర్ఘశృంగ సురూప దీర్ఘనాస సునాస చారుచంపక దుర్గ్విమహ్యా వినత
అభినత సుదతి జయారుణ కుండోఘ్ని గౌర హిరణ్యద గౌరవదన
లోనుగాఁగల యావులలోనుండి యవల కివలకు నురికెడి యర్కతేజు
సౌరభేయుని గని నీలసంజ్ఞుఁ బ్రీతి నింద్రముఖదేవతలును మునీశ్వరులును

సీ॥ “ ఈ వెల్లగోప్తల కెంతయు దేవుండ. వగుదు జగద్గోప్త. వాదిముఁడవు.
విష్ణువు లోకకార్చి విజ్ఞానమిడెదవు. ధర్మరూపత నమృతంబు నిడెదు.
హరియించెదవు నీవ యఖిలజాడ్యములను. ధనమును శ్రీనిచ్చి తనుపు, దీవ.
జగము సుఖింపఁజేయఁగఁ బ్రవృత్తుండవు. తేజంబులకు నీవ దివ్యధామ.
మతిబలా! సౌరభేయ! శృంగాగ్రమందుఁ దాల్తు వుమతోడి కైలాసధరము నీవు.
వేదమయుఁడవు వేదాత్మ వౌదు నీవు. వేదవేద్యుఁడవును వేదవిదుఁడ వీవు.

సీ॥ వేదయానుఁడవును. వేదరూపుఁడవును. దగ స్తుత్యుఁడవును వేదములచేత.
త్రిగుణంబులకుఁ బరుం డగుదు గుణాకరుండవు. నీదు యాథాత్మ్య మెవఁ డెఱుంగు
అగుదీవు భగవంతుఁడవు దేవ! వృషభముక్. వృషలుండు నిన్ దూఱు వెకలి తలఁప.
వీఁడును గాళ్లచే వృషభమున్ స్పృశియించువాఁడును బడు రౌరవంబునందు.
ఆఁకటం దప్పి నాక్రాంతమగుచునుండ మిగుల భారంబువహియించి వగచుచుండ
కొంచి యెవ్వఁడు నిర్దయాక్రాంతుఁడగునో వానిమతి శాశ్వతంబయి పఱల దింక.

ఆ॥ పితరులకుఁ గుఱించి ప్రీతియుతంబుగా మైలకోడె కెవరు మహిని బెండ్లి
యాచరింతురో వారియన్వయమునఁ బుట్టువాఁడు నరకమునకుఁ బోఁడు పోఁడు.

సీ॥ ఎల్లలోకంబుల కీవ యర్యోదు గతి. యీవ తండ్రివి. పరమేశ్వరుఁడవు.
నినువినా జగమెల్ల నిర్వీర్యమైపోయి తత్క్షణముననె విధ్వస్తమగును.
బరయును బశ్యంతి వైఖరి మధ్యమ యను చతుర్విధ సువాక్యముల కీవ
ఈశ్వరుండవటంచు నెల్లభూతములకుం దృప్తినేయుదువంచుఁ దెలియు బుధుల.
కాత్మవని బ్రహ్మమని ధర్మమని జగంబుఁ బర్విఁయుండెదవనియు నిక్కి బ్రిజయొఱుంగు
జీవరూపంబునను నిత్య మీవు మూఁడులోకముల నిండియుండుదు వేకముగను.

తే॥ నాల్గుకొమ్ములు మఱియును నాల్గుకాళ్ళు రెండుతల లేడుహస్తంబు లుండి మూత్రె
ఆంగులం గట్టఁబడు ధర్మరాశియైన వృషభమునుగాఁగ నిను వేదవిదుఁ డెఱుంగు.

సీ॥ అచ్ఛేద్యుఁడు నభేద్యుఁ డప్రమేయుఁడు మహాయశుఁ డశోచ్యుఁ డదాహ్యుఁడనుచుఁ
బౌరాణికాగ్రణుల్పలుకుచుందురు. త్వదాధారమంతయుఁ.ద్వదాధారముర్వి.(నిన్నె
యుష్మదాధారులై యున్నారు దేవత లగు యుష్మదాధార మమృత" మనుచు
స్తుతియించి సుప్రసన్నతఁ బ్రణతుండగు కఱకంఠునకుఁ గృతాగనులు విప్రు
"లెవని మృతదినమున కేకాదశాహమం దిల వృషోర్జనంబు సలుపఁబడదొ
శ్రాద్ధశతము శ్రద్ధ సలుపంగఁబడినను వాని ప్రేతతనువు వదల" దనుచు ౧౧౫౦

ఆ॥ వరమొసంగి మఱియు స్వల్పరుషాక్రాంతమయి చరించు నమ్మహావృషభము
ముద్దులెండు శూలమునఁ జక్రమున నంకితంబొనర్చిరపుడు ధరణిసురులు ౧౧౫౧

ఆ॥ దేవగుప్తమైన యావృషరాజంబు గోగణంబునడుమ వేగ విడిచి
ముక్తకోపులగుచు మునివరు లనిమిషుల్ స్వస్వధామములకుఁ జనిరి వేడ్క ౧౧౫౨

ఆ॥ ఇట్లు కామవశత ఋషిసతీలోలుఁడై శివుఁడుగూడ వారి ధవులచేత
బలిమిమై శపింపఁబడి నర్మదాజలంబున శిలామయత్వ మెనసె" ననుచు. ౧౧౫౩

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్ష సంప్రాప్తోభయ భాషాపాండిత్య
రసవత్కవిత్వనిధాన హరితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాం
బికాగర్భశుక్తిముక్తాయమాన విద్వత్సభావిస్మృతావధానవిధాన
జానపాటి పట్టాభిరామాభిధాన సమాంధ్రీకృతంబగు
శ్రీస్కాందమహాపురాణాంతర్గత
నాగరఖండంబునందు
నవమాశ్వాసము.



# నాగరఖండము.

## దశమాశ్వాసము.

———:o:———

క॥ శ్రీకాశీరామేశముఖైకక్షేత్రయాత్రలెన్నియొమాఱుల్
ప్రాకటభక్తినొనర్చు మహాకాయా! భాకరాట్పురాంతశరాయా! ౧

### ——› నీలవృషభ లక్షణము. ‹——

తే॥ అవధరింపుము పైజవనాఖ్యశూద్ర! "యద్భుతాకృతియైనట్టి యావృషభము
నీలసంజ్ఞక మెటులయ్యెగాలవ! వచియింపు" మనుటయు నమ్ముని యిట్టులనియె.

ఉ॥ రంగున నెఱ్ఱనై కరము రాజిలునట్టి మొగంబుఁ దోఁకయున్
బంగరుపూఁతపూసినటు పాండురమై మఱిగిట్టలన్నియున్
శృంగయుగంబుఁ దెల్లనయి చెన్నలరారు వృషంబు నీలసం
జ్ఞం గను. నివ్విధంబునను శాస్త్రవిదుల్ వచియింతురు శూద్రజా! ౩

సీ॥ కమనీయతమములౌ కాళ్ళునాలుగు గల్గి నందితో సామ్యంబునొందునెద్ది
ధర్మదేవతవోలెఁ దాఁదోఁచుచుండెడుఁ బరికించుమాత్రన ప్రజలకెద్ది
నీలలోహితమైన నిజచిహ్నములచేత స్వాంతముల్ హరియింపఁజాలునెద్ది
ఖురచిహ్నములయందుఁ దఱచుగం గపిలమై ముద్దునేయుచునుండుఁ దద్దయెద్ది
దేనివిశ్వరూపుఁడైన జనార్దనుం డలఘువేదమంత్రములను నిత్య
మర్చితంబుఁజేయు నది నీలసంజ్ఞికం బదియె పంచవదనుఁడైన శివుఁడు. ౪

క॥ తద్దర్శనమాత్రంబునఁ బెద్దగసిద్ధించు వాజపేయఫలం బిం
తద్దిసమర్చితమైనం దద్దయు జగమెల్ల నర్చితంబగుచుండున్. ౫

క॥ ఆనీలవృషభమునకున్ జానగుగ్రాసమునఁ దృప్తిసలుపంబడఁచో
నీనిఖిలమైనజగమును దా నాప్యాయనముగాంచు దాస! నిజముగన్. ౬

క॥ సాలగ్రామముకథ యిది. కోఁగళుఁడు లింగమైన కథ యిది. గాన
సాలగ్రామము లింగముఁ బూలంబూజించువారు పొందరు వ్యధలన్. ౭

శా॥ చాతుర్మాస్య విశేషభావనముచే శ్రద్ధన్ విశేషించి యా
భూతేశున్ హరిఁబూజసేయువలయుం బూజింపఁగంబడ్డవా
రై తామిత్తురు స్వర్గమోక్షముల వా రగ్నిష్ఠిరాజీవగో
త్రాతస్థైరదుమారమాధవసమర్చన్ ముక్తి హస్తస్థమౌ. ౮

సీ॥ వేదతత్పరుఁడయి వేదోక్తపూర్తేష్టకర్మముల్ సేయింపఁగడఁగువేని
పంచాయతనపూజఁ బాయకనిత్యంబుఁ గోరి తత్తీర్థంబుఁ గ్రోలువేని
సత్యమౌవాదంబు సల్పుటయందుఁ దా నోర్మి బద్ధశ్రద్ధనుండువేని
మనసిడ్చి సెల్లఁజనకయలోలుఁడై పాత్రంబునం దృప్తిపడయువేని
జ్ఞానముఖరగుణంబులసహితుఁడగుచుఁ దగఁబ్రవర్తించెనేని శూద్రకులజుండు
స్వర్గతిం బొందు. ద్వాదశాక్షరజపంబుకంటె వానికిఁ దపములేదన్య మరయ. ౯

ఆ॥ మంత్రవర్జితముగ మధువైరికిన్ షోడశోపచారపూజ యొనరుచునది.
అవ్విధంబు గాని యఘహంత్రియగుపూజ చండికాధవునకు సల్పవలయు" ౧౦

క॥ అనియిట్లు మునియు శూద్రుఁడు ననుకూలములైన యట్టియాయాకథలన్
వినుచుచు వినుచు వసింపఁగఁ జనె రాతిరి యంతలోన సంయమి! యంతన్ ౧౧

క॥ సచ్ఛూద్రుఁడు లేచి మునిం దచ్ఛిష్యుల సర్వపూజఁ దనుపుటయును వా
రచ్ఛపుగు స్వాశ్రమంబున కిచ్ఛమెయిని సత్వరముగ నేగిరి తనయా! ౧౨

క॥ ఎనఁడిది యంతయొ కొంతయొ తవిలివినను వినుచు మతి రూఁదాఁగదివిఁచున్
భువి వారిచేత నార్జితమౌపుణ్యంబునకు నాశ మనునది కలదే"

— శివుఁడు పార్వతికి ద్వాదశాక్షరమంత్రోపదేశము చేయుట —

క॥ అనిచెప్ప వనజభవుఁగని యనఘుఁడు నారదుఁడు "ద్వాదశాక్షరజపమున్
పొనరించి నాల్గెలలకె గిరితనుభవ యెటు యోగసిద్ధిఁ దాఁబడసెఁబితా!" ౧౪

క॥ అనియడుగుటయు నతం డిట్లనుఁ. "జాతుర్మాస్య గిరిజ హరిపయిభక్తిన్
ఘనముగవిశ్వంగంబున ననయముఁ దపమాచరింప నారంభించెన్. ౧౫

సీ॥ దేవతాతతికెల్ల సేవనీయుయయ్యుఁ గావించె దేవతాసేవనంబు
ద్విజులయందక్రికిని భజనీయుయయ్యును భజియించె మిగుల నాద్విజకులము వె

శుచులలో నెల్లను శుచి తానయయ్యును భక్తిఁ దచ్చుచిఁగ దుంబరిచరించె
గోరాజవాహను కూరిమిసతియయ్యుఁ గొలఁకంగడంగె నాగోగణమునె
దండియాశ్వత్థమునకుఁ బ్రదక్షిణించె నతిథిసత్కారములఁ గరం బాచరించె
భగవదుపదిష్టమంత్రజపంబు సేయుచును భవానీమహాదేవి మునివరేణ్య! ౧౮

సీ॥ నీలమేఘముడాలు నిరసించు నెమ్మేనఁ బచ్చనిపాంబట్టు బట్టఁగట్టి
మకుటకేయూరాది మణిమయాభరణంబులం దత్తదంగంబులఁ౯ ధరించి
కరముల నాల్గింట ఖడ్గగదాశంఖచక్రముల్నాలుగు సరిగఁబట్టి
శ్రీవత్సకౌస్తుభశ్రీమేళనమునఁ గమలసుహృత్కోటి కాంతిగలిగి
వ్యాప్తలోకత్రయుం డయ్యు వైనతేయుపై నధిష్ఠించి శతపత్రపత్రనేత్రుఁ
డై నవిష్ణుండు "దేవి! నీయభిమతంబుఁ దెలుపు శుభమగు"నని ప్రీతిఁ బలుకుటయును

కం॥ "దేవా! యేజ్ఞానంబున నావర్తనముండ దింక నశ్యములంబై
త్రావెలసెడి యాజ్ఞానము కావలయును నాకొసంగఁగదె దయఁజూచుచున్ ౧౯

తే॥ సర్వమంగళ వచియింప శార్ఙ్గధరుఁడు శ్రవణ మొనరించి యిట్లను. శైలతనయ!
ఎవ్వఁడు తా దేవదేవేశుఁడో వచియింపఁగలఁడు తద్భగవంతుండె కరుణ నీకు. ౨౦

సీ॥ సర్వసాక్షి యెవండు సంహారకంబునం దంతర్బహిర్వ్యాప్తుఁ డగు నెవండు
జగములసృజియించి సాకెడి నెవ్వఁడు పవిత్రులందెల్లఁ బవిత్రుఁ డెవ్వఁడు
ఆద్యంతములు లేని కాలధర్మ మెవ్వండు ధర్మాదికముల కధ్యక్షుఁ డెవ్వఁడు
అజుఁడయ్యు నెవ్వఁడు మూర్తామూర్తరూపంబుతో జన్మముల నెత్తి తోఁచుచుండు
అక్షరత్రయసంసేవ్యమైన బ్రహ్మ మెవ్వఁడు వాఁడె భవత్ప్రష్టమగువిషయము
త్రాను వచియింపఁగలవాఁడు కాని నాకుఁ దాదృగధికార మింతయున్ లేదు గౌరి;

ఆ॥ అనియిట్లు వచించి హరి యూరకుండుడు నంతలోన నచటి కతిరయమున
సార్వకామికముగ సంచరించువిమానవరము మీఁద నెక్కి వచ్చె శివుఁడు. ౨౧

ఆ॥ సకలభూతసంఘసహితుఁడై శివుఁ డట్లువచ్చుటయును హైమవతి స్వకీయ
సఖులయెదుట నతని సత్కృతుఁ గావించెఁ జక్రపాణి మిగుల సంస్తుతించె. ౨౨

ఆ॥ సంస్తుతించి యట్లు శంకరు మెయి లయంబుగుడు నతఁడు వ్యోమయానమందె
యుండి "తృప్తిపడితి నో గౌరి! నీయెడ. మంతనమున కేగి మతివచింతు" ౨౩

కం॥ అనిపలికి యాపె కరమును దనకరమునఁ బట్టుకొని ముదమున విమానం
బున నుంచుకొని రయంబున బొనరిచె దూరప్రయాణమును శంభుఁ డటన్ ౨౪

॥ వివిధధాతుమయములు వివిధరత్నవిచిత్రితంబులు సౌధరాధరశతములు
భూరిప్రవాహసంపూర్యమాణంబులై కొమరారుచుండెడి గొప్పనదులు
కోకిలసముదాయకూజితయుతములై ప్రీతి నింపెడి పెద్దపెద్దపొదలు
సౌగంధికాదికసరసీరుహములకు తావయి వెలయుసరోవరములు
వ్రీహిగోధుమయవముఖ్య వివిధసస్యచితములై వెలుఁగొందెడి క్షేత్రములను
ఘనతరాఘాతములు దేశఘాతములు క్రమక్రమంబుగ వానిఁ దతిక్రమించి ౨౫

సీ॥ కుసుమితంబై యుండుకొండగోఁగులతోడ రమణీయకోవిదారములతోడ
తారాపథవ్యాప్తతాళమ్రివులతోడ ధరణిఁగప్పిన నేల తాళ్ళతోడ
ఫలభారమునవీఁగు పనసమ్రాఁకులతోడ వర్ణించునలప్రియంగువులతోడ
సకిసలయంబులౌ వకుళశాఖులతోడ విమలమౌ తిలకవృక్షములతోడ
కౌఁగులతోడఁగూడిన ఘనవనములు దాఁటి చనిచని యట జహ్నుతనయదరిని
స్వర్ణవర్ణమృగద్విజసంకులమును స్వర్ణమయమును స్వర్ణభూషమును నగుచు ౨౬

కం॥ ఫుల్లంబై విలసిల్లెడి బిల్లునకున్ సరిగ నిలిపి ప్రీతి విమానం
బిల్లాలి కచటనుండెను యుల్లాసముతోడ నొక్కటొక్కటిగాఁగన్. ౨౭

తే॥ తత్తటస్థులు నూర్ధ్వరేతస్కులనగు మునులపెక్కండ్రయాశ్రమంబులనుజూచె.
చంద్రపత్నులు కృత్తికలందెయాడి శుభ్రవస్త్రలఁగై నేసిచూడఁబడిరి. ౨౮

కం॥ వారలు కరములు మోఁగిడిచి గౌరింగని "తనయుంకొఱకుఁగా నేఁగదరి
శ్లేరమ్మమీర. ఉడుగౌకుమారుఁడు భవదీయదృష్టిమార్గమునఁబడెన్" ౨౯

చం॥ అనుటయు గౌరి వారిఁగని "యంతటిభాగ్యము నాకు లేదు. కా
వున నెటు లస్మదంకమునఁ బుత్రకుఁడెక్కెడు? భాగ్యహీనతన్
జనములకెప్డుమండ డిల సౌఖ్యము. పుత్రకశబ్దమేనియున్
వినిచితిరీర. లేటికిటు వేడుక వచ్చితిరో వచింపుఁడీ" ౩౦

ఉ॥ నావుడు దేవి మంత్రినమునన్ మన మొండొరు లున్నయాప్పుడి
చ్చావిహృతిన్ సఖీనణులు! సల్పెఁడు హాస్యము లంతెకాని మీ
కీవడికాదు త్రాద్యకే, మీఁకెంతయు సత్యమె చెప్పెఁడ"న్న రా
జీవదళాక్షులాఱుగురు చేతులు మోడిచి భక్తినమ్రలై ౩౧

కం॥ నిజమే వచించుచుంటిమి రజనీచ్ఛేఖరవధూ! శరస్తంబంపుం
వ్రిజమునకు నడుమ మనసుతు నిజహస్తములను గ్రహింపు నీ"వనియనుడున్ ౩౨

సీ॥ శతపత్రములతోడ సరితూగుచుండెడి యాఱుమోములతోడ నలరువాని
ఒకసారి మెఱసిన యొక కోటిమెఱుములపలెను గనుంగొనఁబడెడివాని
దివ్యరూపంబుచే దేదీప్యమానుఁడై ప్రస్తుతిఁగొను మహాబలమువాని
వహ్నిచే వహియింపఁబడిన వీర్యమునుండి యుదయించి తెల్లునం దున్నవాని
స్తన్యమిచ్చి యల్ల షట్కృత్తికలచేతఁ బ్రత్యహంబుఁ బెంపఁబడెడివాని
గంగకడుపులోనఁ గదలక మనువానిఁ బ్రీతిఁ గనియె నామె పిల్లవాని.　　౩౩

క॥ కని "వత్స! రార"యనుచుం గొని కరములరెంటితోడఁ గూర్మి విమానం
బునఁ దనదు నెడమతొడపయిఁ గొనకొని కూర్చుండఁబెట్టుకొని సంతృప్తిన్

క॥ "చిరకాలము జీవించుచుఁ జిరకాలము బిట్టు సంతసించుచు బంధూ
త్కరమును సంతసపెట్టుము చిరకాలమటంచు రెండుచేతుల వానిన్　　౩౫

శా॥ గాఢాలింగన మాచరించుకొని యా గాంగేయు మూర్ధంబులన్
బ్రాణిన్ మూర్కొన వాఁడు లేచి పితృ సత్పాదంబులన్ వ్రాలి ని
ర్వ్యాజోర్ధ్వాంజలియౌచు నిల్వఁబడుడున్ దోయానమ త్స్రోజ నా
రూఢుండౌ శివు కన్నుసన్నల బహుప్రోతస్విను ల్దాఁటుచున్　　౩౬

సీ॥ లక్షయోజనముల లలితజంబూద్వీప మొప్ప రెండంతలౌ నుప్పుసంద్ర
మంతకు రెండంతలైన కుశద్వీప మింతకిమ్మడియైన యిక్షుసింధు
వంతకు ద్విగుణమైనట్టి క్రౌంచద్వీప మంతకినిమ్మిక్కిలియౌ సురాబ్ధి
అద్దానికిని రెట్టియైన శాకద్వీప మంతకురెట్టియౌ నాజ్యజలధి
సరిగ దానిమించు శాల్మలిద్వీపంబు దానిఁగూడమించు దధిపయోధి
అంతకెక్కుడైనయట్టి ప్లక్షద్వీప మోలి దానిమీరు పాలకడలి　　౩౭

క॥ ఉత్తర కురుదేశములకు నెత్తగు గట్టులకు బ్రహ్మఋషివరులకు న
త్యుత్తమలోకంబులకు నుపాత్తైశ్వర్యులగు సాధ్యయక్షాదులకున్　　౩౮

ఆ॥ ఇరవులైనయట్టి యీద్వీపముల సాగరముల దాటిఁ చనియెఁ క్రమముగాను
పుత్ర! యవ్వి యాఱు భూతలస్వర్గంబులని వచింప సంశయంబులేదు.　　౩౯

ఆ॥ అచటిభూమి కొంత హైరణ్యమును గొంత రాజతమును నగుచు రాణిలు సుత!
తియ్యనైనపండ్ల కయ్యది టెంకి. యింకేమిగలదు సర్వకామదంబు.　　౪౦

క॥ ఇంటింటఁ గల్పవృక్షము లింటింటను రత్నఖచిత హేమాభరణాల్
కంటఁబడుచుంటఁగాదొకో పంటవలఁతియనుచుఁ బిల్వఁబడు ధర ప్రజచే.

క॥ ఆపాలకడలి శ్వేతద్వీప మ్మద్దానిలోన దివ్యము శతశృం
గోపేతము నమితద్యుతిమహై పర్వత మొండు రమ్యకాహ్వయ మమరున్.

క॥ ఆకొండశిఖరమందున నాకౌశపుయాన మాపె నా శ్రీకంఠుం.
డేకాంతభూమియన నదెకా కలహాశనమునీంద్ర! ఘనగుణసాంద్రా! ౪౩

సీ॥ అమృతఫూర్ణఫలంబు లంతట వ్రేలాడు చెట్లచేఁ జుట్టును సేవితమును
స్వర్ణమయంబైన సన్నని యిసుకచే నావల నీవల నావృతమును
అనిలవశంబున నసకృదాగతమైన పాలకరుల్లచేఁ బావితమును
మణిరత్నఖచితమై మాక్షికమును జాలు స్ఫటికోపలంబున స్థాపితమును
నైన తచ్ఛిఖరస్థ సింహాసనమునఁ గూరుచుండి గిరీశుండు కుధరరాజు
తనయ కిట్లుపదేశించె ధ్యానయోగ మగ్నిభవుఁడగు గుహుఁడును నాలకింప.

సీ॥ "గోప్యంబులందెల్ల గోప్య మయ్యది గౌరి! మంత్రరూపము. విష్ణుమధ్యమంబు.
ప్రణవసమేతంబు. ద్వాదశాక్షరము. నమాయంబు. మతి మాఘమాసహితము.
అసకృదక్షరమును. నక్షరత్రయయుక్త. మాగమపరమును. నగ్రియుతము.
విశ్వపావనమును. విష్ణుగమ్యము. తురీయకల నశేషబ్రహ్మాండయుతము.
అమలమంత్రత్రయసమన్వితము నిరీహులైన మునులకు సేవనీయంబు బొడ్డు
నుండి శీర్షంబుదాఁక నఖండసుఖద మల మహావిద్యచేత సమర్చితంబు. ౪౪

సీ॥ జ్ఞానరూపము సుఖాశ్రయమును నైనట్టి ప్రణవమ్ము ధ్యానించి ప్రథమమందు
సర్వగబ్రహ్మంబు చక్కఁగా నెఱిఁగి గాత్రంబును బిట్టు శోధనముచేసి
పద్మాసనంబున బాగుగాఁ గూర్చుండి కరములు రెండును గరము ముడిచి
చర్మమయంబైన చక్షుస్సులను మూసి క్రన్నన జ్ఞానమన్ కన్ను దెఱచి
సూర్యచంద్రతటిత్కోటిశోభు ద్యోతితాఖిలుని సదసద్రూపు నవ్యయు శివు
తద్విరాట్టును జిత్తపద్మమునఁ జింత సేయ మరల జనింపరు క్షితితలమున.

ఆ॥ కొలఁదికాలమేని కోరి చాతుర్మాస్యమందుఁ దాదృశంపు ధ్యానయోగ
మాచరింపఁబడిన నద్రిరాజతనూజ! కల్మషముల కచటఁ గలదె చోటు? ౪౫

ఆ॥ హరి యమోఘవీర్యమైన యీ మద్రూప మెవనిచే నిమేష మీక్షితంబొ
జన్మశతకృతాఘసంచయసంక్షయకరణమునకుఁ బ్రభువు తరుణి! వాఁడు."

క॥ అని యిట్లుపదేశించుడు "ననఘా! యీ ధ్యానయోగ మవలంబింతున్.
వెనువెంట జ్ఞానయోగంబునుగూడ సమాశ్రయింతుఁ బూనికతోడన్. ౪౬

ఆ॥ ఎట్టు లమరినగుదు నట్టుల విధియింపు మీశ !" యనుడు నాతఁడిట్లనియె.
"ఆద్యమంత్రసార మామ్నాయసారమౌ ద్వాదశాక్షరమును దగ జపింపు. ౫౦

ఆ॥ ద్వాదశాక్షరముల నాదిదౌ నోంకార మఖిలవేదములకు నాది. యఖిల
కార్యములను సిద్ధికరమును నఖిలబ్రహ్మాండయాజకంబు నబ్జవదన ! ౫౧

తే॥ దానివర్ణము సితము ఛందస్సు మధువు బ్రహ్మ ఋషి పరమాత్మయై పరఁగుచున్న
యట్టి గాయత్రి దేవత యఖిలకర్మములను వినియోగ మో హిమాచలకుమారి !

ఆ॥ క్షయము లేనిది సదసద్రూపమును విశ్వమంత్రియుతము బ్రహ్మమయపుబీజ
మోదయితరో ! వేదవేదాంగతత్త్వాఖ్య మని యెఱుంగనగును వరసి దీని. ౫౩

ఆ॥ పీతవర్ణ మప్పు బీజంబు రెండవక్షరము గాఁగ మను నకారమునకు.
కుందరదన ! మనసు ఛందస్సు వినియోగ మలఘుకాలకూటహరణమందు ౫౪

క॥ మోకార మవనిబీజము ప్రాకటతేజంబు రక్తవర్ణము నగుచున్
శ్రీకౌశికఋషియుతమై వీఁకను ధనదానమునను వినియోజితమౌ. ౫౫

ఆ॥ అల మరీచి ఋషి యనంత బీజంబును బంచవిధములైన వర్ణములును
ఎల్లభోగములను నిచ్చుట వినియోగ మలభకారమునకుఁ గలికిమిన్న ! ౫౬

తే॥ అనిలబీజము హేమరక్తాభము మతి యల భరద్వాజఋషితోడ నన్వితమును
జాపకుల కాదిభోగదం బోపడంతి ! యైదవదియౌ గకార మిట్లాలకింపు ౫౭

క॥ సురమంత్రిఋషి వకారము సురపథబీజంపు కుందసుమధవళమునై
పరఁగు మహాబలమగుచును విరిబోఁడీ మోక్షదముగ వినియోజితమౌ ౫౮

ఆ॥ అంగిరస్సు ఋషిగ నల్ల తేకారంబు సోమబీజమగుచు శోభిలెడిని.
వికచపద్మనయన ! విద్యున్మయంబది. రహితకామ్యకర్మ. మహాహ ! వింటె.

క॥ వాకారంబు భవాని ! దివాకరబీజంబు ధూమ్రవర్ణంబుఁ బుల
స్త్యాకారాంతంబు మనోజవమై క్రాన్తివినియుక్తమగుచు నతిసుఖదముగన్. ౬౦

తే॥ అక్షరంబు జపాకుసుమాభముఁ బులహాశ్రితంబు మనోబీజ మర్థదంబు
దుర్విషహ్యంబునగును నిందుసమవదన ! యలసుకారం బిఁకేమంచుఁ దెలుపువాఁడ.

తే॥ అగును దేకార మోగౌరి ! హంసరూప మధ్వరమున నియుక్తంబు నఖిలవర్ణ
మగునుజా సిద్ధిబీజ మింకడుగ నేల ? యది మహాసత్త్వమనికూడ ననఁగఁబడెడి.

క॥ వాకార మెప్పుడు నిర్మలమై కైవల్యంబునిచ్చు. యజమానుఁడు తా
కైకొనును బీజభృత్త్వం బోకాత్యాయని ! ప్రచేత యొగి ఋషియగుఁజా.

తే॥ పింగవర్ణంబునున్ మహాబీజమును యకార మనయంబు భూచింత గౌరి ! సర్వ
కృత్యముల వినియోగంబు. ఖేచరియును భూచరియును మహాసిద్ధిపొ క్రమముగ.

క॥ గాయత్రియె ఛందస్సగు నీయన్నింటికినిగూడ నిభయాన ! యింకన్
కాయన్యాసక్రమమును నీయాత్మకు గోచరింప నేవచియింతున్. ౬౫
సీ॥ ఓంకారమును నెల్లయెడలునందు నకారమును బూతమా పాదములను రెంట
మోకారమును గుహ్యమున భకారము నాభి నల గకారము హృదయంబునందు
కంఠమధ్యమున వకారంబు తేకారవాకారములఁ గరద్వయమునందు
ముఖజిహ్వలందున మొనసి సుకారంబు కర్ణద్వయమున దేకార మట్లె
కన్నుదమ్ములరెంట వాకారమును యకారమును మస్తకమున నీక్రమముగాను
పదియురెండక్షరంబుల బాగుగా న్యసింపవలయు శిలోచ్చయశ్రేష్ఠపుత్రి ! ౬౬
ఆ॥ యోనిధేనుముద్రి లాగి లింగముద్రయుఁ బట్టవలయుఁ బిదపఁ బద్మనయన !
ఆచరింప నేతదఖిలంబు నిత్యంబుఁ గలుమములకుఁ జోటుగలదె యింక. ౬౭
క॥ ఇది ధ్యానకర్మయోగము ముదితా ! యింక ధ్యానయోగమును జెప్పెద. నీ
మది యేకాగ్రంబొనరిచి కుదురుగఁగూర్చుండివినుము. కొలలు నశించున్.
ఆ॥ ద్వాదశాక్షరమును వేదశబ్దబ్రహ్మభవము ధ్యానయోగము విరిబోఁడి !
ధ్యానమునను శుద్ధతం బొందుఁ జా పాణి.ధ్యానముననె యాత్మలోనఁ గలయు.
ఆ॥ అఖిలసిద్ధిగూడనగు ధ్యానమునఁజేసి. దర్శనంబునిచ్చుఁ దాను హరియు.
అట్లుగాన ముగుద ! యాధ్యానయోగంబు సావలంబ మమర సేవితంబు. ౭౦
సీ॥ అప్రతర్క్య మగాత్ర మనుపమాన మగోత్ర మజ మనీశ మఖండ మనయ ముదిత
మఖిలగతము ధర్మ్యశ్యామవికల్పము నగాధ మనవరతోజ్జ్వల మమలతమము
విభ్రాంతికరణంబు విరహితద్వంద్వంబు సాక్షిమాత్రము శుచిస్ఫటికనిభము
సౌదామినీకోటిసమమును బ్రహ్మాండశత కారణంబును శాశ్వతమును
సహాకళంబును దుర్యాతిశాయి నభము ధ్యాతయును ధ్యేయముంగూడఁ దానయగుచు
దృశ్యము నదృశ్యమును నయి తేజరిల్లు తేజమును దేజమునఁజేసి తీసికొనుము."
ఆ॥ అనుడు గిరికుమారి " యనఘ ! యోగజ్ఞానరూపమును నమూర్తమైపరంగు
తన్మరాసురారిస్థానంబు లభ్యమెట్లగునొ యానతీయు"మనుడు శివుఁడు ౭౨
సీ॥ " శిరసు ప్రధానంబు చెలి! గాత్రములయందు.ధరియించుచుండునంతయును శిరసు.
శిరసు పూజించెడినిరతంబు దేవుని. శిరసుచే నఖిలంబు సేవితంబు.
ధరియింపఁబడియెడి శిరసుచేఁ దేజంబుఁ ధరియించుచుండెడి శిరసు బలము.
ఒనరింపఁబడియెడి యోగంబు శిరసుచే.శిరసునందుండెడి జీవితంబు
మూర్తమునకు మఱియమూర్తంబునకుఁ గూడ శిరమునూర్ధ్యఁ. దురముక్షితి. రసాత
లంబుపదము. లిద్ది లలితమా బ్రహ్మాండమునకు రూప. మేమియనుదునింక. ౭౩

ఆ॥ జ్ఞానయోగములకు స్వయ మాశ్రియంబైనయట్టి హరియె బ్రహ్మ. మఖిలదేవ
రూపుఁడైన యాతఁ డీప్రపంచంబు సృజించుఁ బెంచుఁ ద్రుంచుఁ జివర దాక. ౨౪

ఆ॥ నిఖిలమాసములకు నేత సనాతనుండైన శార్ఙ్గపాణి. యందువలన
అఖిలమాస దివస యామంబులందు నాహరి స్మరించి ముక్తిఁబొరయు నరుఁడు ౨౫

కం॥ చాతుర్మాస్యం వ్రతమగు దైతేయారాతిదైన ధ్యానంబున నో
నాతీ! కలదు విశేషం. బేతన్మాహాత్మ్య మహహ! యేమనచింతున్.
౨౬

ఆ॥ భూధరాధిరాజపుత్రి! చాతుర్మాస్య సకలదానములను సల్పు వెనుక
చేయఁబడు నమూర్తసేవ గంగాతీర్థమజ్జనమునకంటె మఱియు ఘనము. ౨౭

ఆ॥ ధ్యానమునను జేసి తలఁగుఁ జాతుర్మాస్య సర్వమాసములను సల్పుఫలము.
అపుడుచేసినట్టి దక్షయ్యమగును శుభాశుభముల నేదదైనఁగాని. ౨౮

ఆ॥ ఆట్లుగాన సఖి! ప్రియత్నపూర్వకముగ సల్పు టుత్తమంబు జ్ఞానయోగ.
మిట్లు విష్ణురూప మెనసి సేవితమైన బ్రహ్మ మిచ్చు మెచ్చి పరమపదము. ౨౯

కం॥ మూర్తామూర్తస్థితి శుభమూర్తి! విను సావధానముగ. నది యెప్పుడున్
కీర్తింపఁజనదుచూ సద్వర్తనలేకున్న ముద్దుతనయునకైనన్. ౩౦

సీ॥ తపముమున్నగునట్టి తనుశోషణ క్రియల్ వలుపఁజాలనియట్టి యలసునకును
విధిదూరమగుపను ల్విరచించుచును సదా నిందింపఁదగియుండు నీచునకును
ప్రజ మెచ్చుకొనుటకుం బ్రకటితభక్తియై తిరుగ నేరిచిన యధమునకును
చిత్తచాంచల్యంబుచే స్వవాక్చ్యుతుఁడౌచుఁ జరియించుచుండెడి జాల్మునకును
చెప్ప కీయోగమర్మంబుఁ జేరఁదీసి శమముఖానేక సద్గుణసంయుతునకు
దాంతునకు నిత్యభక్తున కింతి! సముపదేశమీవలె బాగుగాఁ దెలియఁగలుగ ౩౧

ఆ॥ విష్ణుభక్తుఁడేని విప్రునకే కాదు చరణజునకుఁ జెప్పఁజనును యోగ.
మశుచియును నభక్తుఁ డబల! బ్రహ్మస్థానమున కనర్హుఁ డేమియనును నింక. ౩౨

తే॥ ఓతపోధన! నామీఁదనుండియున్న నీదుభక్తికి సంతసించితిని నేను.
యోగసిద్ధిని గైకొను మొసఁగినాఁడ భక్తి వితగా దొకప్పుడున్ భంగి దెలియ. ౩౩

తే॥ నాదరూపంబునను భువనములనుండు నిఖిలదేహముల శిరసున నిర్వటిలు న
భూతు నారాయణుం బరుఁ బూవుఁబోఁడి సరిగ నెఱుఁగుము తదవేల జ్ఞానగమ్యు.

ఆ॥ అతఁడె జీవశిరమునందు మూర్తినిదాల్చి సూక్ష్మరూపమునను సూర్యబింబ.
మటు సదోదితుఁడయి యలరు. సదాభ్యాసమునను దత్పరాత్మ పొందఁబడెడు. ౩౫

సీ॥ హృదయపద్మంబున సదయాంతరంగుఁడై యెల్లప్డునివసించు నీశ్వరుండు.
నాళికసమమైన నాభిదేశంబునం దాసీనుఁడౌఁ జతురాననుండు.

కం॥ యోగము హృదయగ్రంథిని బోఁగొట్టు. మనుత్వశత్రువును దునుమాడున్.
యోగీంద్రు మదిని బాగుట కేఁగడు సరికిని యశక్య మేమందు నిఁకన్. ౯౮

ఆ॥ చెవులుమూసిబిట్టు చెలి! నాదరూపంబు వెదకు చెప్పుడుఁ దలను బడియవడగు
ద్వారమున మనంబు స్థాపించువాఁడెవో యమలుఁడైన యోగి. యతివిరాగి. ౯౯

కం॥ అదియే ప్రణవాగ్రంబగు. నదియే శాశ్వతము బ్రహ్మ. మదియె యనంతం
బదియే యమృతం బుత్తమ. మదియే నాదస్వరూప మమలకమూ! ౧౦౦

ఆ॥ ప్రాణవాయు ఘోష మేణాక్షి! యయ్యది. జాతరాగ్ని యుండు నత్నంబు.
భూతపంచకంబు భూరినివాసంబు. జ్ఞానరూపమును ననంశయముగ.

కం॥ ఈపదము నొందఁగలిగిన నోపార్వతి! ధనవిముక్తి మొలయును గాని
ఏపట్ల యోగసిద్ధిప్రాపకమగు నద్ది దుర్లభం బీజగతిన్.

ఆ॥ అట్టు చరము నచర మగు విశ్వమంతయు బ్రహ్మరూపమగుచు భాసిలెడిని.
విష్ణుదేవుచేత విజ్ఞానమును చేరి యాపనంబు వ్యాప్తమయి రహించు.

కం॥ యోగీశశ్రేష్ఠుండయి బాగుగ హృదయమున వసించు పంకజనాభున్
రాగము రైతీఁగిన ప్రాణాలు భోగి కఱుకుమప్పు విడిచిపుత్తు మాయన్. ౧౦౪

తే॥ ఎప్పుడు తానుసత్కర్మంబు నేయఁజిమ్మి కర్మములలోఁబ్రవర్తింపఁగలఁడో మనుజుఁ
డప్పుడె జీవించువారల కగును మోక్షమదియు తద్జ్ఞానమయయోగ తోయజాక్షి!

కం॥ ఎప్పుడు మది నిర్మలమగు నెప్పుడు మమకారముండ దీదేహమునం
దెప్పుడు హరిభక్తుండగు నప్పుడు విడు కర్మబంధ మతిసులభమునన్. ౧౦౬

తే॥ జరుపుకొంచునె కర్మముల్ శాంతమైన మానసముగల్గియుండెడి మానవులకు
యోగమయమైన సంసిద్ధి యొలయఁగలదు క్ష్మాధరాధీశపుత్రి! నిస్సంశయముగ.

కం॥ గౌరవయుతమగు స్నానము సారెకుఁ గని మనుభవించు సన్మతి తాని
ధారుణి జీవించుచునే చేరి హరిని విడువఁబడును జెడుకర్మముచే ౧౦౮

తే॥ నిత్యనైమిత్తికములైన నిఖిలకర్మముల సకామతఁ జేసినఁ గలుగదు సుఖ
మందువలనను దుఃఖతాపాభివృద్ధి యగుటయే కాని నిత్యసౌఖ్యంబు లేదు.

ఆ॥ కర్మములకునెల్లఁ గైటభమర్దనుం డీశ్వరుండుగాఁగ నెఱుఁగు దేవి!
అఖిలకర్మములను నాత్మయందుఁ ద్యజింప సంసృతిం ద్యజించు జనము వినుము.

ఆ॥ విష్ణునందుఁజేయు వివిధకర్మార్పణం బేదిగలదో యదియె యుద్ధతపము
అదియె పరమయోగ. మద్దియే విజ్ఞాన. మింతకన్నఁ జెప్ప నేమికలదు. ౧౧౧

ఆ॥ అట్టు కృష్ణార్పణంబుగా నాచరించు నిర్మలపు యోగమే యగు నిర్గుణంబు.
ఊర్జితంబగు శుభమిచ్చు యోగమనఁగ నట్టి నిష్కామకర్మంబె యగునుజుమ్మ.

తే॥ ఎంతవఱ కాత్మవంశమం దెట్టి విష్ణుభక్తుఁ డుదయింపఁడో యంతవఱకుఁ బిండ
దానతత్పరులైన పితాళ్ళు గూడఁ గరము సంసారమందునఁ దిరుగుచుంద్రు.
ఆ॥ ఎంతవఱకుఁ బ్రజల కిటువంటిహరిభక్తి గలుగ దంతవఱకె కలుషములును
బీజములునుగూడ బిట్టు గర్జించెడు. నలఘుతీర్థసేవ యంతవఱకె. ౧౧౪
ఆ॥ కనులుమూసి యెవఁడు కావించు యోగంబు వాఁడె జ్ఞాని యోగివరుఁడుగూడ.
ఉరుతరాధ్వరముల నొనరించువాఁడును విష్ణుభక్తియుతుఁడు వీఁడె చూడ. ౧౧౫
సీ॥ గోమేధ మొనరించు గొప్పవాఁడైపోవు వాకును నియమించి వఱలుతోన
అశ్వమేధఫలంబు నవలీలఁగాంచుఁబో మది నిగ్రహించి తా మనుటతోన
సౌత్రామణీమఖంబుఁ జలిపినవాఁడౌను సంకల్పవిజయంబు సలుపుతోన
నరయజ్ఞమునవచ్చు నురుకీర్తిలభియించుఁ గాయ ముత్సర్జింపఁగలుగుతోన
ఇంద్రియముల పేరి యీనైదుపశువుల హతముఁజేసి దేవుఁడగు నిరంజ
నుని నెఱింగినట్టి ఘనయోగి కో దేవి! యోగమహిమ మేమియుండు నింక. ౧౧౬
తే॥ వాఙ్మనఃకర్మదండంబు వరుసఁజేసి యోగనిష్ఠుండుగానున్న యుత్తముండు
బ్రహ్మరూపంబుతోడను బ్రదుకునపుడె తా సమాప్తినిబొందు భూధరకుమారి!
ఆ॥ కర్మబంధములను గడు బాధ్యమానుఁడౌ జ్ఞానహీనజనుఁడు సంతతమును.
జ్ఞాని కర్మములను జరుపుచునే ముక్తినొందు. నిదియె భేద ముభయులకును.
కం॥ ఎప్పుడు గురువులచేతను జెప్పంబడు బ్రహ్మముండు శ్రేష్ఠస్థానం
బప్పుడె ముక్తుండగుఁదాఁ దప్పకనరుఁ. డొడలెయుండు ధరపయి నింకన్. ౧౧౯
కం॥ ఎప్పుడు బ్రహ్మంబునఁదాఁ జప్పునఁ గలియును జనుండు సంప్రాప్తుండై
అప్పుడె బ్రహ్మద్రుమమునఁ గప్పంబడి కర్మవృత్తి కనఁబడకుండున్. ౧౨౦
తే॥ మును లవాంతరపర్వము లుమ్మఖ్యముగ నెఱుంగవలయును సర్వదా మంగళాంగి!
మఱి శ్రుతిస్మృతితతి మోక్షమార్గ మరసి ద్విజులు గుర్తింపవలయుఁజూ తిన్నగాను-
కం॥ నాలుగుద్వారంబులచేఁ గ్రాలెడి నగరంబుభంగిఁ గనదగు మోక్షం
బోలలన! శమాదులు పరిపాలింతా ద్వారములను బాయక యెపుడున్. ౧౨౨
ఆ॥ శమము సిద్ధచార సంతోషముల్ సాధుసంగ మనెడిపేళ్ళ సతతమచట
నుండి ముక్తిపదము నొందించు తచ్చతుర్ద్వారచరులె సేవ్యతములు మొదలు.
కం॥ వీరల వశపఱచుకొనన్ నేరుచువారలకు సిద్ధి నీరేజముఖీ!
దూరమున నుండ. దంగునఁ జేరుప కైవల్యపదము. చెప్పితి నీకున్. ౧౨౪
ఆ॥ యోగసిద్ధి విష్ణునురుభక్తిచేత ధర్మాచరణముచేత నగును బ్రహ్మ-
మదియె మనుజవరుల కగును సంపూర్ణమౌ జ్ఞాన. మిందు లేదు సంశయంబు.౧౨౫

క॥ జ్ఞానముకొఱకై విద్యాభ్యాసములఁ జరించునరుఁడు సద్గురువలనన్
మానుగ దీపార్చిస్సమమై నెగడెడి జ్ఞానమొందు నప్పుడె యబలా! ౧౨౬

ఆ॥ ఒకముహూర్తమేని యేకస్థచిత్తుఁడై బ్రహ్మమం దెవఁడు చింత సేయుఁ దవిలి లయము
వానిచేతఁ జేయఁబడిన పాపసహస్రములు క్షణంబులోన విలయమొందు. ౧౨౭

ఆ॥ విష్ణుభక్తుఁ డెప్పుడు విపుల రాగద్వేషకోపలోభములను రూపుమాపి
సకలమందుఁ దాను సమదర్శనుండయి యుండు. వేఱుభంగి నుండఁ డతఁడు.

ఆ॥ సర్వజీవులందు సంపూర్ణమగు దయ వేనియదిని స్థైర్యమూని యుండు
ననయ మెవ్వఁ డగు సదాచారవంతుండు యోగి వాఁడు. దుఃఖ మొందఁ డెప్పుడు.

క॥ మాయాదిపటలహీనత యావద్భువనం బసత్యమను నిశ్చయమున్
హేయజనసంగరహితత యీయవియగు యోగసిద్ధి కిల లక్షణముల్. ౧౩౦

క॥ మమతాశ్రయాశసంయోగము నరులకుఁ దాపదాయకము. తద్వర్హిన్
శమగుణవిశిష్టతా యోగమునం జల్లార్పవలయుఁ గడుయత్నమునన్. ౧౩౧

ఆ॥ చెడ్డచేఁతలను నిషేధించు మనసె యింద్రియములను సముద్ధరింపవలయు.
లోహధన్వి తాఁ గ్రలోహంబు తీక్ష్ణతంబొందుభంగి నవియుఁ బొందు శుద్ధి. ౧౩౨

ఆ॥ కాయమున విశుద్ధికరయగు బుద్ధి దా దేయ గ్రాహ్య యనఁగ ద్వివిధ. మందు
సంత్యజింపవలయు సంసారవిషయిక. బ్రహ్మమందుఁ బెట్టి పడయు శుభము.

క॥ రూప మరూపము కేశవరూపం బవ్యక్త మమృతరూపంబును నా
ఆ పరమాత్మ నివేదితి మోపర్వతరాజతనయ! ఊర్జితవినయా! ౧౩౪

ఆ॥ ఇట్లెఱుంగు యోగి యేణాక్షి! సంసారబంధమున విముక్తి పడయ నేర్చు.
ఘనగురూపదేశమునఁగాక యయ్యది దుర్లభంబు వేఱుత్రోవనుండి. ౧౩౫

క॥ ఎవ్వెడఁ బ్రసన్నుఁడగు గురుఁ డవ్వెడ విశ్వంబు సర్వ మగును బ్రసన్నం
బయ్యావ్యయన కగు తుష్టియె తొయ్యలి! పితృదైవతముల తుష్టి తలంపన్. ౧౩౬

ఆ॥ జ్ఞానసహితమైన సత్క్రియ మోక్షసిద్ధికిని లక్షణంబు దేవి! వినుము.
తత్క్రియాధిపతి సదా విష్ణువే కాని నెఱపునట్టిజనుఁడు నిష్క్రియుండె. ౧౩౭

తే॥ ద్వాదశాక్షరచక్రంబు దక్షతనయ! చక్ర మంహఃపలాశనచక్రమునకు.
దండ మున్మార్గసంచారితండమునకు. తత్పరబ్రహ్మవస్తు ప్రదర్శకంబు. ౧౩౮

తే॥ ద్వాదశాక్షరరూపమై తనరునట్టి యిదియె యగును బరబ్రహ్మ మిందువదన!
ప్రేమపాత్రంబులగుట నీబిడ్డనికిని నీకు వ్యక్తంబొనర్చితి నేను దీని. ౧౩౯

క॥ యోగిధ్యానాత్మకమును శ్రీగురుపై భక్తినుంచి స్వీకర్తవ్యం
బౌఁగాన దీనిసారము బాగుగఁ జింతింపవలయు భావములోనన్. ౧౪౦
క॥ చాతుర్మాస్యమునందున యేతత్సారంబు భక్తి నెదఁ జింతింపన్
బ్రీతిం గోటిభవార్జిత పాతకము హరించి పరమపద మిడు హరి తాన్ ౧౪౧

## మత్స్యనాథజననము

క॥ అనియిట్లు పార్వతికి శివుఁ డనుపమయోగంబు నొడువునవసరమున నా
ఘనకలశవార్ధిమధ్యంబుననుండి మహోఝషంబు పొడకట్టెటయన్ ౧౪౨
సీ॥ ఊర్జితంబైన మహోభరంబునఁజేసి మిఱుమిట్లుగొలుపుచుం బరఁగుదాని
అర్గలంబు విశాలమగు నురస్థ్సలమునే యొగుబుజంబులుచేసి యీఁదుదాని
తత్పూర్వమున జగత్త్రియమందుఁ దనచేత బాగుగా నెఱుఁగంగఁబడనిదాని
హుంకృతిదప్ప యహంకృతియనునది లేశంబు మదిలోన లేనిదాని
తనవిమానంబుమీఁది కెంతయును నెగురు మీనుఁ గనుగొని యప్పు డీశానుఁడాత్మ
తేజమున స్తంభనముచేసి "దివిజుఁడవొ నరుండవో చేపకడుపులో నుండినావు.
క॥ దేహాంతరమందుండుట కేహేతువుకలదొ ? ఇంత కెవ్వఁడవో నీ ?
వాహావు డైడుఁ జెపు"మని స్నేహంబునుజూపుకొనుచు శివుఁ డడుగుటయున్
క॥ "గండాంతయోగమున నొక యండజయానను జనింప నాయమ 'యీపి
ల్లండు కులాంతకుఁడగునఁట'. యుండఁదగఁడు మన'కటంచు నుచ్ఛృంఖలతన్
తే॥ మగనితోడను మిక్కిలి తగవులాడి పాలమున్నీట వేయింప భక్ష్యబుద్ధి
మీనుచే దక్షణంబున మ్రింగఁబడియుఁ జాకయున్నాఁడ నిటు శతసమలనుండి.
క॥ అమృతముగురిసెడి త్వద్వాక్యములను విన జ్ఞానయోగ మలవడియెను. మూ
ర్తమును నమూర్తము నెఱిఁగితిఁ. గ్రమముగ నావలకు వత్తుఁగరుణింపుమిఁకన్
క॥ నాగమృతవృష్టి నాపై బాగుగఁ గురిసితివి సత్కృప న్నీ. వటులే
ఈగౌరీదేవియు ననుఁ దాఁ గరుణంజూచుచుండెఁ. దఱుఁగేమి యిఁకన్." ౧౪౩
మ॥ అని మీనంబు వచింప నీశ్వరుఁడు "రమ్మాలస్యమింకేల ? పాత్రి
గ్జని విప్రుండవు నీవు. పూజ్యుఁడ" వనన్ సౌందర్యవంతుండుఁ గాం
తిని జంద్రుం బురుడించునట్టిఁడును నై దివ్యంపు గంధంబుతో
డను గర్భంబుననుండి వెల్వడియెఁ జూడన్ దేవియున్ దేవుఁడున్. ౧౪౪
ఆ॥ చాలఁ గష్టమైన తఱిణములో వెల్వడి మత్స్యగంధమైన మంచిదగుడు
పార్వతికిని మఱియుఁ బరమేశ్వరునకును బ్రణతిఁజేసి నిల్వఁబడియె నతఁడు.

వ॥ కలియుగాంతంబున జను లంగుష్ఠమాత్రశరీరులై శౌచాచారంబులు వదలి యాత్మకార్యాసక్తులై వర్తించెదరు. వారి కండలికిని నెలుకబొఱియు లిండ్లును గృమి వస్త్రంబు ప్రావరణంబును నయ్యెడిని. ౨౯౨

కం॥ పొందుదురు మ్లేచ్ఛభావము నందఱు నొకజాతియై దురాచారముతో,
నిందింతురు ధర్మకృతులను సందేహములేక యో రసాబుధులారా! ౨౯౩

వ॥ అంతఁ గల్కిగోత్రసముత్పన్నుండై హరిపింగళుండను బ్రాహ్మణుం డవ్వారి నందఱ నంతంబునొందించు. తరువాత మగుడఁ గృతయుగం బరుదెంచెడి. ఇట్టి వేయియుగంబులు బ్రహ్మ కొక్కదివసంబు. మున్నూటయఱువదిదినంబులు సంవత్సరంబు. ఆసంవత్సరంబు విష్ణువున కొక్కదినంబు. తమతమ మానంబుల బ్రహ్మవిష్ణు లిరువురును నూఱేసియేండ్లు జీవింతురు. విష్ణుని సంవత్సరము శివుని కొక్కదినంబగు. అతండును నిజమానంబున నూఱేండ్లు మని యంత శక్తిరూపంబున నక్షయుండుగం గీర్తింపఁబడు. అట్టిశివుని శతవత్సరంబులును సదాశివున కొక్క నిశ్వాసంబయ్యెడి. అతని యుచ్ఛ్వాసంబును మగుడ శక్తిరూపంబున వర్తిల్లెను. శంకరుని దినమానంబు నన్నుమీర లడిగితిరి. మానవాది సకలమానంబులును నేను మీకుం జె

## —♦ యుగపరిమాణము ♦—

ప్పితిని. బ్రహ్మ కొక్కదినమునకు బదునలుగు రింద్రు లయ్యెదరు. ప్రకృత మున్నయతఁ డేడవయింద్రుండు. స్వాయంభువుండు మొదలగు మనువులును నింద్రులంబోలె నందఱున్నవారలు. జయంతుఁడను నింద్రుండును వైవస్వతుండను మనువును వర్తమానులు. ఈయింద్రు శేషించిన కాలంబు గతించుటయుఁ బద్మనాభునునుగ్రహంబున బలి యింద్రుండుగా రాఁగలండు. అవ్వాసుదేవుం డష్టమమన్వంతరమున బలి కింద్రపదవి నొసంగుమనని ప్రతినవట్టియున్నవాఁడు. ఇట్లు ముప్పదిమూఁడుకోట్లదేవతలును యథాపూర్వంబుగం బ్రభవించుచుందురు. బ్రాహ్మణులారా! సృష్టికారకుండైన ప్రస్తుతబ్రహ్మ కీమానంబున నేబదిసంవత్సరముల యాఱుమాసముల యొకదినము నర యైనయది. భూమండలస్థ సకలభూతంబులకును గలియుగంబున సౌరసావనచాంద్రనాక్షత్రంబులను చతుర్విధమానంబులచేతను గాలంబు గడవ నయ్యెను. అందు మూఁడువందల యఱువదియైదుదినంబులు సౌరమానసంవత్సరమును మూఁడువందల యఱువదిదినములు సావనమానసంవత్సరమును మూఁడువందల యేఁబదినాలుగుదినములు చాంద్రమానసంవత్సరమును మూఁడువందల ముప్పదియైదుదినంబులు నక్షత్రమానసంవత్సరమును నగుచుండును. వర్షశీతాతపంబులు సౌరమానంబునను వృక్షసస్యఫలనిష్పత్తియు నగ్నిష్టోమాది యజ్ఞంబులును నుత్సవంబులును వివాహంబులును సావనమానంబునను వృత్తిసంభవంబులైన వడ్డి మొదలగు వ్యవహారంబు లధిక

మాసప్రయుక్త చాంద్రమానంబునను నభిచారికంబులు నక్షత్రమానంబునను నడచుచుండు. ఈనాల్గుమానంబులకంటె భిన్నమైన మానం బుర్వీతలంబునం దుండనేరదు. నరులును సురాసురులును నీమానంబుచే వర్తించుచున్నవారు. ఇయ్యది పురాతనంబగు శ్రుతి. భక్తియుక్తంబుగా నీయుగప్రమాణం బెవ్వండు పఠించు నాని కెంతమాత్రము నపమృత్యుభయంబు కలుగనేరదు. అట్లు దుర్వాసుండు ప్రతిష్ఠించిన శివలింగంబును నట నలరారెడు. చైత్రమాసంబునం దాలింగంబు నాచరిత నృత్యగీతాద్యుత్సవపురస్సరంబుగా నెవం డారాధించు వాఁడు తచ్ఛివానుగ్రహంబున గంధర్వాధిపతి కాఁగలఁడు" ౭౫౪

—♦ నింబశుచునియొద్ద దుశ్శీలుఁడు శిష్యుఁడుగాఁ బ్రవేశించుట ♦—

కం॥ అనియిటు సూతుఁడు చెప్పుటయును "దుర్వాసుఁడు కిమర్థముంచినవాఁ డా
ఘనలింగ మచట? అదియెపు? డనఘా! వాక్రువ్వు" మన్న నతఁ డిట్టులనున్.

వ॥ తొల్లి వైదిశంబను పట్టణంబున నింబశుచుండను వాఁడు మఠపతియై యుండి యొకలింగంబున కారాధకుండై తనకు లభించిన వస్త్రాదికంబును నన్నంబును శివభక్తులకు విక్రయించి యెక్కుడు రొక్కంబును గూడఁబెట్టుచు నం దించుకయు వ్యయపెట్టక యుండనుండఁ బెద్దకాలంబున రొక్క పెట్టియ నిండిపోయె. అంతఁ గ్రయవిక్రయవ్యాపారంబునకు దొరకొని యెన్నండును నెవ్వని నెంతమాత్రము విశ్వసింపక దేవపూజాసమయంబునఁగూడ నతం డా మంజూష నేమఱక భద్రంబుగం గాపాడుచుండుటయు నొకకాలంబునఁ బరవిత్తాపహారకుండగు దుశ్శీలనామక బ్రాహ్మణుండు తటస్థపడి తత్పరిస్థితిం బొడగాంచి. ౭౫౬

కం॥ "పిసిడికి సేవల్సేయుచు వెస శిష్యుఁడనై యిటం బ్రవేశించెద మున్.
ననియగుమాటలఁ దన్మానసమును బెట్టెను హరింతు నమ్మించి తుదన్" ౭౫౭

వ॥ అని తలపోసి యొకనాఁడు మఠమధ్యగుండగు నతని సమీపించి దండాకారంబునఁ బుడమింబడి ప్రణమిల్లి మగిడిలేచి సవినయంబుగా నంజలింబట్టి. ౭౫౮

ఆ॥ "ఆర్య! త్వత్ప్రభావ మాలించితిని. నిన్నుఁబోలు తాపసుండు పుడమి లేఁడు.
కాన వచ్చివాఁడఁ గడుదూరమునసుండి యిపుడు నీదు మ్రోల. కేమిగలదు? ౭౫౯

ఆ॥ జననమృత్యుజరలె సంసారమని దాన సారముండదంట చక్కఁ దెలిసె.
యౌవనంబటన్న నగు స్వప్నతుల్యము నాత్మ కిపుడు సరిగ నర్థమయ్యె. ౭౬౦

ఆ॥ అద్రిపైజనించు నాపగవలె సుతుల్ సతులు చుట్టములును క్షణికు లరయ.
కలిసమాగమములుగా వీరినందఱి నెఱుఁగవలసియుండు హృదయమందు. ౭౬౧

క॥ కావున సంసారాంబుధి నేవిధమున దాఁటవలెనొ యిపుడ యుపాయం
బీవు వచింపఁగవలయును దేవర! కరుణించి యీవిధేయునిమీఁదన్." ౨౬౨

వ॥ అనినవిని యతండు రోమాంచితతనూరుహుండై — ౨౬౩

ఆ॥ "పడుచువాఁడవీవు. కడు సుకుమారుండ. వట్టినీకుఁబుట్టె నిట్టిబుద్ధి
వాస్తవార్థమీవు వచియించుచుంటివి. ధన్యుఁడైతి. వేమితక్కు వింక? ౨౬౪

ఆ॥ పడుచుఁదనమునందుఁ గడు శాంతచిత్తుఁడై యున్నయట్టివాఁడె యుత్తముండు.
ధాతువులు క్షయించుతరుణంబునను శాంతి యెవని కుద్భవింప దెంచిచూడ?

తే॥ ఇట్లు సంసారముననీకు నెంతయును విరక్తిగల్గినచోఁ గొల్వు రాజధరుని
జపతపంబులఁ దరియింపఁజాలవింక ఘోరభవసాగరంబు కుమార! నీవు. ౨౬౬

తే॥ బ్రాహ్మణుఁడో శూద్రుఁడో లేక పంచముండొ యెవ్వఁడో యొకఁ-డెవఁడైన నేమిదాన
పట్టి శివదీక్ష లింగంబుపైని నొక్క-పువ్వు వెట్టినఁజాలుఁబో పోవు దివికి. ౨౬౭

ఆ॥ ఎవఁడు భక్తితోడ శివదీక్షవట్టినయట్టివాని కొక్క-యంకుకంబొ
పావుకోళ్ళొ గోచిపాతయో యిడు వాని కధ్వరములతోడ నగునదేమి? ౨౬౮

వ॥ అనినవిని దుశ్శీలుం డానింబకుచు పదంబులపైఁ దలవాల్చి యిట్లనియె — ౨౬౯

కం॥ "భవదీయ సేవ నిత్యము నవహితమతి నాచరింతు. అటుగాన వెసన్
శివదీక్షాదానంబున భవదీయానుగ్రహంబు ప్రకటింపఁగదే." ౨౭౦

వ॥ అనియిట్లు పలుకుటయు నతం డంతర్గతంబున — ౨౭౧

ఆ॥ "ఎవఁడొ యొకఁడు స్వయమయే తెంచినాఁడిందు కరముదక్షుఁడుగను గానఁబడెడు
వేఱ యెవఁడు లేఁడు చేరువం గావున శిష్యునిగను వీని స్వీకరింతు." ౨౭౨

వ॥ అని యాలోచించి వాని చేయిపట్టుకొని — ౨౭౩

ఆ॥ ఇట్టులైనవత్స! ఈదినంబె నీకు దీక్షయిచ్చువాఁడఁ దీసికొనుము.
దూరమంద నీకుటీరంబు వేయించి యటువసింపు. రాకు మిటకు రాత్రి" ౨౭౪

వ॥ అనివాక్రుచ్చుటయు నతండిట్లనియె — ౨౭౫

కం॥ "భవదాజ్ఞవలయుఁగానీ విబుధవరా! ఏలనాకు వేఱొకపని? ఏ
మివినోదముండు మఠమున? పవలే కాకందు రాత్రి పనియేముంచుమ్? ౨౭౬

కం॥ గురుఁడువచించిన తెఱఁగున నరుగని శిష్యునివ్రతంబు లగు వ్యర్థంబుల్
మఱి మీఁదుమిక్కిలి మహానిరయంబును ననుభవించి నిర్వేదపడున్" ౨౭౭

వ॥ అనినవిని సంతోషించి నింబకుచుండు వినయయుక్తుండగు దుశ్శీలునకు శివదీక్ష
యొసంగె. అదిమొదలుకొని యతం డతని శుశ్రూష శ్రద్ధమై నాచరించుచు
మనస్సును హరియించెఁగాని పెట్టియను హరింప నవకాశంబు చిక్కదయ్యె.

అనుదినంబును ననేకోపాయంబుల హరింప నదను వేచియున్నను నా శైవుండు దేవతార్చనభోజనసమయంబులఁగూడఁ దత్సువర్ణ మంజూషం గ్రిందఁబెట్టమిని శిష్యుండు తనమనంబున — ౨౭౯

## —♦ దుశ్శీలుండు నింబశుచుని పెట్టెను హరించుట ♦—

ఆ॥ "మఠమునందుఁ దాను మాపు లీపాపిష్ఠుఁ డడుగు వెట్టనీయఁ డకట యెపుడు.
ప్రొద్దుగ్రుంకఁగానె పోయి కవాటముల్వేయు. ఇంక నేమిచేయవలయు ?
ఆ॥ మంచిరాళ్ళచే నమర్పంగఁబడి శిరంబెత్తుగలిగియున్న దిమ్మతంబు.
పడదు కన్న మెచటఁబొడిచిన. అవిలంఘ్య. మపరి వేళ్య మెట్టులైన నేమి. ౨౮౦
ఆ॥ కాన విషము పెట్టియేని పరుస్నచో గ్రీవ మెల్లఁ గత్తిరించియేని
పవలె పశువుఁబోలె బంధించి గొడ్డంట మొత్తియేని ప్రాణముల హరింతు."
క॥ అని చింతించుచుండుటయు వర్షాకాల మరుదెంచె. శ్రావణకృష్ణపక్షంబున సవిత కర్కాటకరాశిగతుండగునెడ ధనవంతుఁడగు శివభక్తుఁ డొకఁ డచటికి వచ్చి నింబశుచునకు నమస్కరించి యుచ్చైస్స్వరంబుతో — ౨౮౧
ఆ॥ ఆజ్ఞయిచ్చెదేని యస్మదీయగ్రామ మరుగుదెంచెదేని యార్య! కరుణ
నేను భక్తితోడ నీచతుర్దశిని బవిత్రికం బొనర్ప వేచియుంటి" ౨౮౩
క॥ అని ప్రార్థింప నతం డిట్లనియె — ౨౮౪
ఆ॥ "ఆత్మశిష్యుతోడ నరుదెంతు నట్లె సకాలమునకు వత్స! గట్టిగాను
ఆచరింతు యుష్మదభిమతమగు శ్రీయమేలశంక ? ఇంటి కేగుమీవు." ౨౮౫
క॥ అనియిట్లు చెప్పి యతనిం బంపించి ప్రాభాతికకృత్యంబులు తీర్చికొని యా శైవుండు పయనమై పోవుచు మధ్యమార్గంబునం దొక్క తరంగిణిని దర్శించి —
ఆ॥ "శిష్య! ఉభయకూలములను జేయుద మిచ్చట దేవపూజ గాన స్థిరుఁడవగుము
సురశియనెడి పేరి వరనది యిది సింధుగామినియును, ఖ్యాతిగాంచినదియు"
క॥ అనిపలుకుటయు నతండు నట్లె యని యచట నిలుచుండె. నింబశుచుండును ననవరతం బాచరించు దుశ్శీలుని శుశ్రూషాదులచేతను వినయవిధేయతలచేతను రంజింపఁబడిన వాఁడై సచ్ఛిష్యునిగా భావించి బంగరుపెట్టియను దన యిష్టదైవమగు జాగేశ్వర లింగంబును బదిలపఱచియుంచిన బొంతం గ్రిందఁబెట్టి మలవిసర్జనకార్యంబునకై యుంచుక యవకాశంబు తీసికొని ప్రబ్బలిచెట్లచాటునకుఁ బోయి కనఁబడకుండఁ గూర్చుండుటయు దుశ్శీలుండు దత్క్షణంబ యాపెట్టెం దీసికొని సంతసించుచు నుత్తరదిక్కునకు వెడలిపోయె. అంత నా శైవుండు లేచివచ్చి జాగేశ్వరసమన్వి

తంబగు కేవలకంథగాక దుశ్శీలుండును గానరామిఁ జంచలచిత్తతం ద్వరితంబుగా శౌచవిధి యొక్కింటుకయు నిర్వర్తించుకొని యాచమనం బాచరింపకయు భ్రాంత యున్నచోటి కేతెంచి సువర్ణమంజూషం గానక శిష్యుండు హరించినట్లు తెలిసి కొని మూర్ఛవోయి పుడమింబడి కొంతవడికి దెప్పిరి తెలివిఁ దెచ్చుకొని లేచి ౭౮౯

క॥ "హా! చచ్చితిని. దురాత్ముఁడు వేచి హరించెను మదీయవిత్తంబెల్లన్
హా చేయుపని యిఁకెయ్యది? చూచుటయెటు వాని? ఎందుఁబోచ్చుదు నిటుపై"

వ॥ అని-శిలమీఁదఁ దలయును దక్కనంగంబులును బగులఁగొట్టుకొని తోడ్తోడ వానిమార్గంబువట్టి కొంతవడి భ్రమించి పెద్దవాఁడగుటఁ బరిశ్రాంతుండై మరలి మఠంబునకుఁజనియె. దుశ్శీలుండు పేటికం దీసికొని స్థానాంతరంబునకుం బోయి తద్ధనంబుతో వ్యాపారంబు మొదలువెట్టి పదపడి పరిణయంబుఁజేసికొని గృహస్థాశ్రమంబునఁ గొంతకాలంబుండి సంతతిం గాంచక వృద్ధత్వంబున భార్యయుం దానును దీర్థయాత్రలుచేయుచుఁ జమత్కారపురంబునకరిగి యందలి సకలతీర్థంబులను స్నానంబుచేసి దేవాలయంబులం దిలకించుచు దైవభక్తిచే నృత్యగీతంబులొనరించు దుర్వాసుం గనుంగొని జోతవెట్టి — ౭౯౦

ఆ॥ "ఎవరునిలిపిరయ్య యీశివలింగంబు? ఏలపాడెదాడెదిచట నీవు?
ఆటపాటలెల్ల నన్యులయవి కాని తాపసులకు నిద్ది తగినపనియె" ౭౯౧

వ॥ అనియడుగుటయుం నతండిట్లనియె. — ౭౯౨

## —♦ దుర్వాసస్థాపితలింగమునకు దుశ్శీలేశ్వరసంజ్ఞ వచ్చుట ♦—

తే॥ "నేన యీశివలింగంబు నిలిపినాఁడ. తన్మహేశుఁడు నృత్యగీతప్రియుండు
అట్లుగావునఁ బాడుచు నాడుచుంటి. ఇతరకైంకర్యమున కర్థ మేదఁదెత్తు?"

వ॥ అనియిట్లు సమాధానము చెప్పె. ఇంతలోపలఁ జీర్ణకేశుండను నొక యోగవిదుండు చనుదెంచి — ౭౯౪

శ్లో॥ అసూర్యానామ తే లోకా అంధేన తమసావృతాః
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో జనాః. ౭౯౫

వ॥ అనుశ్లోకంబుఁజదివి వేదాంతికంబగు నీప్రశ్న సేయుటయు దుర్వాసుండు కూర్చుండి దానికిఁ దగినయుత్తరంబు సొసంగె. స్తుతింపఁబడిన యాసర్వంబును దెలిసికొనుటచే విశేషించి యుదయించిన శివభక్తితో దుశ్శీలుఁ డాదుర్వాసుం జూచి బ్రణమిల్లి యుచ్చైస్స్వరంబున. ౭౯౬

ఆ॥ "స్వామి! జాతిచేత బ్రాహ్మణుండను నేను. కాని కర్మమునను గాను మరల
ఇంచుకయును నెవని కిచ్చియెఱుంగను. పిడిచెఁ డన్న మేని పెట్టియెఱుఁగ. ౭౯౭
ఉ॥ ద్యూతము వేశ్య లోనయిన దుర్వ్యసనంబులఁ జిక్కి యందుకై
నీతిదూరంగి దేవధరణీసురవంచన మాచరించుచుక్
స్నీతధనంబుగూర్చితిని. శిత్యమరాన్వయజుండనయ్యు సం
ప్రీతిని శైవశిష్యుఁడఁగ నేఁబక లుండితి సేవఁజేయుచుక్. ౭౯౮
తే॥ మాయమాటలచేతఁ దన్మానసము హరించుటయె కాక బిట్టు వంచించి యాతఁ
డెంతకాలంబునుండియో సంతరించియుంచుకొన్న ధనంబు హరించినాఁడ. ౭౯౯
కం॥ ఆగురుఁడును బరలోకం బేగిన వాఁడిప్పు. డదియె యెంతయు నాకుక్
వేగ్రైపశ్చాత్తాపము తాఁగలిగించెను. మనంబు తగులంబడెడుక్. ౮౦౦
పృథ్వి॥ పురశ్చరణదానముక్ మునివరేణ్య! కావించి నక్
కరంబు కరుణింపవే. కలదు విత్త మెంతేని. ఒ
క్కరైన సుతపుత్రికల్ కలుగరైరి. ఆవిత్తముక్
స్థిరంబయిన పుణ్యపుంజెయువుగూర్చి వెచ్చించెదక్. ౮౦౧
కం॥ ఇహపరముల రెండింటను విహితం బొడగూడుపనిని వివరింపఁగదే
మహిదేవ! ఉక్తమంతయు బహుభక్తిం జేసి విగతపాపుఁడనగుదుక్." ౮౦౨
వ॥ అని వేడికొనుటయు దుర్వాసుం డిట్లనియె — ౮౦౩
తే॥ "ఆవిఁ బాపసహస్రంబు లాచరించి మగుడ ధర్మంబొనర్చెడి మానవుండు
కష్టమునకోర్చి యతికృచ్ఛ్రకారియైనఁ బూర్ణసంసారసాగరంబును దరించు. ౮౦౪
ఆ॥ ఒక్కదినమె ధర్మముజ్జగించియె శైవుఁ గోరి గురుని జేసికొంటికాన
వాఁడు గురుఁడె యగును వాస్తవంబుగనీకు. ఇంచుకయును సంశయింపవలదు.
సీ॥ బ్రహ్మచర్యంబును బట్టఁగావలయును బ్రప్రథమంబున బ్రాహ్మణుండు.
ఆవల గార్హస్థ్య మవలంబనీయంబు విబుధుఁడైనట్టి బాడబునిచేత.
అంత వానప్రస్థుఁడగుట మేలగుచేత శాంతికాముండైనశర్మునకును.
తరువాత యతియాట ధర్మ్యంబుఁబద్ధతి యన్నియుందెలిసిన యగ్రజునకు.
ఒగిఁ గుటీచకుఁడు బహూదకుండును హంస పరమహంస యగుట భావ్యమతని.
కిట్టిమార్గ మాశ్రయించినపదపడి పరమపదమునొందు బ్రాహ్మణుండు. ౮౦౬
ఆ॥ అందు బ్రాహ్మణుండవయ్యుఁ గుత్సితమైనయట్టి శైవమార్గ మనుసరించి.
తందువలనఁజేసి యత్యంతపాతకం బాచరించినాఁడవయ్య నీవు." ౮౦౭
వ॥ ఆనియిట్లు పలుకుటయు దుశ్శీలుండు వెండియు — ౮౦౮

ఆ॥ సకలవేదములను సంకీర్త్యమానుఁ డావిభుఁడు రుద్రుఁ డట్టి వేదవేద్య
దీక్ష దుష్టమనుచుఁ దెల్పెద వదియేల? మునివరేణ్య! శిష్యజనశరణ్య!" ౨౦౯
వ॥ అనియడుగుటయు దుర్వాసుం డిట్లనియె — ౨౧౦
ఉ॥ "సత్యము నీవుపల్కినది. శంకరుఁ డొక్కఁడు వేద మాత్రఁడే
స్తుత్యుఁడుగాఁడు దాన మధుసూదనుఁడుం బరికీర్త్యమానుఁ డా
దిత్యుల జ్యేష్ఠునిం గడు నుతించెడి నయ్యది. కాని బ్రాహ్మణుల్
నిత్యముఁ బూనఁగాఁదగు ననింద్యవ్రతం బది వేఱయుండెడిన్. ౨౧౧
తే॥ పరమజాప్యము గాయత్రి బ్రాహ్మణునకు. తదుపదేష్టయె గురువును. తద్విభిన్న
శైవవైష్ణవదీక్షలు సలుపువాఁడు కాఁడు బ్రాహ్మణుఁ డంగమట్కముఁ జదివిన.
ఆ॥ ఇదియుఁగాక కపటహేతువునంజేసి లింగభేదమును బొసంగె నీవు.
వ్రతమువదలి తందువలనఁ బ్రాయశ్చిత్త మించుకయును నుండ దెచటనీవు." ౨౧౩
వ॥ అనియిట్లు వచించుటయు మరల దుశ్శీలుండు — ౨౧౪
ఆ॥ "సప్తపదియటండ్రు సత్పురుషులమైత్రి. కాన నీవు నాకుఁ గలిగె మైత్రి.
మనవిచేతు నట్టిమైత్రిఁ బురస్కరించుకొని నే రవంత శ్రోత్రమిమ్ము. ౨౧౫
ఆ॥ కలదు నాకు ధనము కావలసినయంత. దాన నెద్దియేని యాసెడలను
అది వచింపుమయ్య యంతయు నొనరింపనుంటిఁగానఁ గరుణయుంచి నీవు."
వ॥ అని యభ్యర్థించుటయు వెండియు దుర్వాసుం డిట్లనియె — ౨౧౬
కం॥ "ఒకటే యుపాయమున్నది ప్రకటంబగు తావకీనపాపమువోవన్.
సుకముగ విశుద్ధియగు మామకవాక్యము ననుసరించి మంచిగఁజేయన్. ౨౧౭
తే॥ కృతయుగంబునఁ దపము యుత్కృష్టమనిరి. త్రేతలోపల ధ్యానంబు త్రిదివహేతు
వధ్వరమునన ద్వాపరమందు సుగతి. కలియుగంబున దానంబ ఫలద మరయ.
తే॥ కలియుగంబిద్ది గావునఁ గల్మషంబు లెడలఁ గృష్ణాజినంబుల నిమ్ము పొమ్ము.
గురుధనంబును వంచించి కొంటిననుచుఁ దాపపడుచుంటి వెడఁద నెంతయు మమతియు
తే॥ అందుకొఱకయి వాని యాహ్వాయము పెట్టి యొక్క శివుగుడి కట్టింపు మర్విమీఁద
దానివలననుజేసియుఁ దక్షిణంబ పొందె దానృణ్యమీవవహో భూసుపర్వ! ౨౨౧
చం॥ మఱియొకచోటఁగూడఁ బడు మంచిగ నీదుధనంబు. శిష్టభూ
సురుల కొసంగు మన్వహము. శుద్ధసువర్ణసమన్వితంబుగన్
వగతిలపాత్రదానము నవశ్యముఁజేయుము. నీదు దేహముల్
ద్రొఱఁగి సమస్తపాపములు తొఁడనపోవు-విశుద్ధి గల్గెడిన్. ౨౨౨

ఆ॥ మఱియు నిచట నేను విరచించు దేవాలయంబుఁ గూర్చి దూరమనక భక్తి
చైత్రచైత్రమునను సరిగఁ గల్పగ్రామమునకునుండి వచ్చి చనుదునేను. ౨౨౩

కం॥ కావున నేఁ గట్టించెడి దేవాలయమందు నీవు దృష్టినిబెట్టం
గావలయును-స్నానాదులు గావించుచునుండవలయుఁ గర మిచ్చోటన్" ౨౨౪

వ॥ అనియిట్లు నుడివి దేవర యెట్లు చెప్పిన నట్లు వర్తింతునని దుశ్శీలుం గాంచి మఱియు దుర్వాసుండు — ౨౨౫

ఆ॥ "అఖిలపాపములును నడఁగుఁ గృష్ణాజినదానమున. నొసంగు తప్పకీవు.
గుప్తపాపములను గూలును దిలపాత్రదానమునను జేసి తప్పకుండ" ౨౨౬

వ॥ అనిన విని జింకచర్మంబులును దిలపాత్రంబులును యథావిధి నాహితాగ్నులగు నవనీసురుల కా దుశ్శీలుఁ డన్వహము భక్తిమై నర్పించుటయుఁ బాపంబులు తొలఁగిపోయె. అట్లు గతపాపుండగు నతనికి దుర్వాసుండు నిర్వాణదంబగు దీక్షయిచ్చి గురుదక్షిణఁ గోరుటయు దుశ్శీలుం డిట్లనియె — ౨౨౭

కం॥ "అడుగుము గురుదక్షిణ ఋషియొడయఁడ! ఇచ్చెదను శక్తియుండినచో ని
ప్పుడ విత్తశాఠ్యమును నీయెడలను గావింప. ఇంక నేమనవలయున్!" ౨౨౮

వ॥ అనియిట్లు నొడువుటయు దుర్వాసుం డిట్లనియె — ౨౨౯

శా॥ "కల్పగ్రామముగూర్చి పోదునిఁక నే. కల్యాశ్రితం బీయుగం.
బల్పాక్రాంతము. కావునం గృతయుగం బాసన్నమౌ దాఁక నా
కా ల్పెట్టంబడదిందు వెండియును. ఈకట్టించు దేవాలయం
బల్పీయంబయియుండియున్న. దవశిష్టార్థంబు గట్టింపనౌ. ౨౩౦

కం॥ ఇది నాకగు గురుదక్షిణ. తదాలయముముందఱను యథాశక్తిని నీ
వు దినదినము బలిసుమములు మొదలుగ నిడి నృత్తగీతములు సేయనగున్" ౨౩౧

వ॥ అనియిట్లు వాక్రుచ్చి యమ్మునీశ్వరుండు కల్పగ్రామంబునకు వెడలిపోవుటయు దుశ్శీలుండు తదుదీరితం బంతయు నాచరించె. భక్తిపూర్వకంబుగా నిట్లు తత్కార్యంబులు నిర్వర్తించుటయుఁ దదాలయంబు దుశ్శీలసంజ్ఞితంబై తనరనయ్యె. అక్కాలంబుదీనికొని ప్రతివత్సరముఁ జైత్రమాసమునం దా దేవుని దర్శించు జనము వత్సరకృతంబగు పాపంబునుండి వదలంబడు. స్నపనాది సకలార్చనంబుల నాచరించిన ముప్పదిసంవత్సరములపాతకం బప్పుడ నశియించును. తదగ్రంబున నృత్యగీతాదికంబులు గావించువాని యాజన్మపరకాఘంబు లన్నియు నంతంబు నొందు. ముక్తి ఘటిల్లు. దుశ్శీలుం డట్లాసక్తి భక్తిమై గురుపాదపద్మంబులు

## —→ నింబేశ్వర శాకంభరుల యుత్పత్తి ←—

స్మరించుచు దక్షిణదిశ నతనిపేర నింబేశ్వరమను నొక్క శివాలయంబు గట్టించె. అట్లు శాకంభరియనంబడు తద్భార్యయుఁ దనపేరుతో దుర్గం బ్రతిష్ఠించె. అంత నాదంపతు లిరువురును నింబేశ్వర శాకంభరీదేవతల నిత్య నైవేద్యదీపారాధనాదు లకుంగా బ్రాహ్మణులకుఁ గొంతవిత్త మర్పించి తక్కుటిధనం బంతయు ధర్మార్థంబు వినియోగించి చంకలకు జోలెలు దగిలించిరి. కొంతకాలంబునకు దుశ్శీలుండు దేహంబు విడుచుటయు శాకంభరి తద్దేహంబును హవ్యవాహంబునం జేర్చి సహగ మనంబు గావించె. పదపడి యుభయులు నప్సరస్సంసేవ్యమానంబగు నాకాశ యానం బధిష్ఠించి యత్యంతసంతోషంబుతో నమరాలయంబున కరిగిరి. ఉత్త మంబగు నీ దుశ్శీలోపాఖ్యానంబు పాఠకుల కజ్ఞానకృతంబులగు నఖిలపాపంబులను హరించు. బ్రాహ్మణశ్రేష్ఠులారా! అట్లిందు మునిహితకాంక్షులై యేకాదశ రుద్రులు వసించుదురు — ౨౩౨

## —→ ఏకాదశరుద్రుల యుద్భవము ←—

సీ॥ తద్దర్శనంబునఁ బెద్దపెద్దయఘంబు లంతంబునొందు క్షితిన్యమరులార!
తన్నమస్కృతిచేత మున్నున్న దోషముల్ విలయంబునొందు నోవిప్రులార!
తత్పూజనంబున వ్యాత్పద్మ మెంతయుం గలుషవిహీనమౌ నలఘులార!
తన్నుతిక్రియనుండి ధన్యాత్ములయ్యెద రట్టిచెట్టులను మునీంద్రులార! "
అనివచింప శౌనకాదు "లొక్కఁడె రుద్రుఁ డాలకింపఁబడెడి నాగమములు
మఱి ద్వితీయరుద్రు మాటరెు విన మహాసూత! అధికపూత! సుజనపేత! ౨౩౩
ఆ॥ గౌరి భార్యగాఁగ స్కందుండు కొడుకుగా నుండియున్న రుద్రుఁ డొకఁడె మాకు
విదితుఁ డంతకన్న వేఱైనరుద్రు లెవ్వారొ చెప్పు" మనుడు వారి కతఁడు ౨౩౪
వ॥ మహాభాగులారా! మీరనునది వాస్తవంబ. ఒక్కండే రుద్రుండు. రెండవ రుద్రుఁ డేవిధంబునను లేఁడు. కాని యేకాదశరుద్రు లెట్లయిరో వాక్రుచ్చెద వినుండు తొల్లి శంసితవ్రతులై వారాణసియందుండు పదునొకొండుగురు మునులు హాటకేశ్వరదర్శనార్థం బుత్సాహంబుతోఁ బయనమై యొకరికన్న నొకరు ముందు చనవలెనను స్పర్థచేఁ బాతాళస్థ హాటకేశ్వరంబునకుఁ బోయి యందఱికంటె ముం దందలి శివుని దర్శింపనివాఁడు తక్కునందతిపాతకంబును నొక్కండ యను భవింపవలెనని సమయంబుచేసికొని యగ్గలంబు పరువులెత్తుటయు హాటకేశ్వర దేవుం డయ్యది గుర్తెఱింగి వారి భక్తికి మెచ్చుకొని తత్క్షణంబ పాతాళంబునుండి కొంతముంబగు నాబిలమార్గంబునఁ బయికి వచ్చె. ౨౩౫

సీ॥ కొనల మూడింటిచే మొనపుటగానుండు వాలును లీలఁ జెంగేలఁ దాల్చి
స్వాభావికంబైన చతుర్థ్యగముగాక డంబైన ఫాలనేత్రంబుగలిగి
గంగాన్వితంబైన ఘనజటాజూటంబు లలి ఖండశశిచే నలంకరించి
అడుగులదాఁక వ్రేలాడ నీలగ్రీవఁ దలకాయపుత్తిల దండవైచి
ఎంతో యందమగను నేకాదశప్రకారంబులై మునీశ్వరప్రకాండు
లందఱికినొసంగె నాత్మీయదర్శనం బేక కాలమం దిఁ కేమిగలదు? ౨౩౬

వ॥ అంత నమ్మును లందఱును దమముందఱ సాక్షాత్కరించియున్న వృషభధ్వజు
విలోకించి మోకాళ్ళమీఁద నిల్వఁబడి — ౨౩౭

కం॥ "నతి సర్వదేవమయునకు. నతి శ్రీదేవాధిదేవునకు శాంతునకున్
నతి నూత్నకళేబరునకు, నతి యంధకమర్దనునకు, నతి రుద్రునకున్. ౨౩౮

కం॥ జోత పృథగ్విధవాయువ్రాతముచే సర్వజగము బ్రదికించుచు సం
ప్రీతి సదా దివమందున స్థాతలయి చెలంగునట్టి తద్రుద్రులకున్. ౨౩౯

కం॥ దండము పశ్చిమదిక్కున నుండి పిశాచములబారినుండి జగంబుల్
నిండుకృపం బాలించెడి రుండస్రగ్ధారులైన రుద్రులకెల్లన్. ౨౪౦

కం॥ కేలుమోడ్చు భూతజాలంబునుండి లోకములనెల్ల నిండుకరుణతోడ
మనుచు చూర్ధ్వమంద యనయంబు వర్తించు రుద్రులకును గలితభద్రులకును.

కం॥ జోహారు భూతలంబున మోహితమతులైన ప్రజలఁ బ్రోచుచునెపుడున్
స్నేహముననుండు ప్రకటితమాహాత్మ్యుల కలఘుకాంతిమద్రుద్రులకున్" ౨౪౨

వ॥ అనిస్తుతించుటయు భక్తినమ్రులైన యాతాపసులం గని యేకాదశరుద్రు లిట్లనిరి-

తే॥ "పదునొకండువిధంబులం బరఁగు నేను దాపసోత్తములార! ఎంతయును యుష్మ
దీయభక్తికి మెచ్చితి. వే యభీష్టవరము కోరుఁ డొసంగెదఁ గరుణతోడ." ౨౪౪

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు నమ్మునీంద్రులు — ౨౪౫

తే॥ "తుష్టిఁజెందితివేని మాయిష్టవరము నిచ్చుటకు సిద్ధముంటివే నీశ! యిచట
పదునొకండువిధంబులం బరఁగుచును వసింపు మెల్లప్పుడేని యాచింపవలయు!

ఆ॥ అఖిలతీర్థమయము హాటకేశ్వర మెన్న. అట్టిక్షేత్రమధ్యమందు మేము
సర్వదా వసించి సాంబ! నీయారాధనం బొనర్చెదము ఘనంబుగాను" ౨౪౬

వ॥ అనియిట్లు వేడుకొనుటయు భగవానుండిట్లనియె — ౨౪౭

ఆ॥ "ఏధరించినట్టి యేకాదశాకారములను నెపుడు నిచట లలి వసింతు.
మొట్టమొదటి నాదుమూర్తి కైలాసభూధ్రమున నుండు సర్వదా సుశోభ. ౨౪౮

ఆ॥ యుష్మదీయమైన యూరునామములతోడ నీమదీయమూర్తు లిచటనుండు
పరమపదముగలుగు భక్తి విశ్వామిత్రు హ్రదమునందుఁ గ్రుంకి యవి భజింప.

కం॥ వేయేల విప్రులారా! ఆయేకాదశనువిగ్రహములకు భక్తిన్
జేయఁబడుపూజ యగుఁబో వే యేకాదశగుణంబు విఖ్యాతముగన్. ౨౫౧

వ॥ అనియిట్లు పలికి మున్కంటి యక్కడనే యంతర్ధానంబునుబొందె. నమ్మును లును నచ్చోటనే యాశ్రమంబు లేర్పఱచుకొని యత్యంతశ్రద్ధ నద్యేకాదశ మూర్తుల నారాధించి యపవర్గంబుగాంచిరి. ఇతరులైనను శ్రద్ధమైఁ దన్మూర్తుల భజించిన మహేశ్వరుండు పరమస్థానంబు ప్రాప్తింపఁజేసెడి. ఏకాదశరుద్రు లదిమొదలుకొని యేర్పడిరి. చైత్రశుద్ధచతుర్దశీతిథిం దద్రుద్రులను భక్తిశ్రద్ధా సమన్వితంబుగా భజియించువాఁడు పరమపదంబు పడయఁగలిగెడి" ౧౫౨

—♦ ఏకాదశరుద్రులదగ్గఱఁ జేయవలసిన దానములు ♦—

ఆ॥ అనివచించుటయును "నార్య! వారాణసినుండివచ్చియున్న యోగివరుల ఆఖ్యలెవ్వోచెప్పు" మనివేఁడుటయును నాబుషులఁగాంచి సూతుఁ డిట్టులనియె.

వ॥ "వారు పదునొకండుగురును మృగవ్యాధ సర్వసంజ్ఞ నిందిత మహాయశో జైకపా దహిర్బుధ్న్య పినాకి పరంతప దహ నేశ్వర కపాలిసంజ్ఞలం జెలువారుదురు. రుద్రులును నవియె పేర్కం బ్రసిద్ధికివచ్చిరి" ౧౫౮

చ॥ అనియిటుపల్క శౌనకముఖావనిదేవులు రోమహర్షణిక్
కనుగొని "పూర్వ మీవు జపకర్మ మెటుల్పొనరింపనౌనొ చ
క్కనుడివి. తిప్డు రుద్రులకుఁగా నెవి యీవలెనో వచింపు" మం
చనుటయుం నమ్మునీంద్రులకు మార్గముతోడుత నాతఁ డిట్లనుక్. ౧౫౫

వ॥ "వారి నుద్దేశించి యొక్కొక్కరికి వేలువేలుగా గోదానంబులు చేయవలయును. మృగవ్యాధునకు గుడధేనువును గపాలికి నవనీతధేనువును నజైకపాదున కాజ్య ధేనువును నహిర్బుధ్న్యునకు సువర్ణధేనువును బినాకికి లవణధేనువును బరంతపు నకు రసధేనువును దహనున కన్నధేనువును నీశ్వరునకు జలధేనువును నీయవల యును. ఈధేనువుల నీమహాత్ముల కిచ్చువాఁడు నిశ్చయంబుగాఁ జక్రవర్తి యగునని పితామహుండు వచియించె. ఇతరత్ర యీఁబడు ధేనువులే యిట్టి ఫలంబు నొసంగ నీశ్వర సాన్నిధ్యంబునఁ జేయఁబడువానిసంగతి యేమి చెప్ప వలయును? కావున విశ్వప్రయత్నములు చేసియైనను నీగోవుల నొసంగునది. శక్తివిహీనుఁడు రుద్రు లందఱికిని భర్తృయజ్ఞోక్త ప్రకారము ప్రయత్నించి యైనను నొక్కగోదానము కావించునది. బ్రాహ్మణులారా! హాటకేశ్వర క్షేత్రంబున యాజ్ఞవల్క్యప్రతిష్ఠితులైన ద్వాదశాదిత్యులకు భక్తిమైఁ బ్రతి సప్తమిం బూజించువారు నిస్సంశయంబుగా వాంఛితంబులం బడయం గలుగు దురు." ౧౫౬

## —♦ యాజ్ఞవల్క్యవృత్తాంతము ♦—

క॥ అనియిటు వచియించుటయును వినివా" రాదిత్యుఁ డొకఁడె వియదధ్వమునఁ గ
నఁబడుచుండెడి నెపుడమ్మౌని పండ్రెండుగుర నెట్లు మను స్థాపించెఁ ? ౨౫౭

క॥ ఉద్దేశమతేకుండనె యొద్దియుఁ జేయంగఁబడమి నెందులకై ప
న్నిద్దఱ స్థాపించినవాఁ? డద్దిర! ఆకాల మెద్ది" అని యడుగుటయుఁ ౨౫౮

వ॥ "తొల్లి శునశ్శేపుండను మునిసత్తమునకుఁ గృతియను సుతుం డుదయించె. అతనిపుత్రుండు శునఃపుత్రుండు. అతనికిఁ జారాయణుండు పుట్టె. పెద్దకాలంబునకు లోకపితామహుండగు బ్రహ్మ సావిత్రీశాపవశంబున నా చారాయణునకు జన్మించె. చతుర్ముఖుండు యజ్ఞంబు సేయ సమకట్టి పెండ్లమగు సావిత్రి వేళకు రామికిం గినిసి ౨౫౯

క॥ "శాలాప్రవేశసముచితకాలాత్యయ మించుకేని కాకుండఁగనే
మేలైన యనుద్వాహితబాలికఁ గొనితె మ్మొకర్తఁ బనివిని మఘవా!" ౨౬౦

వ॥ అని యింద్రున కాజ్ఞయిచ్చుటయు నతండు సర్వలక్షణలక్షితయగు నొక గోప
కన్యకను గోవక్త్రంబునుండి గుహ్యమార్గంబునం దీసి పవిత్రఁగావించె. ౨౬౧

ఆ॥ "గోవులయును భూమిదేవులయును గులం బొకడె ద్విప్రకారమొందె జగతి.
మంత్రిసమితియొకట మతియొక్కచో హవిర్వితతి యుండి బిట్టు వెలయుచుండె"

వ॥ కావున నాయమను బ్రాహ్మణిం గావించి పదంపడి పితామహుండు గృహ్యోక్త విధానంబునం బరిగ్రహించె. ఆవిడ పత్నీశాలం బ్రవేశించి రశనాసమలంకృతయై వర్తించుచుండుటయు దేవతాస్త్రీసమేతయై యరుదెంచిన సావిత్రి విలోకించి ౨౬౩

శా॥ "తాతా! తప్పొకయింతలేని నను సంత్యాగంబు కావించినా.
వేతద్ధేతువునుండి తాతగనె ని న్నెంతు సంగంబునం.
దీతీర్పం డ్లమమీఁది పెండ్లమునకై యెల్లప్పుడుఁ మర్త్యలో
పీతిం జేతురు కానఁ బుట్టు చని ధాత్రిన్ నీవు మర్త్యుండవై. ౨౬౪

ఆ॥ మనుజుఁడుగ జనించి మతిమతి కామార్తి యనుభవించుచుండు మచటనీవు.
న్యాయయుక్తమైన నామాట తప్పక జరిగితీరు లేదు సంశయంబు" ౨౬౫

వ॥ అని శపియించి యజ్ఞమండపంబునుండి పోయి పర్వతశిఖరం బధిరోహించి తపంబు గావించె. బ్రహ్మ యివ్విధంబున భూమియం దవతరించినవాఁడు. అట్లవతరించి యాజ్ఞవల్క్యుండను పేరం బరంగుచు యౌవనవంతుఁడగుటయుఁ గాకు ముత్రి

కించి యతని బిట్టు బాధింపఁగడంగె. తానును రూపవంతుఁడగుటఁ దద్గర్వాతిరేకంబునఁ గనఁబడిన సుందరినెల్లం గలయుచు స్త్రీవ్యసనంబునం జిక్కియుండుటయుఁ దండ్రియగు చారాయణుం డతని స్వాశ్రయంబునుండి వెళ్ళఁగొట్టె. అట్లు జనకునిచే విసర్జింపఁబడి యందందు భ్రమించుచుం బోయిపోయి చమత్కారపురంబున వేదంబులు వెళ్ళఁజదివి శిష్యసహస్రంబులకుఁ బ్రచారంబు సేయుచున్న శాకల్యనామక బ్రాహ్మణశార్దూలు దగ్గఱి పేరెలుంగున నమస్కారంబు నివేదించి శిష్యుఁడై చిరంబు వేదాధ్యయనమొనర్చుచుండుటయు నానక్త దేశాధిపతి జలశాయియగు చక్రపాణి సాన్నిధ్యంబునఁ జాతుర్మాస్యవ్రతంబుఁ జరించుచు

ఆ॥ "ఈపురంబునందు నేనుండుపర్యంత మనుదినంబు నస్మదాలయమున
కేగుదెంచి కరుణ నీవు శాంతికపౌష్టికము లొనర్చుచుండు క్ష్మానిలింప!"

వ॥ అని శాకల్యుఁ బ్రార్థింప నతండు వల్లెయని దినమున కొక్కనిచొప్పున శిష్యులఁ దన్మందిరమున కనుపుచు వచ్చె. వారు చని శాంతికంబు నిర్వర్తించి రాజు నాశీర్వచించి యతనివలన దక్షిణవడసి యది తెచ్చి గురునకిచ్చి తిరిగి స్వగృహంబులకుం జనుచుండెడివారు. నిత్యము నిది వ్యవహారము. అవ్వరుస నొకనాఁడు యాజ్ఞవల్క్యువంతు వచ్చినది. అమ్మహీశునకు మంధరయను నొక్క విలాసిని. అది యగ్గలము రూపవతి. అక్కామినిని గామార్తుఁడగు యాజ్ఞవల్క్యుండు కామించి రాత్రిలు రతికిం జనుచుండెడివాఁడు. అది వాత్స్యాయనోక్తప్రకారంబుగా నాలింగనపూర్వకంబులగు ననేకభావంబులఁ గనఁబఱచుచు మయూరపదకాదులచేతను మణిప్రవాళకంబులచేతను శరీరాధరంబుల నఖదంతక్షతంబు లొనరించుచును నతని సుఖపెట్టెడిది. రాతిరెల్ల నట్లు రమించి ప్రాతఃకాలంబున నధ్యయనార్థం బరుదెంచిన యయ్యాజ్ఞవల్క్యు శాంతికంబు నిర్వర్తించి వచ్చుటకుఁగా క్ష్మాపాలసదనంబునకు శాకల్యుండు పంపుటయు నతండు పోయి యథోక్తవిధి నంతయు నాచరించి యవసానంబునఁ బంచరుద్రంబులచే మంత్రించి సాక్షతంబును సపుష్పంబును నగు కలశోదకంబుం గైకొని వ్రతస్థుఁడగు సానర్తపాలికింజని ఛందఋషిసహితంబగు ద్యామాలేఖియను మంత్రంబు విధిపూర్వకంబుగా నుచ్చరించి శిరంబునం జల్లఁబోవుటయు నతం డతని శరీరమందలి నఖదంతక్షతంబుల విలోకించి దురభిప్రాయపూరితుండై మలినాంబరధారియగు నతని విటప్రాయునిగా భావించి పక్కన నవ్వి ౧౬౪

కం॥ "గుఱ్ఱాలచావడింగల కఱ్ఱపయింబోయి పోయి కాదన కీవి
ఎఱ్ఱనినీ క్లోబా పఁడ! మఱ్ఱివలెను వృద్ధిఁజెందు మతి యది సరవిన్" ౧౬౫

వ॥ అనిపలుకుటయు యాజ్ఞవల్క్యుఁ డత్యాగ్రహంబుమై నట్ల యాచరించి యగృహీతదక్షిణుండై యాత్మావాసంబునకరిగె. అంత నాయజ్ఞశాలలోని స్తంభంబు పలువిధంబులగు పల్లవంబులతోడను గొమ్మలతోడను నలంకృతంబయ్యె. అది యవలోకించి యానర్తాధిపతి యాశ్చర్యపడి యగ్గలంబు పశ్చాత్తాపంబున- ౨౭౦

"శా॥ ఛీ! నేఁజేసినకార్య మారయఁ గడుం జింత్యంబగుంగాదె ? అ
న్యాయం బీతని మంత్రిసత్త. ఎవరో యొక్కదితేయుం డిటుల్
తా నుర్వీసురవేషధారియగుచున్ ధాత్రిన్ దిగంబోలు. అ
య్యో! నేనీతనిమంత్రివారిఁ గొనుచో నున్నే జరామృత్యువుల్ ?" ౨౭౧

వ॥ అనిచింతించుచు నత్యాశ్చర్యంబుతో నాదినం బాపార్థివుఁ డబ్దశతోపమానమ్ముగా వెళ్ళించె. ఎట్లెట్లో పవలు గడపినను రాత్రిగడపుట మఱింతకష్టంబయ్యె. అంతఁ బ్రొద్దుపొడుపునలేచి యమ్మహీపతి యాప్తులైన పురుషుల ద్వారంబున శాకల్యుఁ బిలువంబంచి సాదరంబుగా నంజలిచేసి వినయంబు గనఁబఱచుచు ౨౭౨

క॥ "నిన్నటిశాంతిక్రియ జరుప న్నీ వెవ్వాని నిటకుఁ బంపితొ నేఁడున్
క్రన్నన నతనినె పంపుము. ఉన్నదిపని. కరము భక్తియొదవె నతనిపై" ౨౭౩

వ॥ అనివిన్నవించుటయు నతండు వల్లెయని తనయింటికింబోయి యాజ్ఞవల్క్యుం బిలిచి మృదుమధురవచనంబుల నిట్లనియె. ౨౭౪

తే॥ "ఈదినంబునఁగూడ మహీశునింటి శాంతికంబును గావింపఁ జనుముపుత్ర!
ఉన్నవారందఱుండఁగా నిన్నె యతఁడు పంపుమనె. ఐతి వభిమానభాజనమవు"

వ॥ అనివిని యాజ్ఞవల్క్యుండు ౨౭౬

ఆ॥ "శాంతికంబుజరుపఁ జనఁ దద్గృహంబున. కాదరింపఁడయ్యె నతఁడు నన్ను.
మామకీనమైనమంత్రాంబువుల్గూన కొక్క కొయ్యమీఁద నుంచుకునియె. ౨౭౭

క॥ కావున నానర్తేశునిభావము రంజింపఁజేయఁ బ్రజ్ఞగలండో
తావకశిష్యు మఱొక్కని జ్యావిబుధవరేణ్య! సరవి ననుపఁగదయ్యా" ౨౭౮

వ॥ అనవుడు శాకల్యుండిట్లనియె. ౨౭౯

క॥ "యోగక్షేమము లరయుచు బాగుపఱచు ప్రభువునాజ్ఞ ప్రజ కగుఁ గార్యం.
బేగుణహీనుం డాతని కొఁ గంటకుఁ డాతఁ డెట్లు నందఁడు సుఖమున్. ౨౮౦

క॥ కులమున నధికుఁడననియో యలఘుకలాఢ్యుండననియొ యతిగర్వముతో
ఇల రాజు నుపాసింపని ఖలునకుఁ బాచితము భిక్షుకత మనుదాఁకన్" ౨౮౧

వ॥ అనియిట్లు గురుశిష్యు లిరువురును వివాదపడుచుండ మహీశు పనుపున మఱి కొందఱు వచ్చి త్వరపడుచు శాకల్యునకుఁ జేతులుజోడించి "అయ్యా! రాజు

దారులుచూచుచున్నాఁడుగాన శిష్యుని త్వరితంబుగం బనుపుఁడని విన్నవించిరి. ఎన్నిపరులు చెప్పినను యాజ్ఞవల్క్యుండు శాంతికంబుగావించుటకుఁ జనమిని విధేయుఁడై దోసిలొగ్గి నిలువంబడియున్న యుద్దాలకు నొద్దకుఁజేరి శాకల్యుండు

ఆ॥ "చనుమువత్స! వేగ శాంతికంబునొనర్ప నృపతిమందిరమున కిపుడునీవు.
అస్మదీయమైన యానతి స్వాధ్యాయపఠనముంబొనర్ప బాగుగాను" ౧౮౩

వ॥ అనియాదేశించుటయు నతండు వల్లెయని రాజమందిరంబునకుం బోయి శాస్త్రోక్త ప్రకారంబుగా శాంతికంబు నిర్వర్తించి సాక్షతంబును సపుష్పంబును నగు కల శోదకంబుం గైకొని భూపాలు డగ్గఱి నతండు ౧౮౪

క॥ "నీమంత్రమహిమఁజాతము భూమిసురా! అగ్రమంచుఁ బొలుపారెడియు
ద్దామ స్తంభముమీఁదను క్షేమముపొంటెక్క జలంబు చిమ్ముంగదవే" ౧౮౫

వ॥ అని యానతిచ్చుటయు నతండు మంత్రిం బుచ్చరించి కాష్ఠంబున కభిషేకించి వెళ్ళిపోయె. యథాపూర్వంబుగ నేయున్న యాకంబంబు వానర్తమహీశుం డవలోకించి సవిషాదంబుగం బశ్చాత్తాపపడుచుఁ దిరిగియు యాజ్ఞవల్క్య నిమిత్తము శాకల్యునింటికి శేర్వరియగు మఱియొకదూతం బంపుచు. ౧౮౬

తే॥ "జాడ్యమునఁ బీడ్యమానుండ. శాంతిఁజేయ నెన్నఁబంపిన నీశిష్యుఁ గ్రిన్నఁబంపు మతని కవమతిఁజేసితి నకట! నేను. తత్కృతాశీస్సు గొననైతి. దానఁజేసి

కం॥ హెచ్చెను జాడ్యం. బాతఁడు వచ్చిన స్వాస్థ్యంబుగలుగు వసుధాదేవా!
చెచ్చెర నాద్విజబాలునె పుచ్చుము నాభవనమునకు బోధించి యెటో" ౧౮౮

వ॥ అనిచెప్పుటయు నరుగు మరుగుమని యనేకవారంబులు శాకల్యుండు శాసించియు యాజ్ఞవల్క్యుం డేగమిని మధుకుండను మఱియొక శిష్యుం బంపించె. అతండును నుద్దాలకువిధంబున నుర్వీశున కాశీర్వాదమిచ్చి యా స్తంభంబున కభిషేకక్రియ నెఱవేర్పఁగాని యయ్యది యథాపూర్వంబుగనే యగపడియె. మహీపతి మగుడ నొకమానిసిని యాజ్ఞవల్క్యుకొఱ కనుపుటయు నతం డనే కథా గురునిచేఁ బ్రబోధింపఁబడియు నరుగండు. అంత శాకల్యుండు గుణవంతుండును భాగవిత్తియు నగు ప్రచూడుండను మఱియొకశిష్యుం బంపుటయు నతండును బోయి మున్నుచన్న యిరువురుంబోలె శాంతికంబు నిర్వర్తించి తజ్జలంబు స్తంభంబుపై సమంత్రకంబుగాఁ జల్లెనుగాని యది యెప్పటియట్ల నిలిచియుండె. పదంపడి పశ్చాత్తాపయుతుండగు ప్రభుండు స్వయంబుగనె బయలువెడలి యాజ్ఞవల్క్యునిచే మంత్రింపించుకొనుటకు శాకల్యసదనంబుం బ్రవేశించి యతనికి నతియొనర్చి ౧౮౯

క॥ "నాయింటిశాంతికంబున కోయార్యా! మున్ను వచ్చియుండిన శిష్యుల్
వే యనుపుమయ్య మామక కాయం బారోగ్యయుతము కా దగుతోడన్"
వ॥ అనిప్రార్థించుటయు శాకల్యుండు రాజు వినుచుండ యాజ్ఞవల్క్యుం గనుంగొని
ఆ॥ "యాజ్ఞవల్క్య! పుత్రి! అనర్తునింటికి శీఘ్రమేగు. మేను జెప్పినాడ.
శాంతికంబొనర్చు చని యాన్నపాలుండు శాంత రోగుడగుచు సౌఖ్యమంద."
వ॥ అని యాదేశించుటయు నతం డిట్లనియె. ౯౩
క॥ "నే నచ్చటి కేగ గురూ! కాన ననుంగూర్చి చెప్పగడగకుడీక. ఈ
మానవనాథుడు న న్నవమానించినవాడు రాజ్యమత్తుండగుచున్" ౯౪
వ॥ అనినవిని యతండు కోపగించుకొని భర్త్సించుచు యాజ్ఞవల్క్యునితో నిట్లనియె.
ఆ॥ "ఒక్కయక్కరంబె యొసగనీ. అవ్వాని యప్పుడీర దెంతయర్థమిడిన.
శాకడం బతించి నామాటవినవైతి గాన శాపమీయగలను నీకు" ౯౫
వ॥ అని యిట్లు వక్కాణించుటయు యాజ్ఞవల్క్యుండు ౯౬
ఆ॥ "న్యాయపథముమీడి నను శపియించుచుచో నిను శపించువాడ నేనుగూడ
గర్వభరమునూని కార్య మకార్యంబు తెలియగనట్టిగురుడ ద్యజింపవలయు ౯౭
క॥ కోఱమాలిన పనులన్నియుం బురపుర కావింపుమనుచుం బోరాడుటచే
గురుడవుగావీక శాకీ. వరిగెద నినువిడిచి యెచటికైనను నిపుడే ౯౯
ఆ॥ ఉన్న శిష్యులందు ఒక్కొక్క రొకదినం బొజ్జయాజ్ఞలోన నుండవలయు.
ఈవు చెప్పుమనిని నావంతు నాడు నే జేతు. లేనిచో ద్యజించిపోదు" ౧౦౦
వ॥ అనిధిక్కరించుటయు శాకల్యుం డిట్లనియె. ౧౦౧
చం॥ "మఱియొకచోటి కేగుటకు మానసమందు దలంచెదేని ముం
దఱ మదుదీరితంబులగు నాలుగు వేదము లంగము ల్బహు
త్వరితమ నావి నాకొసగి తర్లు మనంతర మేడకేనియున్.
గురునకు బంగనామమిడుకూళవు నీ విక నేటి కిచ్చుటన్? ౧౦౨
ఆ॥ శ్రీపుమిప్పుడనీవు తక్షణికామండమంత్రితాంబువులను మాన కిత్తు.
క్రిన్న దన్మహత్త గ్రక్కుదు కడుపులోనున్న నాదువిద్య లన్ని కూడ"
వ॥ అనియిట్లు వాక్రుచ్చి యతం డాథర్వణమంత్రంబులచే జలం బభిమంత్రించి
యాజ్ఞవల్క్యునకు గ్రక్కబోయుటయు నతం డయ్యుదకంబు ద్రావి యన్నం
బుతోగూడ విద్యల నన్నింటిని వెళ్ళగ్రక్కి మూఢీభవించిన చిత్తంబుతో
విశ్వామిత్రహ్రదంబున కరిగి యట స్నాతుండై శుచియై యచంచలభక్తి నాదిత్య
విగ్రహాంబులం బండ్రెండింటిం బ్రతిష్ఠించి పరిపూజించె. ౧౦౪

## —♦ ద్వాదశాదిత్యుల యుత్పత్తి ♦—

సీ. ధాతయన్ పేరునఁ దనరెడిఁ బ్రథముండు. మిత్రుఁ డర్యముఁ డటు మీఁదివారు.
శక్రాహ్వయుండు దా సరిగ నాలవవాఁడు. వరుణాంశులు తరువాతివారు.
భగసంజ్ఞితుండు సప్తముఁడు. వివస్వంతుఁ డష్టముం. డవతలియతఁడు పూష.
దశముండు సవితయా. త్వష్ట యావలివాఁడు. విష్ణునామకుఁ డటు వెనుకవాఁడు.
ఇట్లు పండ్రెండువిధముల యినుల నిలిపి గంధపుష్పాదికంబులం గరముభక్తి
ఓలిభజియించుటయుఁ బెద్దకాలమునకుఁ గట్టెదుటనిల్చి యారవి యిట్టులనియె.

ఆ॥ "యాజ్ఞవల్క్య! యుష్మద్దర్శనమునఁ జేసి యగ్గలంపుఁ బ్రీతియయ్యె నాకు.
ఎదియొ భవదభీష్ట మిచ్చెదఁ జెప్పుకొ మ్మించుకేని సంశయింపకుండ" ౯౦౬

వ॥ అనియిట్లుపలుకుటయు యాజ్ఞవల్క్యుండు ౯౦౭

కం॥ "గ్రహనాథ! నాపయి ననుగ్రహ ముద్భవమైనయెడలఁ గాదన కిపుడే
రహి నధ్యయనము సేయింపు హితాధ్యాపకుఁడవగుచుఁ బుత్రున కటులన్"

వ॥ అని కోరుకొనుటయు నాదిత్యుండిట్లనియె. ౯౦౯

ఆ॥ "చక్రవాళశిఖరిసందర్శనార్థ మే ననుదినంబు మేరువును బ్రదక్షి
ణింపవలయుఁగాన నీచేతఁ జేయించు టెట్లు వేదపాఠ మేను విప్ర! ౯౧౦

ఉ॥ కావున నాదు తేజమున గ్రక్కున భస్మముగాకయుండున
ట్లీవు మదశ్వకర్ణమున నెంతయు సూక్ష్మపుటాకృతిన్ మహీ
దేవ! వసించుచుం జదువు తిన్నగ వేదము శాస్త్రమాదిగా.
నేవచియించుమాట విని యాక్రియమాణము కట్టిపెట్టకన్" ౯౧౧

వ॥ అనియిట్లు సెలవిచ్చుటయు యాజ్ఞవల్క్యుండు వల్లెయని యశ్వకర్ణంబునం బ్రవే
శించి సాంగోపాంగంబుగను సపరిశిష్టంబుగను జతుర్వేదంబులం దన్ముఖంబునఁ
జదువుకొని సమాప్తంబుగా గురుదక్షిణఁ గోరుమన నాదిత్యుండు ౯౧౨

సీ॥ మొదటిదౌ ఋగ్వేదమున నున్నయటువంటి సూర్యసంబంధి సత్సూక్తములను
రెండవదౌ యజుర్వేదంబులోపల గ్రాలుచుండెడి పావనంబులను
మూడవదిగ బుధు లాడుచుండినయట్టి చారుతరంబైన సామములను
నాలవామ్నాయంబునం దేజరిల్లుచు నురుతరంబైన కల్పోక్తములను

సలిపివ్యాఖ్యానములను బ్రచారమునకుఁ దేవలయునీవు భూమిలో ధీసమేత !
అస్మదగ్రంబునను వాని నన్నిటిని బఠించుద్విజులెల్ల స్వర్గంబుఁ గాంచఁగలరు.
తే॥ మఱియు నామీఁదిభక్తి ధీమంతులగుచు వానికిని వ్యాఖ్యలిఖియించి వసుధపైఁ బ్ర
చారముంజేయువారలు సత్వరముగ ముక్తులగుదురు-నిజము మదుక్తమెల్ల" ౯౧౪
వ॥ అనివచించుటయు వట్టిగురుదక్షిణ నూర్యున కర్పించి మగుడఁ జమత్కారపురం
బునకరిగి శాకల్యు సమీపించి ౯౧౫
కం॥ "ధరణీసురవర! తొల్లిటిగురుఁడవు నాకీవు గానఁ గోరుకొనఁగదే
గురుదక్షిణ యర్పించెద నఱమరలేకుండ నెద్దియైనను భక్తిజ. ౯౧౬
ఆ॥ చదువుచెప్పినతఁడు జనకుండు జననియు నగ్రజుఁడు విరుద్ధులైనను బ
రిత్యజింపఁదగదు-స్తుత్యులు వారు. పూజించుచుండవలయు నెంచివారి. ౯౧౭
కం॥ సాంగోపాంగంబుగఁ జదువంగలిగితి వేదములను. వానికి నర్థం
బుంగూడఁ జెప్ప నేరిచితిం. గురుదక్షిణయు నిత్తు. తెలుపుము కోర్కెన్." ౯౧౮
వ॥ అని మనవిచేయుటయు శాకల్యుండిట్లనియె. ౯౧౯
ఆ॥ "ద్వాదశాత్మకథితవేదరహస్యముల్ పాపనాశకములు పఠనఁజేతు.
కానఁ జెప్పుమయ్య వాని నన్నింటినాకు. గురుదక్షిణగను గోరుకొంటి" ౯౨౦
వ॥ అనియిట్లు కోరుకొనుటయు యాజ్ఞవల్క్యుండు ౯౨౧
ఆ॥ "అయిన నరుగుడెంచు మస్మత్ప్రతిష్ఠితాదిత్యసవిధమునకు ద్విజవరేణ్య!
తన్మహాత్ములైన ద్వాదశాదిత్యుల యగ్రమున వచింతు నేఁ గ్రమముగ" ౯౨౨
వ॥ అనిపలికి సబ్రాహ్మణశిష్యుండగు శాకల్యు స్వప్రతిష్ఠితాదిత్యసాన్నిధ్యంబునకుఁ
దోడ్కొనిపోయి తదగ్రమం దతనికిఁ దనకు రవిచెప్పిన సకలవేదాంతవ్యా
ఖ్యానంబులును వక్కాణించె. అట్లుచెప్పఁబడిన వేదాంతంబు లవగతంబుచేసి
కొని చతుశ్చరణసంభవులైన బ్రాహ్మణులు యాజ్ఞవల్క్య సంతోషపెట్టుచు
ఆ॥ అనఘ! నీదుకరుణ నవగతవేదవేదాంతులైనవార మందఱమును.
కోరుకొనఁగదయ్య గురుదక్షిణను సమర్పింపఁగలము నీకుఁ బ్రియముతోడ" ౯౨౫
వ॥ అని వారుప్రచ్చుటయు యాజ్ఞవల్క్యం డిట్లనియె.
ఆ॥ "అస్మదీయమైనయట్టి యీపండ్రెండుసవితృవిగ్రహముల సమ్ముఖమున
వేదముల్పఠించు విప్రాళి మా దయ స్వర్గమునకుఁ బ్రీతిఁ జనును గాక. ౯౨౬
కం॥ బ్రహ్మవిచారణఁజేసెడిబ్రాహ్మణులకు జననమరణవర్జితమౌ త

ద్బ్రహ్మపద మొదవుఁగా శ్రీబ్రాహ్మణ్యా! లాసంగుఁ డిడియె బలుదక్షిణగన్. ”
వ॥ అనియిట్లు కోరుటయు బ్రాహ్మణులు ౧౧౮
శా॥ “ కలికాలంబున దోష్యభావసహితు లాకాంక్షోదుదుక్కీసురుల్.
సలుపంజాలరు శ్రద్ధతోడ నెపుడున్ స్వాధ్యాయపాఠంబు వా.
రల వ్యాఖ్యానము లేమిచూడఁగలరిం ? కష్టాట వాక్యప్రవ్య మం
దలి సారంబును దోష్యయుక్తులయియుం దా రెట్లు కీర్తింపఁగన్ ” ౧౧౯
వ॥ అనివచించుటయు వెండియు యాజ్ఞవల్క్యుండిట్లనియె. ౧౨౦
ఆ॥ “ అర్ధలక్షణాఖ్యమగురథం యుంజంతి యనెడిప్రథమసూక్త మన్వథమున
త్రిష్టుభాఖ్యమగుచు దీపించునటువంటి యాద్యమైనసూక్త మదెవిధమున ౧౨౧
క॥ చిత్రందేవానామను మిత్రప్రీతికరమగుచు మిగిలెడిసూక్తం
బా త్ర్యంగప్రియము పవిత్రంబగు హంసయనెడి పృథుసూక్తంబున్ ౧౨౨
ఆ॥ పావమానమనఁగఁ బ్రథితమౌ సూక్తంబు భక్తియుక్తులగుచుఁ బరమశ్రద్ధ
బహ్వృచుల్పఠింపఁ బరమపదమునకుం బోవఁగలరు భూమిదేవులార ! ౧౨౩
ఆ॥ ఇనహితంబులైన యేకవింశతిసామములను శుచిత సామగులు పఠింప
మిత్రమండలంబు మెల్లన భేదించి యేగఁగలరు. చెప్ప నేమిగలదు ? ౧౨౪
క॥ తురికాసంపుటమును భాస్కరకల్పం బట్లు శాంతికల్పముగూడన్
పరికీర్తించినఁ గలిగెడిఁ బరమపదం బల యధర్వపాఠకతతికిన్. ౧౨౫
ఆ॥ అజ్ఞాతేని వచ్చి యర్కవాసరమున బిట్టుశ్రద్ధ జోత వెట్టిరేని
సప్తరాత్రికిల్బిషముసుండి విడువంగఁబడఁగలారుచూరె పాఱులార ! ” ౧౨౬

## —◆ రత్నాదిత్యుని యుత్పత్తి ◆—

వ॥ అని యిట్లువచించుటయుఁ జతుశ్చరణబ్రాహ్మణు లందుల కంగీకరించిరి. యాజ్ఞవల్క్యుఁ డిట్లు ఖ్యాతింగాంచుటయు జనకుండు చనుదెంచి సర్వవేదాంతములును శ్రవణించె. రత్నాహ్వయుండగు రాజొకఁడు వచ్చి యాదిత్యమాహాత్మ్యం బవగతంబుచేసికొనినవాఁడై తనపేర నొక యాదిత్యుని సంస్థాపించె. అయ్యాదిత్యుఁ గూడ నాదిత్యవారంబున దర్శించిన సప్తరాత్రికృతపాతకంబు సంక్షయం బయ్యెడి. ఈయాదిత్యమాహాత్మ్యము విన్నవాని కశ్వమేధఫలంబు ప్రాప్తించు. సంక్రాంతినాఁ డయ్యాదిత్యవిగ్రహం బిచ్చియు మాహాత్మ్యమును వినియు నశ్వమేధ

## —◆ పురాణశ్రవణమాహాత్మ్యము ◆—

యాగఫలంబు పొందుదురు. ఈపురాణమంతయుం దొల్లి బ్రహ్మపుత్రుఁడైన భృగువునకు బాహులేయుండు ప్రవచించియున్నవాఁడు. ఆభృగువువలన నంగిరసుండును నతనివలనఁ జ్యవనుండును నతనివలన ఋచీకుండును గ్రహించిరి. ఇట్లు పరంపరగాఁ ద్రిభువనంబుల వ్యాప్తంబైనయది. కుమారునిచేఁ బ్రథమోద్ధృతంబగు నీపురాణంబును సత్పురుషమధ్యంబున శ్రవణించిన సకలపాపవిమోచనంబును నాయుర్వృద్ధియు నయ్యెడిని. ఈహాటకేశ్వర క్షేత్రమాహాత్మ్యమును విన్న

వాని పున్నియమ్ము వర్షించుచున్న వారిధారలుంబోలె నాకాశమండలి నక్షత్ర ములమాడ్కి గంగలోని యిసుకరేణువులపగిది లెక్కింప వలనుపడదు. ధర్మ్యం బైన యీహాటకేశ్వర క్షేత్రమహాత్మ్యగ్రంథమ్మును బ్రాహ్మణున కర్పించినఁదద్గ్రంథ స్థాక్షరసంఖ్యాకసంవత్సరంబులు స్వర్గస్థితి సంభవించెడు. దీనిపఠనంబుగాని శ్రవ ణంబుగాని కొన్నిదినంబు లాచరించిన సర్వార్థసిద్ధియు సంఘటిల్లెడు. ౨౯

సీ॥ పుత్రార్థియైదీనిఁ బూర్తిగాఁజదువుచోఁ బుత్రవంతుండయి పొలుపుగాంచు.
ధనకాంక్షియైదీనిఁ దాఁ బఠియించుచో ధనవంతుఁడై మహాఘనతఁ జెందు.
పతికాంక్షయై దీనిఁ బాఠంబుసేయుచో బహుమనోహరుఁడైన పతినిబడయు.
చుట్టంబులంజూడ గట్టిగాఁ జదువుచోఁ జూచు దూరస్థులౌ చుట్టములను.
వేదవేత్తయగును విప్రుండు చదివిన. పట్టభద్రుఁడగును పార్థివుండు.
వైశ్యునకు లభించు వరధనధాన్యముల్. సుఖపడుం గరంబు శూద్రజనుఁడు.

వ॥ ఇద్దాని శ్రవణించి వాచకుం బూజించిన బ్రహ్మవిష్ణురుద్రులు ముమ్మూరును బూజింపఁ బడుదురు. ఒక్కయక్కరంబె వినిపింపనిండు. వాని కేమియొసంగియు ఋణముతీర్చుకొనఁజాలరు.

సీ॥ అభిమతంబైనట్టి యావులనర్పించి చేతులుమోడ్చి పూజింపవలయు.
ఫలవంతమగునట్టి యిలను సమర్పించి ప్రీతిపూర్వముగ నర్చింపవలయు.
“ఉత్తమంబైనట్టి హొన్ను నివేదించి దేవళ్ళఁబోలెఁ బ్రార్థింపవలయు.
వెలగల్గినటువంటి బలు నంశుకములిచ్చి వినయంబునను గౌరవింపవలయు.
బహువిధంబులైన పక్వాన్నములువెట్టి బాగుగాను దృప్తిపఱుపవలయు.
నిపుణుఁడైనయట్టి యుపదేష్ట నిట్టులఁగొలిచి శివపదంబు నొలయవలయు”

క॥ అనియిట్లు రోమహర్షణి ఘనశౌనకముఖ్య మౌనిగణమున కెలమిన్
వినిపించె నీపురాణం బనఘజనవిధేయ! శ్రీ పరాంకుశరాయా! ౩౧

మ॥ సురభాషన్ మును పట్లు బ్రాహ్మణులకున్ సూతుండు వాక్రుచ్చె. నా
గరఖండం బది సర్వ మాంధ్రమునఁ జక్కన్ వ్రాసి నేనిప్డు నీ
కెఱుఁగం జెప్పితి. నీవు నీదుసుతు లెంతే శ్రద్ధ నీమిత్రులున్
చిరకాలంబు పఠించి కాంచుఁ డికఁ దా శ్రేయంబు భూమీధవా! ౩౨

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురు కరుణాకటాక్ష సంప్రాప్త కవితాసాహిత్యనిధాన
హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తిముక్తాయ
మాన సత్సభావిష్కృతావధానవిధాన జానపాటి పట్టాభిరామా
భిధాన సమాంధ్రీకృతంబగు స్కాందమహాపురాణాం
తర్గత నాగరఖండంబునందు సర్వము
దశమాశ్వాసము
సంపూర్ణము.



## తప్పొప్పుల పట్టిక

—:o:—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౩ | ౩ | శద్ధ | శ్రద్ధ |
| ౧౬ | ౧౭ | సంక్రాతి | సంక్రాంతి |
| ౨౧ | ౨౨ | తగగు | తగదు |
| ౨౬ | ౨ | బూచిత | బూజిత |
| ౨౮ | ౨౩ | పిత | పితృ |
| ౩౨ | ౬ | మాప్పెడిక్ | మాస్పెడిక్ |
| | ౨౮ | కవ్యా | కన్యా |
| ౩౮ | ౭ | బ్రశేశించె | బ్రవేశించె |
| ౪౫ | ౨౧ | క్షాద్రి | క్షుద్ర |
| ౫౬ | ౨౯ | పేయ | సేయ |
| ౬౦ | ౨౨ | ఫెన | ఫేన |
| ౬౧ | ౧౫ | జన్మబు | జన్మంబు |
| ౬౪ | ౧౫ | నాలుగు | నాల్గు |
| ౬౫ | ౪ | ద్రవణంబు | దచ్ఛ్రవణంబు |
| | ౧౪ | దనయా ! | దనయ ! |
| | ౧౫ | ప్రావస్త్యంబు | ప్రాశస్త్యంబు |
| ౬౬ | ౨౭ | సల్లక్షుంబులు | సల్లక్షణంబులు |
| ౬౭ | ౧౧ | పదుండాత్మ | పదుండ్రాత్మ |
| | ౨౦ | తే॥ | ఆ॥ |
| ౮౬ | ౨౬ | సహస్త్ర | సహస్ర |
| | ౨౮ | శ్రీఫుల | శ్రీఫల |
| ౯౩ | ౨౩ | జ్ఞాతి | జాతి |
| ౯౪ | ౨౨ | మెల్ల | మెల |
| ౯౯ | ౧ | మద్ | మత్ |
| ౧౦౪ | ౧౬ | యొడయుక్ | యొడలక్ |
| ౧౦౮ | ౪ | లేకహూ | లేకహో |
| | ౭ | నజ్ఞాల | నజ్ఞావ |
| | ౮ | వది | నని |
| ౧౦౯ | ౨౫ | సకలేప్సిత | సకలేప్సిత |
| ౧౧౬ | ౧ | ॥ | సీ॥ |

పుట  పంక్తి  తప్పు  ఒప్పు

౧౧౬ పుటలో " అనుటయు గౌరి " అను 30 వ పద్యము తరువాత,



కం॥ అనవుడు షట్కృత్తిక శ్రీ
స్తనంధయుని నీకొసంగి చాతుర్మాస్యా
వనజాప్తవారమున సుర
ధునిలోపలఁ దీర్థమాడఁ దోతెంచితి మేమ్

అను పద్యము చదువుకొనవలెను.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౨౨ | ౬ | కుబుధు | కుజబుధు |
| | ౨౯ | తాన | దాన |
| ౧౨౭ | ౪ | మత్స్వి | మత్సి్వ |
| ౧౨౮ | ౩ | డాతితేయు | డాదితేయు |
| ౧౩౪ | ౨౮ | హారింప | హారియింప |
| ౧౩౫ | ౩౦ | నర్హ్వహాము | నర్హ్వము |
| ౧౩౬ | ౯ | గరంబుండ | గరంబుండు |
| ౧౪౧ | ౪ | దఱకు | దఱచు |
| | ౨౪ | కామహర్షణి | రోమహర్షణి |
| ౧౪౨ | ౩౦ | కరగు | కరుగు |
| ౧౫౫ | ౭ | పూర్ద్వేశ | పూర్ద్వేశ |
| ౧౫౬ | ౨౧ | వూవ | పూవ |
| ౧౬౦ | ౧౭ | ముహాౖదులు | ముహాౖద్దులు |
| | ౨౧ | నిప్పుడ | కిప్పుడ |
| ౧౬౩ | ౨ | ఁగనుట | నగుట |
| ౧౬౪ | ౧౯ | తదుత్సత | తదుత్సవ |
| | ౨౧ | వూవ | పూవ |
| ౧౭౩ | ౮ | యాడుడు | యూడుడు |
| ౧౭౪ | ౯ | యున్న | యన్న |
| ౧౭౯ | ౧౫ | హోమ | హేమ |
| | ౨౮ | హోమాది | హేమాది |
| ౧౮౮ | ౨౮ | మననుసరించి | మనుస్సరించి |

# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3—0.

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 | నీతిగీతులు (సుమతిశతకము, దానికి శ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కరణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 7 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 8 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము | ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము | ... | 0 | 8 | 0 |
| 10 | రామాయణసారోద్ధారము | ... | 0 | 8 | 0 |
| 11 | డిటో (తెలుగుతాత్పర్యసహితము) | ... | 1 | 8 | 0 |
| 12 | వైశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 13 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 14 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 15 | శంతనురాజచరిత్ర (ప్రాచీనప్రబంధము) | ... | 0 | 14 | 0 |
| 16 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 17 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 18 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | |
| 19 | సూతసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | |
| 20 | భారతీయప్రబోధము (పికుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | |
| 21 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | |
| 22 | అస్పృశ్యతానివారణఖండనము (మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | |
| 23 | భారతకథాతత్వనిర్ణయము | ... | 0 | 4 | |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | |
| 26 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా